Telugu Classics – Popular Edition Series



శ్రీమత్

# ఆంధ్ర మహాభారతము

## ఆనుశాసనికపర్వము

(తిక్కనసోమయాజి ప్రణీతము)



పరిష్కర్త

డా. తుమ్మపూడి కోటేశ్వరరావు

ఆంధ్రశాఖ

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము

తిరుపతి







ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనం - హైద్రాబాదు-4

Telugu Classics – Popular Edition Series

శ్రీమత్

# ఆంధ్ర మహాభారతము

## ఆనుశాసనికపర్వము

(తిక్కనసోమయాజి ప్రణీతము)

పరిష్కర్త
డా. తుమ్మపూడి కోటేశ్వరరావు
ఆంధ్రశాఖ
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము
తిరుపతి




ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
కళాభవనం - హైద్రాబాదు-4

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీమంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు భాషలోని ప్రాచీనసాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింప వలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వగ్రంథసముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈలోటును తీర్చి ప్రాచీనగ్రంథసంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్యఅకాడమీ ఒక ప్రణాళిక సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహాభారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట. పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతిగ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీనప్రబంధాల ప్రకటనము పూర్తయినది. సంక్షిప్తగ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్ర-మహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే భారతసంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్ర మహాభారత సంపుటములలో ఆనుశాసనిక పర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మాకందజేసిన డా॥ టి. కోటేశ్వరరావుగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు

పైన పేర్కొనబడిన గ్రంథ సంపుటాల వ్రాతప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదల కూడ చేసినవి. అందుకు అకాడమీ పక్షాన కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధము చేసి, ఆంధ్ర పాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
24-7-1974

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# ఋతశిల్పి

## I హరిహరనాథతత్త్వము

"కృష్ణద్వైపాయనం వ్యాసం— విద్ధి నారాయణం ప్రభుమ్
కోహ్యన్య పుండరీకాక్షా- న్మహాభారత కృద్భవేత్"

(విష్ణుపురాణ మందలిదిగా విష్ణుసహస్రవ్యాఖ్యలో శ్రీశంకర భగవత్పాదులు) కవిబ్రహ్మయు నిట్లే చెప్పెను.

"విద్వన్మోద విధాయి, నిర్మలవచో విస్ఫూర్తి విఖ్యాతుఁ, గృ
ష్ణ ద్వైపాయను నీవెఱుంగుము విభున్ నారాయణుంగా, విప
శ్చిద్వంద్యంబగు భారతాధ్యయనముం జేయంగ శక్తుండు ధ
ర్మా ద్వైతుండు సరోజలోచనుఁడ కా కన్యుండు తద్వ్యాప్తుఁడే"
(శాంతి. 6-476)

*1 సందర్భము వచ్చినచోట్ల నెల్ల వ్యాసమౌని నిట్లే స్తుతించినాడు తిక్కన. ఆస్తోత్ర హేతువు పరమమౌని యందలి 'లోకహితనిష్ఠ', దానిచే పరిష్కృత మైన కావ్యపరమార్థము హరిహరాద్వైత మొకటి. ధర్మాద్వైతము రెండు. ఇది ప్రబంధమందలి ముఖముగా జేయబడెనని మహాకవి భాష్యకారుగ్రచేసిన వ్యాఖ్యానము.

వేదార్థవిజ్ఞతకు రెండే రెండు విద్యలు ప్రాచీన మహర్షి ప్రతిపాదితములు 1. పరోక్షవిద్య 2. నిదానవిద్య.

*2 1 ధాతువు ననుసరించు యర్థనిర్ణయము చేయుపద్ధతి ఉదాహరణ ముగానగ్ని శబ్ద మున్నది. ఇది అగ్రి ధాతు నిష్పన్నము.

---

*1. అను శా. ప. 1-63, 2-68, 3-43, 4-314, 330, 332, 5-403.

*2. ఈవిషయము ఆంగ్లవాక్యములతోబాటు Vision in Long Darkness అన్న V. S. Agrawala గారి గ్రంథపీఠికనుండి గ్రహింపబడినది. ఆ గ్రంథము అస్యవామీయ సూక్త వ్యాఖ్య.

"Agni is derived from Agri, being the primeval principle of Creation-

"అగ్రిర్హ వైతమగ్ని రిత్యా చక్షతే పరోక్షమ్" (శత. బ్రా 6-1-1-11).

II. They (the ancients) think of the pranie power of Gayatri and see it visible in the flaming Fire and accept Agni as the symbol of Gayatri.

'యోవా అత్రాగ్నిర్గాయత్రీ సానిదానేన'. (శత. బ్రా. 1-8-2-15)

They observed the quality of mother-hood in the Earth and also in the rhythmic Creativity of the Three-footed Gayatri metre and by Virtue of the Nidana Vidya draw a parallel between the two. "గాయత్రీ వా ఏష నిదానేన" (శత. బ్రా 1-4-1-36)

వేదములను వ్యాసించిన [ఆ. శా. 4-314] వేదవిద్యోపజీవియైన వేద వ్యాస మహర్షి శబ్దమును వైదిక మే. అనగా పరోక్ష - నిదాన విద్యావగమ్యము ఇందుకే మహాభారతమన్న నామమునకే పరోక్షవిద్యాదృష్టితో-

"This range from Sankhya to Vedanta is indicated by the very name Mahabharata (Maha, Bharata) meaning "(a) Leading from (Maha) Mahat representing the Sankhya to Bharata, meaning Breath or prana referring to Vedanta. Maha is used in compounds for Mahat (Monier Williams Dictionary) and Bharata refers to Breath or prana (Satapatha-Brahmana 1-V-1-8)

— The Mystery of Mahabharata (Vol. I x/Iv-P)

ఇట్లర్థము నిర్ధారితము.

ఈవిద్యాదృష్టితో హరిహర తత్త్వమిది.

హరామ్యహం స్మర్తౄణాం- హవిర్భాగం క్రతుష్వహమ్

వర్ణశ్చమేహరిః శ్రేష్ఠ- స్తస్మాద్ హరి రహంస్మృతః

(విష్ణుసహస్రవ్యాఖ్యలో హరి శబ్దము దగ్గర శ్రీ శంకరు లుదాహరించినది)

హరిః- గజేంద్రమోక్షణే 'ఆపదం హరతీతి హరిః సర్వసంహర్తా వా హరః- హరతిసర్వం సంహర తీతి హరః హరతే రనుద్యమనేఽజిత్యచ్"

(శివసహస్ర నీలకంఠభాష్యము)

హరిహరు లిద్దరును హరించువారే యని పైవ్యాఖ్యలు నిరూపించుట బట్టి రెండు నొకే తత్త్వము.

కాక పౌరాణికముగ చూచినచో సర్జనక్రియోన్ముఖమైన *1 నీలవర్ణము విష్ణువు. ఇది శృంగారము. ఏక మనేక మగుటకైన కామన. ఇది యెప్పుడు నందమైనది. అనేకము నేకము వైపు లయించు శుభ్రతేజము హరుడు. *2 ప్రవృత్తి- నివృత్తిసమన్వయము. ఇదే సర్వభారతీయ దర్శన గ్రంథ ప్రతిపాదితాంశము. కావున నీయాతాయాత -ఓతప్రోతరూపమైన విశ్వదృశ్యాదృశ్యకారక మహాశక్తి సమన్వయమూర్తి. వ్యక్తావ్యక్త సమన్వయతత్త్వము. ఆతత్త్వము పేరు శ్రీకష్ణుడు. భారతకథాచక్రనాభి. కథాప్రపంచ సువర్ణబింబువు. (ఇది సహస్ర మందలి విష్ణునామము).

"కృషిర్భూ వాచకశ్శబ్దో- ణశ్చనిర్వృతి వాచకః
విష్ణుస్తద్భావయోగాశ్చ- కృష్ణో భవతి శాశ్వతః"

(ఉద్యో-ప. 70-5)

కృష్ణశబ్ద వ్యాఖ్యానమున శ్రీ శంకరులు (20-వ.శ్లోకము) ఉదాహరించి "ఇతి వ్యాసవచనాత్ సచ్చిదానందాత్మకః కృష్ణః" అని స్పష్టము చేసిరి. ఇదే హరిహరనాథతత్త్వము.

సగుణ నిర్గుణ సమన్వయమైన మహాతేజము ఈతత్త్వ మనాదిప్రసిద్ధమే.

"చిజ్జడానాంతు యోద్రష్టాస్యోచ్యుతో జ్ఞానవిగ్రహః సఏవహి మహాదేవస
ఏవహి మహాహరిః- సఏవజ్యోతిషాంజ్యోతిః -సఏవ పరమేశ్వరః-
శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే-"
సభేదాస్సు శ్శివకేశవయోః-(స్కందోపనిషత్తు)

---

*1. Ultra-marine blue is a noble and beautiful colour perfect beyond any other. అని Tusean Painter Cenini 'Book of the Art'

*2 స్వచ్ఛత శాంతలక్షణము. సత్యప్రతీక. ఇందుకే యీస్వామి శాంతరసాధిదైవము. అతను శృంగారరసాధిదైవమన్న ఆలంకారికనిరూపణకు తాత్త్విక సూత్ర మిదే. ఇది సౌందర్యము. అది శాంతము. సర్వేంద్రియ ప్రశమనస్థితి.

అన్న శ్రుతిధ్వని భారతమున ప్రతిధ్వనించి పై సమన్వయ రూపమైన శ్రీకృష్ణ తత్త్వము హరిహరతత్త్వముగా నావిర్భవించినది. దీనినే తిక్కనగారు కావ్యా రంభమున స్తుతించినది. అది సకల బ్రహ్మప్రార్థనము. నిష్కళమునుండి సరా సరి దిగివచ్చినది. అది సప్తమూర్తి స్వరూపమైన విశ్వము. అష్టమ తత్త్వమైన యజమాని సమ్మేళన మందిన మహాజ్యోతి. యజమాని శివుడు. నిష్కళమైన తత్త్వ మునకు తనువు హరి (లేక పైన శ్రుతి చెప్పినట్లు తనువు శివుడు అన్నను నష్టము లేదు.) ఇందుకే విష్ణురూపాయ నమః శివాయ యనుట. శరీరాత్మ సమన్వయమే హరిహరతత్త్వము. ఇదే నిదాన విద్యాదృష్టితో సర్థము. ఈ విశ్వ-విశ్వాతిగ తేజస్సమన్వయ నిధానములను శ్రుతి యనేకము సృష్టించినది.

హరి-హరసమన్వయమునకే శ్రుతి ప్రతిపాదిత నిదానములు.

| | |
|---|---|
| 1) పరావర తత్త్వము | 3) మాతృ - పితృ |
| 2) గో-వృషభ | 4) ద్యావా-పృథివీ |
| 5) వాక్కు-ప్రాణము | 6) ద్రవ్యము-ఆత్మ |
| 7) మృతము-అమృతము | 8) అగ్నీ షోములు |
| 9) స్త్రీ-పురుష | 10) బంధు (ఉన్మేషము)- బిందు (నాభి) |

ఈవిద్యయే తర్వాత ఉపనిషద్దర్శన- మతదర్శిష్టులతో సదసత్తులు, యోగ సాంఖ్య- (సగుణ నిర్గుణోపాసనలు) దైవ-పౌరుష, బీజ-క్షేత్ర, నరనారాయణ, అర్ధనారీశ్వర, తత్త్వాలుగా రూపు దాల్చినది. వేదకాలమునాటి అగ్నిషోమ తాత్త్వికసూత్రమే యర్ధనారీశ్వరతత్త్వముగా మత (సగుణ) దృష్టిగా సవ తరించినది. అందుకే భారతదేశకళాదృష్టి దానినంతగా శబ్ద-శిలావర్ణములం దుపాసించుట "అగ్నీ షోమాత్మకం జగత్"- అస్యవామీయ సూక్త మంత్రభాగ వివరణమున అగ్రవాలాగారు తర్వాత నిదే యర్ధనారీశ్వర తత్వమైన దన్నారు. (చూ. వు 63) ఇదే శీతోష్ణ శక్తులన్న ప్రతీకగా భారత మనుచున్నది. (చూ.అ. శా.4-441) శివు డుష్ణతత్త్వము. హరి శీతతత్త్వము అనిపైపద్యము. ఇదే అర్ధ నారీశ్వర తేజము. అగ్నిషోములే విప్రక్షత్త్రియులుగా (శాంతి- 6-427). ఈ రెండు తొలుత నేక యోనిగతములు.

'అగ్నీ షోమౌ కథం పూర్వం ఏకయోనీ ప్రవర్తితౌ' (శాంతి- 3-29-1) ఆ ప్రథమతత్త్వమే నిష్కళమని యుపనిషత్తన్నది. అటనుండి వికసించిన

విశ్వము శీతోష్ణశ క్తి సమన్వయ రూపమున నున్నది ప్రతిజీవి రెంటి కూడిక. కలిసి నపుడే వ్యక్తావ్య క్త- ప్రవృ త్తి నివృ త్తిసగుణ నిర్గుణ సకల నిష్కళ సమన్వయము.

ద్యౌర్మేపితా జనితానాభిరత్ర- బంధుర్మే మాతాపృథివీ మహీయమ్
ఉత్తాన యోశ్చమ్వోర్యో నిరంతరత్రా- పితాదుహితుర్గర్భమాధాత్

(ఋగ్వేదము. 1-164-33)

"Dyus is my father, my begetter, his kinship is in me. This great Earth is my kin and mother.

Between the two recumbent Bowls is the womb of the Two Parents. The father deposited his germ in the Daughter in that womb."

(V. S. Agrawala)

ఇదే సూత్రము తిక్కనగారి శ్రుతి మహత్వమైన దృష్టి క ట్లవతరించినది. ప్రాచీనకళాదృష్టి కర్ధనారీశ్వర త త్త్వమెట్టిదిగా గోచరించినదో యదే కవి బ్రహ్మకిట్లుగా గోచరించినది. ఇది యనాది సంప్రదాయము.

1*ఖజురహో దేవాలయము లందీ త త్త్వము శిల్పమూర్తియై యావిష్కరించి నది. హరిహర శిల్పమూరు లచట శిల్పులు మలచినారు. ముద్రారాక్షస భరత వాక్యమున స్మరింపబడిన అవంతివర్మ మౌఖర వంశీయుడు. ఆవంశీయుడు హరిహరనాథోపాసకులని శ్రీశ్రీధువాగారు 'ముద్ర' పీఠికలో వ్రాసిరి.

2*ఈ త త్త్వమును- ఎడమ విష్ణు చిహ్నములు కుడిప్రక్క శివచిహ్న ములుగా చెక్కవలెనని శిల్పశాస్త్రము. ఎడమ వ్య క్తదశ కుడి యవ్య క్తదశ. ఇదే

---

*1. "Composite and fused deities like Hari-Hara-images also made their appearance at this great religious centre."

*2. "According to Sanskrit authorities Hari-Hara should be Siva in right-half and Vishnu in the left"

— Khajuraho-Sculpture. (P. 19&25)
by Urmila Agrawala.

పై గ్రంథమున చివరి 3-వ బొమ్మ హరిహరనాథునిదే. కుడిచేతికి భుజంగ వలయలు, ఎడమచేతికి కాంచనకటకములు. త్రిశూల, చక్రా లుభయహ స్తము లందున్న శిల్పము వేఱొకటి యున్నదని పై గ్రంథము చెప్పుచున్నది. శ్రీగోపీ నాథరావుగారు Indian Iconography Vol. I Part I పు. 270 లో వేంక టేశ్వరస్వామి హరిహరుడే యనుచున్నారు.

దాంపత్యవియషమున స్త్రీపురుషులు సాంఖ్యమున ప్రకృతి పురుషతత్త్వము వెరసి యర్ధనారీశ్వరము. విష్ణుదేవీ తేజస్సులు వికసనోన్ముఖములైన శక్తులు సృష్టి స్వరూపములు. క్షాత్రమూర్తులు. కావుననే సోదరీసోదరులని పురాణ ప్రవచనము.

ఈ సమన్వయ రూపతేజోరాధన ఆర్షరక్తనిష్ఠము. సమన్వయమే సంప్రదాయము. ఇది యాంతరముగాని బాహిరముగాదు. ఎడనెడ కాలము వక్రించి మత కలహ ధూళిచే నది మొనుగువడి పోగా సంప్రదాయ తత్త్వవేత్తయైన కవిఋషి 'లోకహితనిష్ఠ'చే దానికి పులిగాపువెట్టి తళతళ లాడించును.

ఇట్లు వ్యక్తావ్యక్త సమన్వయసూత్రము తత్త్వమును మతపరముగా శిల్పులు- కవులు. కవిశిల్పులు వచశ్శిల్పములందు బంధించి సగుణ తత్త్వారాధకులైరి. అనగా సగుణమార్గమున నిర్గుణ తత్త్వసాధకులు బోధకులైరి. ఈమహా సంప్రదాయ ప్రవర్తకుడు వేదవ్యాసుడు. ఇది యిదని గుర్తించి వెలికి దీసిన కవి దార్శనికుడు తిక్కన.

ఈ సంప్రదాయదృష్టితోడనే తిక్కనగారు హరిహరసాక్షాత్కారావతారిలో "కరుణారసము పొంగిపొరలెడు" నన్న పద్యమున వర్ణించిరి. ఈ తత్త్వస్వరూపమేమి?

1-3 పాదాలు శివతత్త్వమును సూచింపగా 2-4 పాదాలు విష్ణుమూర్తిని వర్ణించుచున్నవి. శివుడు విషమతత్త్వము. అగ్ని. అనగా నవ్యక్త చైతన్యము "విషమస్థుఁడెయున్కి వృషవాహనుఁడు" (అను శా. 5-400) బేసిసంఖ్య విషమతకు నిదానము. 2-4 సరిసంఖ్య వ్యక్తదశకు నిదానము-సమత్వప్రతీక చతుర్భుజుడు- చతుర్ముఖుడు. వ్యక్తతత్త్వము లివి. త్రినేత్రుడు పంచముఖుడు- నవ్యక్తవిషమతా నిదానము. ఇది యేర్పడ నేర్పడుచున్నది. సమత్వమును ధరించుచున్నది.

అవ్యక్త మమూర్తము. వ్యక్తము మూర్తము. శివత్వప్రతీకలు-రేఖలు చంద్రుడు(గళమందు)మచ్చ.ఇట నంగ వర్ణనలేదు. నాభిధవళపంకజము-ఉరమున గౌస్తుభము-విష్ణుమూర్తి వర్ణనలో నంగసంఘటన ముండుటలోని శిల్పరహస్యము అవివ్యక్త-మూర్తతత్త్వమగుటయే. పైది నిష్కళము. ఇది సకలము. అది నిరలంకృతము. ఇందుకే శివునకు శశిరేఖాదులు భూషణాలుగా వర్ణింపబడక కరుణాదులకు సూచకము లనబడినవి. నాభిధవళపంకజము, హరినీలపాత్రిక, సురభి చందనమట్లు

కౌస్తుభము తొలిమలపైని రవి యట్లున్నవనుట సాలంకారవాక్యము. అది నిరలంకృతవాక్యము. అది సత్యము. ఇది సౌందర్యము. మూర్తమునన్న తాత్త్విక విషయము. ఇందుకే శీర్షస్థానము (1-3 పాదాలు), శివుడుగా (3-4 పాదాలు) అధోభాగము విష్ణువుగా వర్ణిత మగుటకు హేతువు అది అగ్ని. కారణబ్రహ్మము. సోమతత్త్వము విష్ణువు. అనగా ప్రకృతి వ్యక్తదశ. ఇది కావ్యబ్రహ్మము. రెండును కలిసిననే పూర్ణసత్యము. ఇదే వేదమన్న అగ్నిషోమాత్మకమైన జగత్సత్త్వము, తత్త్వము. ఇదే బ్రాహ్మణక్షాత్ర తేజోయుగళము. శివుడు మొదటి తత్త్వము-విష్ణువు రెండవ తత్త్వము. ఇందుకే "నావిష్ణుః పృథివీపతి". ఇందుకే ఇతడే యవతరించుట. కాని రెండు నొకేతత్త్వమునకు రెండుముఖాలు. 1వ పాదము శివుడు. 2 విష్ణువు 3 శివుడు 4 విష్ణువు- ఇది అభేదదృష్టి. కలసినతత్త్వము 'కాంతిపూర్వము' అది నిరాకారము. అద్వైతమహాజ్యోతి "యద్వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే, తదేవబ్రహ్మత్వం విద్ధివేదం యది దముపాసతే (కేన. ఉప 1-4) ఈనిష్కళమైన తత్త్వము వ్యక్తమగుట యజ్ఞము. తిరిగి యవ్యక్తమున లీనమగుట యజ్ఞము. ఈ యజ్ఞమునే భారతము వర్ణించుచున్నది.

"అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యీక్రతువు విష్ణుమయంబిది నిర్వహించి
రర్జునుడును గర్ణుడుం దగ"

ఈ పద్యము కర్ణపర్వాంత మందలిది.

యజ్ఞములు ప్రవృత్తి - నివృత్తి ముఖాలుగా ద్వివిధములు *[1]మొదటిది జన్మ జరామరణ రూపమైన సంసారయాత్రా సర్వస్వము. ఏకతత్త్వము

---

"Hence Vedanta conceives of Action as a Sacrifice performed for purposes of Creation by the Supreme Purusha himself and Conversely as the Individual Soul is said to be of the same nature as the Supreme Purusha, all action performed as a Sacrifice is regarded Purushic in Character transforming that which appears to be prakritic to a purushic energy. That is the idea of the Vedas and the same is repeated in the Mahabharata

"The Mystery of Mahabharata' Introduction p-XIX

అనేకముగా వికసించుట (జీవుడు- విశ్వము తిరిగి యేకమున-అద్వైతమున లీన మొనర్చుట నివృత్తిముఖమైనది.) దీనికి ప్రవర్తకులు పై మువ్వురు. భాస్కర సుధాంశులు కాలప్రవర్తకులు. సర్వము నవ్యక్తముఖముగా పక్వము చేయ, నుష్ణ శీతశక్తులు "అఖిలజగంబు సౌమ్యాగ్నేయ యోగ కలితంబు" (ఆ. శా.-4 444) శీతశక్తి అన్నరూపము తత్ప్రదాత. స్థితికారక మిదే.

అనలు డనగా పంచాగ్నిమూర్తి. స్వర్గము, మేఘము, పృథ్వీ, స్త్రీ పురుషులే పంచాగ్నులు. ఇది ఛాందోగ్య పంచమ ప్రపాఠకమున 4. వ ఖండము నుండి వ్యక్తీకరింపబడినది.

జీవుని తొలుతటి మనికిపట్టు ద్యులోకము అవ్యక్తము. అటనుంటి మేఘ మున జొచ్చి వర్షముబడి యోషధులందు ప్రవేశించి యన్నరూపమున స్త్రీ పురుషులలో ప్రవేశించి రూపెత్తుచున్నాడు. అతడే పురుషశబ్దవాచ్యుడు. ఈ పంచాగ్నులచే జన్మ-ప్రవృత్తి యేర్పడుచున్నది. ఇదే విషయము మండకము 2-5 విధించుచున్నది. కావున కర్మలేక యజ్ఞమునకు హేతు వనలుడు. ఈతని వ్యాపనము.

సోమో యత్ర పవతే యత్ర సూర్యః (2-6 ముండకమంత్ర భాష్యమున శ్రీ శంకరులు) సోమో యత్ర యేషలోకేషు పవతే పునాతి లోకాన్యత్రయేషు సూర్య స్తపతితే చదక్షిణాయ నోత్తరాయణ మార్గద్వయ గమ్యా విద్వదవిద్వత్ కర్తృ ఫలభూతా ——

ఇటున్మేషించిన జీవుడు సూర్యకాలాగ్నిచే దప్తుడై మరణించి స్వజ్ఞానకర్మ వ్యాప్పతబుద్ధిచే దేవయాన ధూమయానమున ద్యు పితృ లోకము లేగుచున్నాడు. ఈ రెండు సూర్యచంద్రులద్వారమున. అర్చిర్మార్గమున నేగినవానికి పునరావృత్తి లేదు. పితృలోకగామి కర్మక్షయాంతము- పైపంచాగ్ని సమన్వయమున జనించి మరణించుచున్నాడు. ఈవృత్త మనాది పంచాగ్నిరూప ప్రపంచము విష్ణుమయము. మహాక్రతుమూర్తి యతడే. విష్ణుసహస్రమందలి ప్రథమనామము-విశ్వం..ఇదివ్యక్త తత్త్వము. దానిపేరు విష్ణువు, అవ్యక్తము పేరు శివము.

"-- యవ్యక్తమనఁగ బ్రహ్మంబునా- శివంబన వినుతికెక్కి" (శాంతి-5-345)

ఇందుకే శివసహస్రప్రథమనామము స్థిరః- ఇది కదలదని స్థాణువు. ఇది

కదలనిది స్థాణువు. ఇది విశ్వమున కాధారము. పైది కదలుశక్తి.

ఈ హరిహర-వ్యక్తావ్యక్త సమన్వయమునే భారతము బోధించుచున్నది.

సంభవపర్వముతో మొదలైన కథ స్వర్గారోహణముతో ముగిసినది. అనగా నొకవృత్తము పూర్తియైనది. ధర్మరాజు స్వర్గమున కేగుచు పితృలోక దర్శనము చేసెను. దేనికిది? పరమార్థమేమి? పాండవులది దేవయానము. హరిహరనాథుడైన శ్రీకృష్ణునిచే ప్రబోధితులు కావున పెరవారిది పెరదారి. ఈ మార్గ ద్వయసూచక మాఘట్టము. ఈ విప్రతీపశక్తుల సంఘర్షణమే పై పద్యమున కర్ణార్జునయుద్ధ మనబడినది. ఈ సర్వ భారతరహస్యమైన మహావిషయము నాపద్యము వ్యక్తీకరించుచున్నది. ఇదొక మహాక్రతువట!

యుద్ధపర్వముల దనుక ప్రవృత్తి యజ్ఞము నిరూపింపబడినది. ఇది యర్థము. పూర్ణము కానందున ఫలితము స్త్రీ పర్వముగా నావిర్భవించి యను భవితకు దీని వైయర్థ్యము భాసింపజేసినది. దానితో వైరాగ్యోదయమై నివృత్తి మార్గము నన్వేషింపగా నందు సకలధర్మములు శాంత్యనుశాసనికములుగా వెల్లివిరిసినది. దానికి ధ్యేయవస్తువు- అద్వైతము ఇట్లు పూర్ణమైన వృత్తమేర్పడి వ్యక్తావ్యక్త సమన్వయము సిద్ధించినది. కావున యజ్ఞము పైనన్నట్లు రెండురకములు.

ఈ యజ్ఞమే ధర్మము. ఫలితము- ధ్యేయము. అద్వైతము. ఇది భారత ప్రబోధము. తత్సారము - వేదసారము.

# II ధర్మాద్వైతము

ధర్మ మనగా యజ్ఞము లేక కర్మ.

"దేవాన్ భావయతానేన దేవాభావ యంతువః
పరస్పరం భావయంతః శ్రేయః పరమ వాప్స్యథ"

(గీత 3-11)

ఇది వ్యక్తావ్యక్త సమన్వయ సూత్రము యజ్ఞముగా చెప్పు శ్లోకము.

(గీత 3-13)

యజ్ఞ శిష్టాశినః సంతో ముచ్యంతే- (గీత 3-13). వ్యాఖ్యలో యజ్ఞ శబ్దార్థము దేవాది యజ్ఞమని శంకరులు. గృహస్థాశ్రమము పంచయజ్ఞ స్వరూపముగా మనువు విధించెను. వానియందు నరభూతయజ్ఞములు లౌకికజీవరాసులతోడి కూడిమాడిన బ్రతుకునకు చెందినవి. (దేవ, బ్రహ్మ, పితృయజ్ఞములు) మిగిలినవి అవ్యక్తసమన్వయమును బోధించునట్టివి.

పై విషయములు యజ్ఞ మనగా సమన్వయ రూపమైన నిష్కామకర్మ యనియే చెప్పుచున్నవి. వేదము యజ్ఞక్రియనే యుద్బోధించుచున్నది. అచట *1 యజ్ఞమనగా సృష్టి. సర్జనక్రియగా చెప్పబడినది. ఆకర్మ నిస్స్వార్థము. నిష్కామకము. అవ్యక్తదశ నుండి వ్యక్తదశ మైథునీసృష్టి మూలకమై అనగా యజ్ఞ ద్వారమున ఆవిర్భవించినది. వ్యక్తిస్థాయిలో నానాత్వము నుండి ఏకత్వ- అద్వైత- ముఖముగా చేయు నిష్కామకర్మ యజ్ఞమని పంచయజ్ఞ విధానము బోధించుచున్నది. కావున నిష్కామమైన యజ్ఞమే- కర్మమే ధర్మము.

---

*1 " Sacrifice is action performed for a Creative purpose; to bring in to the world something new or different from the performer; and so it is unselfish and impersonal" —The Mystery of Mahabharata (P-173-174)

అట్లే Vision in Long Darkness పు. 127 లో The act of fecundation is a Complete Yajna- అని వివరింపబడినది.

"Dharma is a mode of manifestation of the one into the many in time and space and of the process of integration of the one."

— Manu Dharma Sastra.
Kewal Motwani.(P-25)

లౌకిక ప్రశాంతయాత్రా సమన్వయసూత్రము ధర్మము. అనగా ప్రశాంత విశ్వగతి కాధారమైనది. కర్మవినాశనాంతస్థితి యద్వైతముకాగా, దీని ముఖముగా దానిని నానాముఖములుగా నున్నధర్మమును- శోకమును తీర్చుట ధర్మాద్వైతము.

అర్థకామ స్వరూపమైన భౌతిక ప్రపంచ ప్రశాంతగతికి స్థితి నాపాదించు సూత్రము ధర్మము. ఇది భౌతిక సమన్వయము. ఈధర్మమే భిన్నద్రవ్యములను దగ్గరకుచేర్చి బంధించు సూత్రము. ధృ ధాతువున కర్థమే యిది కావున ధర్మము సమన్వయ రూపమైన సహజీవన విధానాపాదకమైనది. *1 లోకచక్రమున కది యిరుసు. అది విరుగదు విరిగినపుడు అవతారము వచ్చుచున్నది. కావున యజ్ఞమే ధర్మము కాగా యజ్ఞమూర్తి. తత్తనువు విష్ణువు. ఇందుకే "యాత్రకతువు విష్ణుమయంబు". అద్వైతము అవ్యక్తము-ఏకము. దానికి మఱొక పేరు శివము. హరతత్త్వము. కాబట్టి హరిహరసమన్వయమే మఱొక పద్ధతిగా ధర్మాద్వైతమును. ఇందుకే ధర్మాద్వైతుండు సరోజలోచనుడు- అని పైపద్యము.

ధర్మశబ్దము విధి-మత- దర్శనాది విషయములందును ప్రవర్తించును. వీని యన్నిటి కద్వైతము మిది. అనగా సమన్వయము. మతదృష్ట్యా హరిహర సమన్వయమును భారతము బోధించుచున్నది. సాంఘికవిధులను వ్యక్తి- సంఘ ఆశ్రమాది సమన్వయరూపమున మనుస్మృతివోలె భారతమును నిరూపించెను. దర్శన సమన్వయరూపమే భారతమని ధదాగారు *2 MMB లో నిరూపించిరి.

---

*1 'అయం యజ్ఞో భువనస్య నాభిః'—

అని అస్యవామీయ సూక్తము.

*2 M. M. B. The Mystery of Mahabharata.

కావున యజమాన తత్త్వోన్ముఖమైన సకల భౌతికధర్మమును సమన్వయించుట * ధర్మాద్వైతము.

"The self is the Yajamana and the entire chemical, physical, biological and psychical laws functioning in the body constitute a yajna"—

అని అస్యవామీయ సూక్తమందలి యొక మంత్రమును వ్యాఖ్యానించు వి. యస్. అగ్రవాలాగారు తమ Vision in Long Darkness గ్రంథమున పు. 135 లో వ్రాసిన దానిని బట్టి యజ్ఞ మన్నది సంఘపరముగా ధర్మమే. ఇది భిన్నరూపముల నున్నది. దాని నద్వైతముఖముగా సమన్వయించుకొను బ్రదుకెట్టిది? దానిని భారతము బోధించుచున్నది.

ప్రజాపతి త్రైవర్ణికులను సృజించి వారి నొకటిగా బంధించుటకై ధర్మమును సృజించెనని బృహదారణ్యక మనుచున్నది. కావున స్నేహసూత్రమే ధర్మము. సంఘ మర్థకామస్వరూపము. వీని నడుమ సమన్వయము నాపాదించుచు ముక్తి – అద్వైతముతో ముడిపెట్టు ధర్మ జీవనము మహాయజ్ఞము. నిష్కామయోగము.

ఇట్లు యాజ్ఞిక కర్మ ధర్మము. ధర్మము వ్యక్తము. అద్వైత మవ్యక్తము. సమన్వయము హరిహర తత్త్వము. ఇది కేవల శ్రుతి విద్యయైన నిదాన దృష్టితో.

---

* శాంతి. 6–512, 16 వరకున్న పద్యములందు వేదసాంఖ్యాది విధులన్నిటికి నారాయణుడే పరమని చెప్పబడినది. అవి యెల్ల బోధసాధనము లట. వానికెల్ల నిష్ఠ యొక్కడే నట. అది నారాయణు డట! కావున 6–476 పద్యమున ధర్మాద్వైతుండు సరోజలోచను డనుటలోని తాత్పర్య మిదియే. సకలశాస్త్రములు ధర్మవాచకములు. అద్వైతము నారాయణవాచకము. కాగా, లౌకికాలౌకిక సమన్వయమే ధర్మాద్వైతమనుట స్పష్టము. ఇదే పరావరా విద్యా సమన్వయము.

# III ధర్మము - కావ్యము

1. స్త్రియో యత్రచ పూజ్యంతే రమంతే తత్ర దేవతాః
అపూజితాశ్చయ త్రైతాః సర్వాస్తత్రా ఫలాః క్రియాః
తదాచై తత్కులం నాస్తి యదా శోచంతి జామయః"

(ఆ. శా. 46-5, 6.)

2. "ఉత్పాదన మపత్యస్య జాతస్య పరిపాలనమ్-
ప్రీత్యర్థం లోకయాత్రాయాః పశ్యత స్త్రీ నిబంధనమ్"

(46-11, 12.)

(ఈ యధ్యాయము తెనుగున ననూదితము కాలేదు.)

3. "దశాచార్యా నుపాధ్యాయ ఉపాధ్యాయాన్ పితాదశ
దశచైవ పితౄన్మాతా సర్వాం వా పృథివీ మపి-
గౌరవేణాభి భవతి నాస్తి మాతృ సమో గురుః"

(ఆ. శా. 105 - 14, 15.)
(తెనుగు 4 - 140.)

"—— యివ్విషయంబున మనువాక్యము గల దాకర్ణింపుము——
మునిజనుల నదుల సిద్ధుల - జననంబులు బుద్ధివృత్తి జర్చింపఁగ నె
వ్వనికిన్ వశంబుగావవి - దన తనయై నట్లయై యుదాత్తతఁ
బొందున్"

(ఆ. శా. 2 - 28, 29)

పై మూడు శ్లోకములు మనుస్మృతి లోనివే. క్రమముగా 3-56, 57; 9-27; 2-145 శ్లోకములుగా నా స్మృతి యందున్నవి. శబ్దములకు శబ్దములు పాదములకు పాదములే భారతమున నట్లు వచ్చుట వల్ల మనువు నిర్వచించిన వ్యక్తావ్యక్త సమన్వయ రూపమైన సంఘమును యథాతథముగా మహర్షి గ్రహిం

చినట్లు స్పష్టపడుచున్నది. (భారతమున చెప్పిన సకలధర్మా లిందలివే. వాని కింకను మెఱుగు లద్దెను.)

ఆ సంఘము కేవల భౌతికము కాదు. ఆధ్యాత్మికము. అనగా పరతత్త్వ మున కది నిదానము. నిదాన శబ్దమునకు వాచ్యార్థము లేదు. మఱి తత్త్వ సూచకము. ప్రతీక దాని కున్ముఖముగా దీర్చబడినది. *1 దీనికి కేంద్రము గృహస్థాశ్రమము. ఇది పంచయజ్ఞాత్మకము.

గతాగతములకు వర్తమానము లంకె. లౌకిక పారలౌకికములకు గార్హస్థ్యము లంకె. బ్రహ్మ - దేవ - పితృ - నర - భూత యజ్ఞములందు 2, 3 భూతములు 4, 5 వర్తమానములు. ఈ రెంటి స్వరూప సమన్వయ నిర్ధారకము మొదటిది. ఈ భూత వర్తమాన సమన్వయము నుండి సుందరమగు భవిష్యత్తా విష్కృత మగుచున్నది. మొదటి మూడు వైయక్తికములు. వ్యక్తికి పారలౌకికమునకు ముడిపెట్టునవి. మిగిలిన రెండు సాంఘికములు. మానవుల నాదరించుటే కాక చుట్టునున్న నోరులేని మెకాల నాదరించి యన్నమిడుట - వానితోడి సామరస్యమును సాధించుట యెంత భూతదయ! (ఇదే సాహిత్య మందలి ఆశ్రమ - మృగాది వర్ణనలకు మూలసూత్రము. వృక్ష - జంత్వారాధనకును)

వ్యక్తి బాహ్యముఖు డైనపుడు సంఘజీవి. ఇచట బహుళధర్మము లున్నవి. తనకు - సంఘమునకు సమన్వయించు ధర్మములు సాంఘికములు. వ్యక్తి యంతర్ముఖుడైనపుడు అవ్యక్త్య తత్త్వమునకు తనకు సమన్వయమగు తాత్త్వికధర్మ మున్నది. ఇట్లు వ్యక్తికి రెండు ముఖాలు. ఆంతర మాకాశమంత. బాహ్యము చిన్నది. అది మూడు పాదాలు. ఇది యొకటే. వ్యక్తి - తత్త్వ సమన్వయమును నిర్ధరించునది శ్రుతి. వ్యక్తి - సంఘము - కుటుంబము - విద్య - ఆశ్రమవిధులు ఇత్యాదులు చెప్పునది స్మృతి. రెంటిని బంధించి సంఘనిర్మాణము చేసిన మహాప్రతిభుడు మనువు.

వ్యక్తి బాహ్యాభ్యంతరముఖాలుగా - తత్సమన్వయమైన ముడిగా నున్నాడనుట యాధునిక మనస్తత్త్వశాస్త్రవేత్త C. G. Jung. చక్కగా నిరూపిం

---

*1 యథానదీ నదాస్సర్వే సాగరే యాంతి సంస్థితమ్ - తథైవాశ్రమిణ స్సర్వే గృహస్థే యాంతి సంస్థితమ్. (మను, 6 - 90) ఇట్లే 3 - 78. ఇంకను పలుచోట్ల దీని మహాత్మ్యము స్తుతింపబడినది.

చెను. (చూ. **Dr. Jacobi** వ్రాసిన **Psychology of C. G. Jung** అన్న గ్రంథము). వీరు వ్యక్తము (**Conscious mind**), అవ్యక్తము (**unconscious**) నకు నడుమ జీవుడు (**Self**) ఉన్నా డన్నారు. ఈ జీవు డొకసారి యిటు - నొక సారి యటుగా సంచరించునని యావేత్త జీవితసార నరిశోధన. కావున వ్యక్తి కిట్లు రెండు ముఖాలు. భౌతికాధ్యాత్మిక సమన్వయ స్వరూపుడుగా జీవుడున్నాడని మనువు దర్శించి నిర్గుణతత్త్వ మెట్లు వికసించి సగుణ మయ్యెనో తెలిపి యిచట నున్న ధర్మవిస్తృతిని చర్చించి తుదకు నిర్గుణతత్త్వమే ధ్యేయముగా చూపి స్మృతిని ముగించెను.

వ్యక్తావ్యక్తముల కెట్లు జీవుడు ఉంకెయో సంఘము - తత్త్వము రెంటికి నడుమ గృహస్థున్నాడు.




(ఇది Jacobi గ్రంథము ననుసరించి)

వ్యక్తికి బాహ్యజగత్తు కార్మికరంగము. ఇచట ధనసంపాదనా ప్రయత్న మున్నది. అది యజ్ఞనిర్వహణ సాధనము. స్వార్థము కొఱకు కాదని మనువు నిష్కర్ష. గృహము విశ్రాంతి స్థానము. కర్మఫలముగా నావిర్భవించిన శాంతికి; ఆనందానుభూతి కునికిపటు గృహము. పారలౌకిక దశలో ద్యులోక మట్టిదిది. రెండును ఆనందస్థానములే. గృహము శృంగార (ఆనంద) స్థానము. పైది వీరస్థానము. ఇది ఐశ్వర్యమున లీనమై యది శృంగారమును సృష్టించును.

ఇందుకే భారతీయ సాహిత్యమున వీరశృంగార రస ప్రాధాన్యము - మాటిమాటికి నొక్కి వక్కాణింపబడుట జరిగెను. అట్లుగా సాహితీసృష్టిని బ్రహ్మ (కవి) శిల్పించుటకు మూలసూత్రము మను ప్రసాదితము.

దాంపత్యము ద్యావా పృథివీ - వ్యక్తావ్యక్త - ద్రవ్యాత్మ సమ్మేళన రూపమైన అర్ధనారీశ్వర తత్త్వ నిదానము. (ఇందుకే కేవల్ మోత్వానిగారు తమ Manu Dharma Sastra గ్రంథమున మను నిరూపిత దాంపత్యమును వివరించి యొక్కమాటగా నది Cosmic – Symbiosis అన్నారు.) లౌకిక దాంపత్యమున కనాది ప్రథమభావము (Archetype) అర్ధనారీశ్వర తత్త్వము (ఇందుకే యంతగా నిది శిల్ప ప్రపంచము నేలుట)

ఇట్లు ప్రవృత్తి - నివృత్తి సంగమ - నమన్వయ స్థానము గార్హస్థ్యము

ప్రజలు దల్లిఁ జెందు పగిది గృహస్థ ధర్మంబునెల్ల యాశ్రమములుఁ జేరి కాదె జీవనంబు గావించుకొను గృహ, యుక్తుఁ డోషధులకు నొడయుఁ డగుట.

(శాంతి. 5–312)

అంబుజసూతి యేర్పడ గృహస్థ సమర్థముగాఁ బ్రవృత్తి ధ
ర్మంబు నొనర్చె నార్య జనమాన్యము దాని తెఱంగు సాల సూ
క్ష్మం బతికాంక్ష లేక తగుకాలమునన్ సమచిత్తవృత్తిని
త్యంబును ధర్మముఖ్యముగ నర్థముఁ గామముఁ జల్పు టొప్పగున్"

(ఆ. శా. 5 – 30.)

ఇట్టి గృహస్థు ప్రస్తుత పర్వమునకు శ్రోత. ప్రవృత్తి - నివృత్తి సమన్వయము బోధించు భారత కథలో కేవల సన్యాసమునకు స్థానము లేదు. కావున సర్వ భారతమునకు శ్రోత గృహస్థే. గీతకు పరిణతాంతఃకరణుడు శ్రోత. శాంతికి కొంత రాజు - కొంత గృహస్థు. అనుశాసనికమునకు కేవల గృహస్థే. ఇందుచే బ్రవృత్తి - నివృత్తి రూప ద్వివిధ యజ్ఞములను గృహస్థున కీపర్వము విధించుచున్నది

పర్వ ప్రారంభ మందు ధర్మజ ప్రశ్న—
లోకేవై - యథా ముచ్యే మకిల్బిషాత్
తథా ప్రశాధిమాం రాజన్ - మమ చేదిచ్ఛసి ప్రియమ్.

(1 - 14)

గీతయుఁ శాధిమాం ప్రసన్నమ్,- అన్న వానికే చెప్పబడినది. మార్గమేది? శాసింపుము, దీనితో పర్వము ప్రవృత్తి ధర్మవిషయము పెంచి నివృత్తి విషయము కుదించి చెప్పెను.

దీనికి శ్రోత గృహస్థు కానిచో దైవిక - పైతృక విధులు - శ్రాద్ధ విషయిక గో సువర్ణదానాది ప్రశంస, ధూప దీప మాహాత్మ్యము - వీనికి చోటులేదు. కాక భూదేవి వాసుదేవునితో తృతీయాశ్వాసాంతమున చెప్పిన పంచయజ్ఞ విధానము కేవల గార్హస్థ్య ధర్మమే. దానిని చెప్పి చివర భీష్ముడు శ్రోతతో— "కర్మ శ్రద్ధాఘన నీవు నట్ల నడపు గార్హస్థ్యంబుల్" (ఆ. శా. 3 - 342) అనుట పొసగని విషయమే.

ప్రవృత్తి యజ్ఞవిధానము లేక లౌకిక ధర్మములు. తత్సంబంధకథాదు లివి.

I ఆతిథేయార్చన — సుదర్శన కథ
వరస్వరూప నిరూపణ — అష్టావక్రకథ
పంచయజ్ఞ విధానము — దైవిక పైతృక విధులు (5-ఆ)
గాంధర్వవివాహాదులు. పుత్రభేదములు - భ్రాతృపవర్తన (4-ఆ)
పితృపూజ నాదులు (3-ఆ)

5. వ. ఆ. ము నందలి ఉ. మ. సం. (ఉమామహేశ్వర సంవాదము) లోని - గృహస్థ ధర్మము - పితృవిధులు - పైతృక కర్మ లందు గొడుగులు, చెప్పులు దానము చేయుట లగ్గని - వాని యుత్పత్తిని నిరూపించుటకు - జమదగ్ని కథ - దానశీలతా నిరూపణార్థమై వృషాదర్భి కథ.

ఆశ్రయా పరిత్యాజ్యతా నిరూపణమే శుక శక్ర సంవాదము. తీర్థప్రశంస- తటాక నిర్మాణ - తిలభూదానాదులు - గోదాన ప్రాధాన్యము - దీనికై నృగకథ ఔద్దాలకి కథ - రంతిదేవుని కథలు.

సువర్ణదానవిషయమున కుమారుని కథ - విద్యాదానము - దానార్హ నక్షత్ర నిరూపణ - దాన పాత్రత - దైవ పితృదాన పాత్రత - అన్నాది దానాదులు - దానప్రశంస - ఉమామహేశ్వర సంవాదము (ఉ. మ. సం.) నందలి తీర్థ - దాన విశేషములు - శుభకర్మ ప్రాధాన్యము - సాధ్వ సాధు నిరూపణ

II ఆచారకాండ :— శౌచవిషయము - ఆచారాధ్యాయము - ఆయుర్దీర్ఘతా హేతువులు - ధూపదీపారోపణ - దీనికై నహుష కథ. వ్రత విశేషములు. ఉ. మ. సంవాద మందలి ఆయు ర్విషయము - ధూపాది ప్రశంస.

III ధర్మకాండ :— వర్ణాశ్రమాచార విధులు - పరాశరస్మృతి-ఇది సాంఘిక ధర్మ ప్రపంచము.

IV సృష్టి స్వరూప వివేచన — వ్యక్తి స్వభావ విషయములు :

జనన మరణ విషయము - దీనికై వ్యాసకీట సంవాదము - పాప పుణ్యములు - జీవన విషయములు (5 - అ) స్త్రీ స్వభావ నిరూపణకు భంగాస్వను ని గాథ - స్త్రీ స్వభావము - స్త్రీ రక్షణ విషయముగా రుచి కత - పతివ్రతా ధర్మములు. కర్మ ఫల రూపనాక వైవిధ్య నిర్ధరణార్థము-ఇంద్ర గౌతమ సంవాదము

ఈ సర్వము ప్రవృత్తి యజ్ఞము. చివరిది తర్క. ఇది పై దానికి ఫలము.

<u>నివృత్తి యజ్ఞము :- I</u> ఆధ్యాత్మికవిద్యాస్వరూపమైన బ్రాహ్మణత్వ ప్రశంస కౌఱ కింద్ర మతంగ సంవాదము - వేదవాదము - సృగాల వానర సంవాదము- శంబర శక్ర సంవాదము - కార్తవీర్య పవన సంవాదము - దుర్వాసకథ. అబ్రాహ్మణునకు మంత్రప్రదానము చేయరాదనుటకై శూద్రతాపస కథ (1-276) ఉ. మ. సంవాద మందలి రాజత్వ మహిమము - నల్లే ప్రథమాశ్వాసాదు లందలివి.

ఇట్లు ధర్మ దర్శన-వ్యాపన కారకులైన వీరి ప్రశంస చాలచోట్ల నున్నది. సద్విద్య :- 1. వైష్ణవ ధర్మము (సుపర్ణ గాథ దీని కంగముగా చెప్పబడినది). 2. విష్ణు మహత్త్వ బోధ. (1 అ) నారద సనత్సుజాతీయము - హర సనత్కుమార సంవాదము - ఉ. మ సం. మందలి శైవ ధర్మములు - సాంఖ్య పాశుపత యోగములు - తపః ప్రాధాన్యము - వైఖానస విధులు.

ఇట్లా ధ్యాత్మికము ధ్యేయవస్తువుగా జేసికొని గృహస్థు సకల లౌకికకర్మ పరంపరను దాని కున్ముఖముగా తీర్చుకొనుట నీ పర్వ మనుశాసించుచున్నది.

# ప్రస్తుత పర్వము - ధర్మాద్వైతము

ప్రథమాధ్యాయమున దీనిని నిదానదృష్టితో వివరింపనైనది. ఇట మరొక దృష్టితో.

ధర్మము మతాది వాచకమును. ఈదృష్టితో నిచట నివృత మగుచున్నది.

I ధర్మములు బహుళములు. అద్వైత మేకము. దీనితో ముడివడిన ప్రతిదియు ధర్మమే. ఇది సాధనము- అది సాధ్యము. సర్వధర్మములకు మత, దర్శనాదులకు లక్ష్యమేది? వీని స్థితికి గతి యేది? వీని కద్వైత స్థానమేది? దీని ననుశాసించు పర్వము గావున 'అనుశాసనికము.'

గృహస్థాశ్రమము మృత్యుతారక మగునా? యన్న ధర్మజు ప్రశ్నకు భీష్ముడు సుదర్శనో పాఖ్యానమును చెప్పి దాని కద్వైతస్థానమునకు ముడివెట్టెను. అట్లే గోదాన సువర్ణ దానాదులకు ఫలితము లచటనే వివరించెను. ఇది యటనట ద్రష్టవ్యము,

II వ్యక్తతత్త్వము వైష్ణవము. అవ్యక్తము శివ మన బడినది. వ్యక్త విశ్వ చక్రము పరిభ్రమింప వలెనన్న నాధారముగా నిరుసుండి తీరవలెను. దాని పేరు శివము. దీనిని శివ - విష్ణు సహస్ర ప్రారంభ నామములే సూచించుచున్నవి.

* స్థిరః - విశ్వం -

ఇట్లు వ్యక్తము స్థిరమై యచలమై యుండగా దాని నుండి యావిర్భవించిన

---

*1 "Her (Saraswati's) name denotes 'flow' or 'motion' (saras) she is such in the supreme sense as being the activity (sakti) of the unmoving Siva or Brahman"— It is this rigid, un - wasting enduring Ether which is Vajra, the hard stable, lasting, un-wast -ing Vajra, the static manifestation of the static Brahman in which the Dynamic Brahman as Saraswati flows or moves"

— The Garland of Letters. (P-9-10)

పై విషయ మిచట మరొక రీతిగా చెప్పబడినది. స్థాణు వజ్రములు విష్ణు సరస్వతులు సమానతత్త్వములు.

తేజము సగుణసృష్టిచాలనసమర్థ మగుచున్నది. అదే శ్రీకృష్ణతత్త్వము. ఇది కథానాభి. తత్ప్రపంచ సువర్ణ బిందు.

ప్రతిపర్వమునందు నీ సమన్వయమును మహర్షి సూచించుచు వచ్చి యీ పర్వమును దానికి శేఖరముగా సృజించినట్లున్నది. ఇందుకే యానుశాసనిక మనుట. దీని తర్వాత నీ సమన్వయసూత్రము లేదు.

ఆరణ్యపర్వమున పాశుపతవిషయము, ద్రోణపర్వాంతమున శివతత్త్వ ప్రశంస - కర్ణపర్వమున త్రిపురాసుర సంహారము - సౌప్తికమున భూతవిష యము - నిట్లెడనెడ నవ్యక్తతత్త్వమును గథారూపమున ప్రకాశింప జేయుచు శాంత్యనుశాసనికములందు శైవ వైష్ణవ తత్త్వములను ధర్మసూత్రములుగా కుదించి సమన్వయించి ప్రస్తుత పర్వమున శివ విష్ణు సహస్ర నామములు రచించి తాను ప్రతిపాదింప దలచిన కావ్యతత్త్వమునకు ఫలభూమిగా చేసినట్లు పొడగట్టు చున్నది. ఆ సహస్రరచన కేవల తాత్త్వికోపాసనా సంబంధమైనది. కావున మత సమన్వయ రూపముగా చేసెను. ఇందుకే సుపర్ణుని విష్ణు స్తోత్రమున— "—అచ్యుత, శివ, సహస్రాక్ష - త్రినయన గోవింద హర" (ఆ. శా. 1-373) ఇట్లు హరిహరసమన్వయ మున్నది.

ధర్మాద్వైతమును భిన్న విషయ సమన్వయ సూత్రముగా గ్రహించినచో దైవ పౌరుష సమన్వయమును గ్రహింపవచ్చు.

దీని నీ పర్వము రెండు మూడు చోట్ల చెప్పెను. భీష్ముడు చెప్పిన దొక సారి (1 - ఆ.) ఉమామహేశ్వర సంవాదమున మఱొకసారి కాగా నీ సమన్వ యము ప్రవృత్తి - నివృత్తి లేక కారణకార్య సమన్వయము నొకరీతిగా స్థాపించు చున్న దనవచ్చు.

వేదములు సాంఖ్యమును యోగవిధియుఁ బాశు
పతముఁ బాంచ రాత్రంబు నా బహు విధములఁ
జెల్లు బోధసాధనముల కెల్ల నిష్ఠ
యొక్కటియొ? యివి భిన్న నిష్ఠోదితములొ?

(శాంతి - 6-512)

ఈ ప్రశ్నకు సమాధానముగా-

విను మీ తంత్రంబులకె - ల్లను నరయఁ బరాయణం బలఘుతరసం వి
త్తనుఁ డగు నారాయణుఁడ — (6-516)

అని చెప్పబడినది. కాగా తంత్రము - దర్శనము - ధర్మము ఒకే యర్థ యర్థమును చెప్పు భిన్నవాచకములు. అద్వైతము పై పద్యమందలి 'నిష్ఠ' అది 'యొక్కటి' భిన్నము కాదు. కావున నద్వైతము.

ప్రతిపర్వము నందును సాంఖ్యయోగసమన్వయమును జేయుటే గాక హరిహరస్తుతులం దెడప దడప నీ దర్శన సాధ్య తత్త్వ స్వరూపులుగా వారిని జిత్రించెను. ఈ పర్వమున 2, 3 సార్లు సాంఖ్యయోగ సమన్వయము చేయ బడుట గమనార్హము.

ప్రథమాశ్వాసము నందలి నారద - సనత్కుమార సంవాదము.
ద్వితీయాశ్వాసము నందలి హర - సనత్కుమార సంవాదము.
పంచమాశ్వాసము నందలి ఉమామహేశ్వర సంవాదము.

ఈ సమన్వయమును గీతయే ప్రతిపాదించినది. దానికి శరీరభూతమైన భారతకథయు దానినే ప్రతిఫలింప జేయుచున్నది.

పంచమాశ్వాసమున శివుడు పాశుపతమును తదద్వైత సాధనముగా ప్రతిపాదించెను. దాని కతడే కర్త. పాంచరాత్రమునకు విష్ణువట్లు. అని శాంతిపై సందర్భాభిభాషణ.

ఇట్లు ధర్మముల కద్వైతస్థి సమన్వయము, మతపరములైన రెండువెల్లులకు సమన్వయము, దర్శన సమన్వయము - సర్వము ధర్మాద్వైతమే. *1 దీని నీ పర్వములో ముగించుటతో మహర్షి దీనినే లోకమున కనుశాసించుచున్నానని నామకరణముతో సూచించెను. ఇది శాంతరసమున కుద్దీపన విభావమే కావున మహావాక్యార్థమైన రసదృష్టి నిది సుపరిష్కృత మొనర్చు చున్నది.

---

*1 పర్వ సంగ్రహమున నీ పర్వమును గూర్చి — "ఏతత్త్రియోదశం పర్వ ధర్మ నిశ్చయ కారకమ్" - (1. 2-205) అనుటచే పై విషయ మువపన్నమగుచున్నది.

# సహస్రనామరచన

దీనికిని కర్త మహర్షియే. 'లోకహిత నిష్ఠ' లో నిదొక భాగము. లౌకిక కర్మజాలమున చిక్కుకొన్న గృహస్థునకు తరణోపాయముగా మహర్షి దీనిని విధించుచున్న ట్లనిపించుచున్నది. కేవల యోగాదుల ననుష్ఠించలేని గృహస్థుని దృష్టిలో పెట్టుకొని వర్తింప జేసినాడు.

ఈ పర్వముననే విష్ణు - శివ సహస్ర నామము లున్నవి. రెంటిని తిక్కన గారు వదలిరి. విష్ణు సహస్రమును సూచించిరి. శివ సహస్రమును సూచించ నైన లేదు.

హరిహరసమన్వయసూత్రమే యీ సహస్రయుగళమునకు హేతువు. లేనిచో రెంటి నిచటనే గుది గ్రుచ్చనక్కరలేదు. మతదృష్టితో సమన్వయమును సాధించుటే గాక హరిహరనాథతత్త్వదృష్టితోడను నామసహస్రములకు ప్రాధాన్య మున్నది. ఈ పర్వప్రాధాన్యమున కిదొక హేతువన బడినదికదా! రెంటిని విడివిడిగా రచించుటయే గాక శివనామములలో వైష్ణవములు. ఇందలి పునరావృత్తము లగుట పరోక్ష - నిదాన - విద్యాదృష్టితో నొకటే నన్న సమన్వయము జపితకు దానంతట నదే సిద్ధించు నట్లుగా రచించెను. *(దైవ) నామము, నిత్యము గుణబోధకమేకాని వ్యక్తిబోధకము కాదు. ఇందుకే విష్ణు సహస్ర ప్రారంభమందే 'నామాని గౌణాని విఖ్యాతాని'- అన్నాడు- మహర్షి. గౌణ మన్నంతనే సగుణ- సాకార లక్షణమునకు గౌణత్వము పట్టినది. ఇదే శ్రుతితత్త్వమని నిదానవిద్యచే స్పష్టమే. ఈ గౌణత చేతనే హరిహరా భేదము సిద్ధించుట.

1. ఉదా:- శివసహస్రములందు — కృష్ణః (1 శ) - విశాలాక్షః (2 శ)- హరిః (7-శ)

విష్ణు సహస్రములందు - సర్వః శర్వః శివః —

ఇట్లొక పద్ధతి యభేదమును సిద్ధింపజేసెను.

---

*తత్త్వమునకు శబము వ్యంజకము (నిదానము) కాని వాచనము కాదు. ఇది వేద విద్యా సంప్రదాయము.

2. పై నామములు గుణ బోధకములు. వానికి వాచ్యార్థము లేదు. ఒక తత్త్వ మును సూచించు నంతే. కృష్ణ శబ్దార్థముగా నీలకంఠుడు -కృషిర్భూ వాచకః - ఉదాహరించి ఇతి శ్రుతేః ఆనంద సన్మాత్ర ఇత్యర్థః బ్రహ్మో త్తర ఖండేవాగోప శిశుం ప్రతి మహాదేవేన తవాన్వయే సప్తమోఽహం భవిష్యామీతి వరదానాన్ మహాదేవస్యైవావ తారః కృష్ణ ఇత్యవగమాత్"

అని పౌరాణిక సమన్వయము నుదాహరించెను.

శ్రీ శంకరుల విష్ణు సహస్ర వ్యాఖ్యలో శివః - అన్న నామమునకు-

నిస్త్రైగుణ్య తయా శుద్ధత్వాత్ శివః - సబ్రహ్మ స శివః (కఠ.ఉప) ఇత్య భేదోపదేశాత్ శివాదినామ భిర్హరి రేవస్తూయతే -

ఇట్లొకరీతి యభేదమును సిద్ధింప జేసెను.

3. తత్త్వమును సగుణ - నిర్గుణ సమన్వయ రూపమున జూపుట.
అవశః —(4శ - 7వ. నామము) దేహసంబంధా పరిహార్య దుఃఖాది సం బంధః నిపాతీ - దేహగరే నిపతి తుం తత్తాదాత్మ్యం ప్రాప్తుం శీల మస్యేతి—

ఉన్మాదః — ఉన్మాదయతీతి ఉన్మాదః మోహకః

అశ్వత్థః — సంసారవృక్షః కామ ప్రదోవా వృక్ష ఏక -

(నీలకంఠ శివసహస్ర భాష్యము.)

జీవేశ్వరైక్య బోధకముగా నామరచన కన్పించుచున్నది. తదైక్యమార్గ మును సూచించుచు కొన్ని నామాలు, నిర్గుణాత్మకుని సూచించు కొన్ని నామములు.

| | |
|---|---|
| భిక్షుః - లింగధారీ హంసః<br>భిక్షురూపః - అలింగ పరమహంసః<br>అవ్యయః - నిర్వికారః - వంటివి | ఇవి నిర్గుణ తత్త్వావ బోధకములు. |

విశాలాక్షః - మాలీ - వంటివి సగుణతత్త్వబోధకములు. ద్వంద్వాతీత స్వరూపునిగా నిర్దేశించు వానిలో కొన్ని -

దంభః — దభ్నాతి శత్రూన్ దయతీతి తథా

అదంభః — నాస్తి దంభో దమకో యస్య.

(నీలకంఠభాష్యము - శివసహస్రము)

ఇట్టి సహస్రరచన మొక మహాజ్ఞానావబోధ నుద్దేశించి శ్రుతి తాత్పర్యసీమగా మహర్షి యున్మేషింప జేసెను. ఇది కేవల ఋషి లక్షణము. ఆతత్త్వము యోగ సాంఖ్య ధ్యేయముగా నిరూపించుచు - యోగాధ్యక్షః - సాంఖ్య ప్రసాదః వ్రాయుట దర్శన సమన్వయమును చేయుటయే గాక ధ్యేయవస్తు మార్గ వైవిధ్యమును సూచించెను. అన్నిటికి లక్ష్య భూతవస్తు వొక్కటే. నామ రూపములు కల్పితములే. జ్ఞానబోధ వీని తాత్పర్యము. —

# ప్రస్తుతపర్వము - శిల్పము

ఋతశిల్పు లైతిహాసికులు. వీరి వస్తుశిల్ప మనంతరత్నాకరము. చాల వరకు వీరు వస్తుశిల్పులే. ఈ పర్వమున వచ్చిన పరశురామ, విశ్వామిత్ర, చ్యవన, నహుష, అష్టావక్ర, కుమార - ఇతిహాసము లితః పూర్వ పర్వము లందున్నవి.

(1) పరశురామ కథ యరణ్యపర్వమున నకృతవ్రణుడను ముని ధర్మరాజునకు చెప్పెను. ఇందు కార్తవీర్యుని, తన తల్లిని, భార్గవుడు సంహరించిన విషయము పెంచి యితర క్షత్రహననము నించుక సూచించెను. విశ్వామిత్ర విషయ మించుక సూచితము.

ఇదే కథ శాంతిలో మఱల కృష్ణునిచే చెప్పబడినది. శ్రోత ధర్మరాజే. ఇచట కార్తవీర్యుడు భార్గవునిచేతిలో చచ్చుటకు హేతువుగా వసిష్ఠశాప మదనముగా కల్పితమైనది. భూమిని నిఃక్షాత్రము చేసిన వృత్తాంతము విస్తరింప బడినది. తర్వాత ధరిత్రి కశ్యపుని ప్రార్థించి పతిని బడసినట్లు - దండనీతి కంగముగా నీ కథ యతుక బడెను. ఈ పర్వమున 'బ్రాహ్మణ్య - మవుల మూడు జాతులకు దుర్లభమేని' విశ్వామిత్రు డెట్లు ఋషి యయ్యె నన్న ప్రశ్నకు సమాధానముగ నీ కథ చెప్పబడినది. ఇందు పరశురామునకు పూర్వపర్వము లందు విశ్వామిత్రునకు వలె - ప్రాధాన్యము లేదు. కాగా నిట బ్రాహ్మణత్వమాహాత్మ్యమున కంగముగా నీ కథ యతుక బడినది.

(2) చ్యవనేతిహాస మరణ్యపర్వమున వచ్చినది. అచటి తీర్పు ప్రయోజనము వేఱు. ఇచట విశ్వామిత్ర జన్మకు పూర్వాంగముగా బ్రాహ్మణ మాహాత్మ్య ఖ్యాపనకై చెప్పబడెను.

(3) నహుషుని వృత్తాంతము నరణ్యపర్వ మం దజగర కథగా వచ్చినది. శాంతి. 342 అధ్యాయమున మూల మందున్నవి. తెలుగున లేదు.

ఉద్యోగపర్వమున సర్వాంగసుందరమైన శిల్పముగా చెక్కబడినది. ఇచట నాతని స్వారాజ్యపతిత్వ హేతువు (ద్రూపదీపారోపణగా) చూపబడినది. పూర్వ పర్వము లం దాకథ యట్లు సాగుటకు కారణబంధ మిచట. ఎంత విచిత్రకథా నిర్మాణము !

(4) అష్టావక్రకథ యరణ్యపర్వమున నాతని జన్మ - బ్రహ్మచర్యమును వర్ణించి యిచట నాతని గార్హస్థ్యజీవితకథను చెప్పి రెంటి నేకవృత్తముగా చేసెను. (అదొక యర్థము - యిదొక యర్థము కలిసి నిండు జీవిత మగుచున్నది)

(5) కుమారస్వామి కథ యరణ్య-శల్య పర్వము లందు రాగా నిచట సువర్ణోత్పత్తి కంగముగా సంఘటింపబడినది.

ఇట్లు పూర్వకథా చక్రము నంతకు నిట (ముడి) నాభి. పూర్వ స్థలము లందున్న కథలు నిండుగా నుండి వెలితిని కన్పింప నీయవు. తర్వాతిపర్వమున కేగునప్పటి కదే కథ క్రొత్తగా కన్పించును. ఇంతటి కల్పనావైభవము - వస్తుసృష్టి చేయుటయే కాక యిచట వానికి హేతుకల్పనయో వాని పుట్టు పూర్వోత్తరములు చూపుటయో చేయును గాన - నీ జిలుగు పనితనము - శిల్పము బ్రహ్మభేద్యము. దీని కీపర్వమే శేఖరము. తర్వాత నీ కథాసూత్రము సాగలేదు. అన్నికథలకు నిచటనే ముడిపెట్టబడుటచే నీపర్వమున కొక ప్రాధాన్య మున్నట్లు స్పష్టపడుచున్నది.

ఇంతేగాక యిట్లేకైకకథ భిన్నపర్వము లం దావృత్త మగుటచే కథా సర్వస్వానుస్యూతి యేర్పడి భిన్నపర్వముల నడుమ చిక్కదన మేర్పడుచున్నది. ఉదా:- నహుష కథ యిట చదివిన వెంటనే యుద్యోగపర్వకథ మనసున తళుకు లారబోసి యనుశాసనికము - ఉద్యోగములు కలిసిపోయి నడిమి పర్వాలను సమన్వయించుచు పాఠకుని చిత్తమున మెఱుపువలె కథ మొత్తము వెలిగిపోవును. అద్భుతకథాశిల్పము !!

భారతము సంపూర్ణమైన మానవ జీవితమును వర్ణించుచున్నది. అనగా చతుర్విధపురుషార్థములను విధించుచున్నది. దీనిచే వ్యక్తావ్యక్త సమన్వయము

సిద్ధించు చున్నది. సంభవపర్వముతో మొదలై స్వర్గారోహణమున ముగిసిన మహాకావ్య మందలి ధ్వని యేమిగా చెప్పవలయును?

"ఓం పూర్ణమదః పూర్ణమిదం - పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ - పూర్ణమే వావ శిష్యతే"

అన్న శ్రుతిని వ్యంజించు చున్నది. ఆమాటలనే - మంత్రమునే - కథా రూపమున నావిష్కృత మొనర్చినది.

వ్యక్తసృష్టి యష్టరసాత్మకము - ఎనిమిదియు వికృతిరసములే. వీని స్థాయు లన్నియు సుఖ దుఃఖాత్మకములే. ఒక్కశమమే కేవలసుఖాత్మక మని యభినవభారతి. ఈ యష్ట-మష్టకష్టములు పడి యొకదానితో నొకటి ఘర్షించు కొని ప్రధానమైన శాంతమున కుద్దీపనము లగుచున్నవి.

యుద్ధపర్వము ప్రతిదియు దుఃఖమున బుట్టి యందే లీనమైనది. కాని మహాకవి దానిని కేవల కరుణస్థాయిగా జేయక దానిని కాలప్రభావమున కంగముగా జేసి శాంతము నుద్దీపింప జేసినాడు. కర్ణ మరణవేళ కాలుం డదృశ్యాకారుండై 'కర్ణుఁడు మరణించు' ననుట నుండి తుది దాక కాల ప్రభావమున నట్లు జరిగెననుట ధ్వనింప జేయుటలో వ్యక్తికి కర్తృత్వ బుద్ధి నశించి పరమేశ్వరబుద్ధి నావిర్భవింప జేయుట ప్రధానము. ఇట వ్యతిరేక ముఖాన - యుద్ధపర్వాలు స్థిర పడుచుండగా - అనగా కాలాధీన వ్యక్తసృష్టియొక్క నశ్వరత స్పష్టపడుటచే వ్యక్తికి విరక్తి కలగక తప్పదు గదా! కావున నిట్లు వ్యతిరేకముఖాన శాంత మనుభూత మగుచుండగా—

శాంత్యనుశాసనికములు విధిముఖాన శాంతమునకు విభావాదిక మగు చున్నది. ఇందు చెప్పిన ప్రవృత్తి నివృత్తి రూప ధర్మ బాహుళ్యము శాంతము నుద్దీపింప జేయునదే. ఇదొక మహానాటకము. ఆదిముఖసంధి. స్వర్గారోహణము నిర్వహణము. నడిమి పర్వా లితరములు. పూర్వసంధి గతావస్థాదుల కిట - స్వర్గమున - నే ముడి. అదే యవ్యక్తము. *1 దాని నుండి వికసించిన

*1 "యత ఏవేతో యత స్సంభూతో భవతి" — ఛాందోగ్యము 5-9-2.

దచటికే పోవును. కాగా, ప్రకృత రస నిష్పత్తియే. అనగా *2 శాంతమే. నడిమి యంకాల వంటి పర్వాలు - ప్రతిముఖాదులై - దీనికే పోషకములు కావలెను గదా! లేనిచో కుకవి కల్పిత నాటకమై ముఖనిర్వహణ భేదము సిద్ధించును. ఈదృష్టితో నానుశాసనికమున ప్రారంభాంతములు చక్కని యుదాహరణము.

యుధిష్ఠిర ఉవాచ :—

"శమో బహు విధాకారః - నచమే హృదయే శాంతిరస్తి
యథాముచ్యే మకిల్బిషాత్ - తథా ప్రశాధిమాం రాజన్..."
(1-1-14)

ఇట్లు ప్రారంభమై భీష్మమరణమున దుఃఖితయగు గంగాదేవి నూరార్చు భగవంతుడైన - గీతాప్రభువు —

సమాశ్వసిహి భద్రే ! త్వం మాశుచః శుభదర్శనే
......... నైనం శోచితు మర్హసి
......... ......... ......... .........
తస్మాన్ మా త్వం సరిచ్ఛ్రేష్ఠే ! శోచస్వ !

---

*2 దీనికి పోషకముగా On the meaning of Mahabharata, The Mytery of Mahabharata - అన్న గ్రంథములందు పరోక్ష నిదాన విద్యాదృష్టితో భారతకథాప్రాధాన్యము తత్త్వము. దర్శన మనియే తీర్చిరి. మొదటి గ్రంథమున భారతకథ చారిత్రక - ధార్మిక - తాత్త్విక దశలందు సమన్వితమైనది. ద్వితీయగ్రంథమున భారతతాత్పర్యము శ్రుతిసారమైన దర్శన సమన్వయ మని చెప్పబడినది. ఉదా: - ఈ పర్వము 13. వది. దీని కర్థ మిదట!

"The number thirteen refers to the Heart of the System of Vedanta and so the idea of Vedanta is examined by Bhishma in this section (అనుశాసనిక పర్వభాగము) After having done his work Bhishma passes away"—

(పీఠిక - IVIII)

మాటలతో - గీతాచరమవాక్యమైన -

అహం త్వాం పాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః —

యన్నట్లు ముగియుట యెంతటి తాత్త్వికశిల్పి చేయదగినది!

ఆ ఘట్టమును ముగించుచు వైశంపాయనుడు—

"ఇత్యుక్త్వా సాతు కృష్ణేన వ్యాసేన తు సరిద్వరా
త్యక్త్వా శోకం మహారాజ! స్వం వార్యేవ తతారహ"- ఇట్లన్నాడు.

ప్రశాధిమాం - తో మొదలు, శోక త్యాగముతో నంతము. పర్వ పార్శ్వముల నిట్లు మహారసదృష్టితో చెక్కుట యథార్థమైన శిల్పము. కాళిదాసు మాళవిక నన్నాడు- పార్శ్వే ప్రమృష్టే ఇవ - ఇది శృంగారమూర్తి. అది శాంతమూర్తి. (అనగా భారతము, భారతభారతి.)

ఇంతే కాదు - ఏ కథతో నెత్తుకొన్నాడీ పర్వమును? ఎక్కడ మొదలు పెట్టెను? ఎక్కడ ముగించెను? ఎత్తుగడ దింపుగడ లందెంత బంధసౌందర్య మున్నది? అది ప్రౌఢమధురము!!

గౌతమీ లుబ్ధక మృత్యుకాలసంవాదముతో మొదలు పెట్టినాడు. కథ నెక్కడనో యాకాశమున నెత్తుకొన్నాడు. దాని తాత్పర్యమేమి? నీలకంఠు డనుచున్నాడు—

(కథ మొదలు పెట్టుచు పితామహుడు - కర్మణాంహి మహాభాగ - సూక్ష్మం హ్యే తదతీంద్రియా (1-15) అన్న దీని వాఖ్యలో) -

కాలా దృష్టేశ్వ రాధీనా మాత్మనం త్వం కథం కర్మణాం హేతుం
పుణ్య పాపయోః కారణం అనుపశ్యసి న కథం చి దాత్మానః

కర్తృత్వం సంభవతీతి భావః—

అకర్తృత్వబుద్ధి నలవరించు కొనుమన్నబోధతో ప్రారంభమై భీష్మస్వర్గ ప్రాప్తితో నంత మగు చున్నది. మనుజుని పరమేశ్వరాధీనునిగా బ్రతుకు మను చున్నది.

ఇట్టి పర్వ ప్రారంభాంతముల కనుగుణముగా తిక్కన యాశ్వాస విభజనము చేసినాడు. దీనిని 'రసశిల్పి' యధ్యాయమున చూచెదము. ఇంతేకాక పర్వనామమును- ప్రశాధిమాం రాజన్ - (1-1-14) వ్యంజించు చున్నది. అట్లు ప్రారంభించుటలో నీ పర్వ మనుశాసించునది - అకర్తృత్వ బుద్ధి - నని స్పష్టపడుచున్నది.

పర్వ ప్రారంభాంతములే గాక యొక్కొక్కకథయొక్క యాద్యంతములందు నీబంధురమైన బంధము చూడ ముచ్చటగా నుండును.

శుక శక్ర సంవాదము నందలి తుది మొద లిట్లుదాహరణము.

వేటకాని విష దిగ్ధశరమున చెట్టెండి పోయినది.

"స తీక్ష్ణ విష దిగ్ధేన శరేణాతి బలాత్ క్షతః
ఉత్సృజ్య ఫలపత్రాణి పాదపః శోష మాగతః - (5-6)

కథాంతము - తతః ఫలాని పత్రాణి శాఖాశ్చాపి మనోహరాః
శుకస్య దృఢభక్తిత్వాత్ శ్రీమత్తాం ప్రాప సద్రుమః"- 5-30

'భూజమునకుఁ దొంటె పొల్పు కంటె నెలమి సేసె' (1-158) అని తెన్గుసేత. ఇది పై శ్లోక తాత్పర్యానువాదము.

ఇది యానృశంస్యాధ్యాయము. ఇందుచే మాటిమాటికి 10, 23, 27, 28, 31 - శ్లోకములందు ఆనృశంస్య శబ్ద ప్రయోగమున్నది. ఇది తెన్గున రాలేదు. మూలము తత్ప్రాధాన్య వివక్షాస్ఫోరకముగా నున్నది.

"తముదారం మహాసత్త్వ మతిమానుష చేష్టితమ్ -
సమ దుఃఖ సుఖం దృష్ట్వా విస్మితం పాకశాసనః" (5-9.)

దీనికి తెలుగు - 'ఎండను గాలిన్ జెదరక' (1-152) అన్న వాక్యమున మూలమందలి వైరాగ్య సంపదపోయి - సమ దుఃఖ సుఖం - అని శమాత్మకతను సూచించి యానృశంస్యమును పోషింపగా - తెనుగున పక్షి పక్షిగా నుండి కథా

ప్రాధాన్యమును చిత్రించినది. మూలమున పక్షికి ప్రాధాన్యము పోయి శమచిత్త ప్రతీకగా మిగిలినది. ధర్మోపేతముగా చేయు కథాచిత్రణమున మహర్షుల ముందు కావ్యకవులు నిలువ జేరనుట నిది సూచించుచున్నది.

ఉమామహేశ్వర సంవాద ప్రారంభమున వక్తనారదుడు హిమవత్పర్వత వర్ణనమును 16 శ్లోకములందు చేసెను. అదొక ప్రత్యేకఘట్టమున కుపోద్ఘాతముగా నుండి చెప్పబోవు సంవాదవిశిష్టత కది యుపబలకముగ నున్నది.

'ఉత్తమంబగు పురావృత్తంబు సెప్పుమన్న' కృష్ణునకు నారదుడు సమాధానము చెప్పుచు ప్రారంభము నట్లు చేయుటలో దాని ప్రత్యేకత వ్యంగభూత మగుచున్నది.

దీనికి తెనుగున నొకే పద్యమున్నది. అది ప్రబంధ రచనా సౌందర్యము నివతళించు చున్నదే కాని మూలస్వాభావిక రామణీయకమును చూపుటలేదు. అట్టి వర్ణనములు ఋషుల రచన లందు హెచ్చు. తిక్కన దాని నట్లు తెనుగించుటలో *1 నాలంకారిక కావ్యపద్ధతిని చేపట్టెను. కాక మూలమం దందమగు నట్లు తెనుగున సూచించి లేనిచోట్ల తెచ్చును. సామాన్యముగ నిది యనువాదపద్ధతి. అంతకంటె నేకవి చేయదగినదియు లేదు.

ధర్మక్రమవిన్యాస మొక పద్ధతిశిల్పము. ఆధర్మ ప్రధాన కథానంతర మిదే యేల వచ్చుట ? ఇంకొక కథ నేల చెప్పరాదు ? ఆ క్రమము నందున్న యందమేమి ;

చెప్పబోవు ధర్మము లెడపెడ చెప్పక యాచెప్పుటలో దాని తర్వాతనిదే రావలయునని యనిపించు నట్లు వ్రాయుటలో నొక సౌందర్య మున్నది.

దీనికొక యుదాహరణ - (మిగిలినవి నీలకంఠ భాష్యమున చూచుకోవచ్చు.) - శ్రీకృష్ణు రుక్మిణితో స్వనివాస స్థానములను చెప్పిన యధ్యాయమున చివరి శ్లోకము—

---

*1 కావ్యపద్ధతి చాలవర కలంకారయుక్తము. ఉత్ప్రేక్షాదులతో నూహాసౌందర్యము నవభాసింపజేయుట. పద్యరచనలో నొక సొగసును దెచ్చుట. ఈయందము వేరు. ఇతిహాసపద్ధతి వేరు.

"నాహం శరీరేణ వసామి దేవి - నైవం మయాశక్త్య మిహాభిధాతుం
భావేన యస్మిన్నివ సామి పుంసి - సవర్థతే ధర్మ యశోర్థకామైః"
(11-21)

తర్వాతిది భంగాస్వనుని కథ. అందు స్త్రీ కామాధిక్యవిషయము చెప్ప బడినది. దీనిని గూర్చి నీలకంఠుడు—

"పూర్వాధ్యాయాంతే సవర్థతే ధర్మ యశోర్థ కామై రితి కామసుఖ వివృద్ధిరపి లక్ష్మీ వత్స్వ స్త్రీ త్యుక్తం . తత్ర స్త్రీషు పుమర్థే ఉ క్షయా కామసుఖ వృద్ధి ర స్తీతి లక్ష్మీ కా మేన కామిన్యః ప్రీతి మత్యో లక్ష్మీ బుద్ధ్యా పూజనీయా ఇత్యధ్యాయ తాత్పర్యమ్"—

పై యధ్యాయాంత మందలి కామశబ్దశ్రవణమున ధర్మజుని మనస్సున స్త్రీ పురుషలందు కామసుఖ మెవరి కెక్కువ? యన్న ప్రశ్న యుదయించినది. తర్వాత భంగాస్వన నికథ సమాధానముగా వచ్చెను. ఇట్లొకదాని నుండి మరొక కథ - యధ్యాయము పొడుచుకొని వచ్చును.

ఇదొక సుందరమైన తార్కికక్రమము. ఈ ధర్మములు చెప్పువారిలో సైత మొక యౌచిత్యమును మహర్షి యాపాదించినట్లున్నది. లౌకికధర్మము లను భీష్మునిచే చెప్పించెను. జీవు డెచటనుండి వచ్చెను? ఎచటికి పోవును? వాని కర్మఫల స్వరూప మెట్లు వానితో ననుగమించును? ఇట్టి ప్రశ్నలు ధర్మజు డడుగగా భీష్ముడు తానట్టి యవ్యక్త విషయమును జెప్పలేనని బృహస్పతిని ప్రార్థింపు మనగా నత డట్లే చేయగా నతడు వచ్చి జీవుని సంసారయాత్ర వర్ణించును.

ఆధ్యాత్మికవిద్యను - దార్శనికవిద్యను సనత్కుమారునిచే చెప్పించెను వైష్ణవ, పాశుపతధర్మాలను హరిహరులచే చెప్పించెను. పతివ్రతాధర్మాలను పార్వతిచే చెప్పించెను.

ఎవనితోడనో చెప్పింపక విషయ గతౌచిత్యమును బట్టి తదుచితవ్యక్తితో చెప్పించుటలో నొకప్రణాళిక మహర్షి కున్నట్లున్నది. లేనిచో నెల్ల ధర్మాలను

భీష్ముడే చెప్పగా పరాశరుడు చెప్పినట్లు కొన్ని ధర్మాల నేల వ్రాయవలెను? ఆతడు స్మృతికర్త కావున-తదర్హుడతడే. గీతను భగవంతుడే యేల చెప్పవలె? ఇంకొకనికి సాధ్యముకాదు కావున.

భీష్మ దేహత్యాగఘట్టము నం దాలంకారిక శిల్పము లేదు గాని యట్లా ఘట్టము నెవ్వడు వ్రాయగలడు?

"— వాయువుల సన్నిరుద్ధంబు సేసిన నది యూర్ధ్వ గతిం గైకొనియె నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు నాపికొనుచు వచ్చునయ్యేచోట్లు శల్యరహితంబు లగుచుండె - యాత్మ మూర్ధదేశంబు ఛేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంత దవ్వరిగి యంత నంతర్హితంబయ్యె—"
(5-468)

భవభూతి ఉత్తరరామచరిత్రలో వాల్మీకిమహర్షి నిగూర్చి బ్రహ్మ పలికినట్లు-

'ఆర్షం తే ప్రాతిభం చక్షుః'— ఈ మాట వ్రాసినాడు: తదార్ష ప్రాతిభ చక్షుస్సు లేని వాని కీ రచన కుదురని విషయము. మిగిలిన వారందఱు చచ్చిన పద్ధతి, పాండవులు మరణించిన పద్ధతి, భీష్మ విదుర దేహత్యాగము లెంత విభిన్నములు! దేవయాన జంఘాలురైన వీరి యోగశక్తిచే నాత్మోత్క్రమణము చేసికొనుట యెంత యద్భుత విషయములు! యుద్ధవీరు లందఱు చచ్చిన పద్ధతికి - ద్రోణు మరణమున కెంత భేదమును చూపినాడు మహాకవి! ఈ యద్భుత కల్పనలొక దివ్యలక్షణములుగా నైతిహాసిక రచనాశిల్పము లందు భాసించును.

సకలధర్మములు కూలంకషముగా చిత్రించి - చర్చించిన పిదప చిట్టచివరకు 'ఉమామహేశ్వర సంవాదము' ను వ్రాసెను. ఆ ధర్మములు - వర్ణాశ్రమ విధులతో మొదలై యోగసాంఖ్య పాశుపత విషయములతో ముగియుటలో నెంతటి చక్కని క్రమమున్నదో తెలియుచునే యున్నదిగదా! ఇంతేగాక యీ సంవాదము చివర బ్రాహ్మణత్వ ప్రశంస యొక్కటే చెప్పబడినది. ధర్మవిషయ మంతగా చర్చితము కాలేదు. కావున నీ సంవాదరచన - పూర్వచర్చిత సకల ధర్మములకు సారభూతముగా చేసినాడు. పూర్వమున్న ధర్మములే యిందును

పునరావిష్కృతము లైనవి. వర్ణాశ్రమ - బ్రాహ్మణ తీర్థదాన ప్రశంసాదులు రెంట నున్నవి. పునరుక్తి కదా యన్నచో లోకహితనిష్ఠగల మహాత్మునకు మానవ బోధ యత్యావశ్యకము కావున పూర్వమున చెప్పిన విస్తృత ధర్మరాశి సామాన్యు నకు మనసున పట్టక పోవచ్చునని యొకే యధ్యాయమున సర్వమును కుదించెను. ఆధునికకాలమున విమర్శ గ్రంథము లం దీపద్ధతి మనకు తెలిసినదే. దీర్ఘ విషయ చర్చాసారముగా నధ్యాయాంతములు వ్రాయుట వంటిదే యిది. దీని నుమా మహేశ్వరుల ద్వారమున చిత్రించుటతో పురాధర్మ వృత్తమున కొక వైశిష్ట్య మబ్బినది.

ఇట్టి పర్వము తాత్త్విక - కథా - కవితా శిల్పములచే ప్రధానముగ నున్నది. ధర్మ - సహస్రనామ - దర్శన విషయములు శాంతరస పోషకములే కావున నిందు ధర్మాద్వైత మట్లు ముడివడి యున్నది. కావున నిది ప్రధానపర్వము. లేనిచో శాంతిపర్వము కంటె భిన్నముగ పరిగణింపనక్కరలేదు. నిజానికి కొన్ని ప్రతులు శాంతి కంగముగనే పరిగణించినవి. అనేకప్రతులు ప్రత్యేకపర్వముగనే గణించెను.

(చూ. భండార్కరు ప్రతి. ఆనుశాసనిక పీఠిక.)

—: O :—

# రసశిల్పి

## I మూలప్రతి

దీనిని నిర్ణయించుట కష్టము. కాని గ్రుడ్డిలో మెల్లగా నీ ప్రతి ననుసరించె ననవచ్చునే గాని యీ ప్రతినే యనుసరించె నన వలను పడదు. ఈ దృష్టితో భండార్కరు అనుశాసనిక ప్రతి ననుసరించి - యందలి యనుబంధము ననుసరించి యిది వ్రాయబడుచున్నది.

పై ప్రతి యనుబంధ మం దుదాహృతములైన —

శ్యేనకపోతోపాఖ్యానము (అనుబంధ సంఖ్య No. 8 ఇట్లే క్రిందివియు) విష్ణు ద్వాదశ నామములు. (12) హరిహరస్కందాదులు చెప్పిన ధర్మరహస్యములు. (14) శివకృత హరిస్తుతి. (16) సావిత్రీ జపము. (18) ఉపమన్యుతన్మాతృకృత శివస్తవము. (4) ఇవి కేవలౌత్తరాహ ప్రతులందలివి. ఇవి యనూదితములు కాలేదు.

ఇట నొక ముఖ్యవిషయము. శివసహస్రము తిక్కనగా రనువదించలేదు. విష్ణుసహస్రము నందలి మొదటిపేరు - చివరిపేరును గ్రహించి దానిని (5-324) సూచించి వదలెను. అట్లే శివసహస్రమును సూచించవచ్చు. పోనిండు. ఇది కేవలౌత్తరాహ ప్రతులందలి దందమా? భం. ప్ర. పీఠిక యటు చెప్పలేదు. కావున నేమనవలయును ?

కేవలాంధ్ర భారత మందున్న —

1. ఆ. ము— సౌపర్ణోపాఖ్యానము - నారదసనత్సుజాతీయము - విష్ణుమాహాత్మ్యము - మద్రరాజవ్యాస సంవాదము.
3. ఆ. ము— పరాశరస్మృతి - రంతిదేవ గో సంవాదము - గోమతీశ్రుతి - ఇంద్రమాతలి సంవాదము.

4. ఆ. ము— హర సనత్కుమార సంవాదము- నారద పుండరీక సంవాదము.

5. ఆ. ము— విష్ణుజపము - (ఔత్తరాహ ప్రతిలోని సావిత్రీజపము బదులిది దాక్షిణాత్య ప్రతులందున్నది.)

ఇట్టి ఘట్టములు దాక్షిణాత్య ప్రతులందే కలవని భం. ప్ర. నిర్ణయము. (చూ. P. Lxxiii-iv)

కావున తిక్కనగారి ప్రతికి మూలమిదే. కేవల తంజావూరి సరస్వతీ మహల్ ప్రతియందు మాత్రమే కల యింద్రమాతలి సంవాదము (10 A - ఇది భం ప్ర. అనుబంధ సంఖ్య) తెలుగున నుండుట చూడగా నా మహాత్ము డనేక దాక్షిణాత్య ప్రతులు పరిశీలించినట్లు స్పష్టపడు చున్నది.

ఇంతేకాక విశ్వామిత్రోపాఖ్యాన సందర్భము— ఇంద్రమతంగ సంవాదముతో నారంభమై వీతహవ్య కథతో నంతమగు క్రమము దాక్షిణాత్యప్రతులందలి విషయమే యని పై పీఠిక. (ఔత్తరాహ ప్రతులందు- గోరఖ్‌పూరు ప్రతిలో 1, 3, 27, 28, 29, 30- అధ్యాయాలు. క్రమము పోవు చున్నది. అపుడు కొంత విషయము ద్వితీయాశ్వాసమునకు రావలయును. ప్రథమాశ్వాస ప్రారంభమున కొంత రావలెను ఇట్లు క్రమము లేదు.)

ఐనచో దాక్షిణాత్యమే మూలమని నిశ్చయించుటకీ క్రిందివి బాధకములు-

(1) బ్రాహ్మణ ప్రశంసాపరమైన యింద్రాగ్ని సూర్యశచీ సంవాదము (No.1 భం. ప్ర. అనుబంధము)

(2) వత్సనాభునికథ (No.2) ఇదికృతఘ్నతా ప్రాయశ్చిత్తమును చెప్పుకథ.

(3) హవ్య - కవ్య విషయక నారద మార్కండేయ సంవాదము (No.7)

ఈ దాక్షిణాత్య ప్రతిగతవిషయముల నాంధ్రీకృతములు. తెనుగింపబడి యున్నచో మొదటి రెండు ప్రథమాశ్వాసమున మద్రరాజవ్యాస సంవాదమునకు మొదటిది ముందుండ వలసినది. రెండవది సుపర్ణుని కతకు పూర్వమందో - పరమందో రావలెను. మూడవది 2.వ ఆ. ము. నష్టావక్ర కథ తర్వాత భీష్ముడు

శూద్రయోనుల మునులు *1 పుట్టదురన్న విషయము చెప్పెను. దాని తర్వాత నారద మార్కండేయసంవాద ముండగా తెనుగున దానవిషయము వచ్చెను. కావున నే ప్రతి మూల మనవలెను ? దాక్షిణాత్య ప్రతులే మూలములు. కాని కొన్నిటిని తెనుగించ లేదు. కారణము తెలియదు. ఇది గ్రుడ్డిలో మెల్లయనుట కర్థము.

కాక మహాకవి మూలమందలి ప్రతివిషయము ననువదించడు. తద్ఘట్టాభిప్రాయమునే తత్సారమునే భాష్యకారుడై వ్రాయునే కాని మొత్తము ననువదించడు.

ఉదా :— మద్రరాజవ్యాస సంవాదమున – శల్యప్రశ్నలు – తాని తీర్థాని
భగవన్ ఫలార్థాశ్చ హకే ఽఽ శ్రమాః కఇజ్యతే కశ్చయజ్ఞః
కోయూపః క్రమతే చక ః—

కశ్చాధ్వరే శస్యతే గీతి శబ్దైః – కశ్చాధ్వరే గీయతే వల్గుభాషైః
కోబ్రహ్మ శబ్దైః స్తుతిభిః స్తూయతేచ – కస్యేహవైహ విరధ్వర్యః
కల్పయంతి పర్ణాశ్రమే గోఫకే కశ్చసోమే – కశ్చోంకారః కశ్చ
వేదార్థ మార్గః
పృష్టస్తన్మే బ్రూహి సర్వం మహర్షే – లోకజ్యేష్ఠం యస్యవిజ్ఞాన
మాహుః
(భం. ప్ర. P. 797-800)

“మద్రనాథుండు – యెద్దాని నెఱుగుట యెఱుకలకెల్ల నెక్కుడని
సభక్తికసమ్మతి బ్రార్థించి యడిగిన —” (1-163.)

అని మాత్రమే వ్రాసెను. పై శ్లోకము లందలి చివరిమాట నొకదానినే తెనుగించెనన్నమాట ! దానికి సమాధానము మూలము 30 – 35 శ్లోకముల వర కుండగా

---

*1 ఋషీణాంచ నదీనాంచ సాధూనాంచ మహాత్మనామ్ – ప్రభవో నాధిగంతవ్యః స్త్రీణాం దుశ్చరి తస్యచ. తస్మాదత్ర చింతాకర్తవ్యా మహర్షీణాం సముద్భవే. (భం. ప్ర. ఆ. శా. P – 844) దీనికి తెనుగుపద్యము 2-29 పై శ్లోకము తర్వాత నారద మార్కండేయసంవాదము. తెనుగున నా పద్యము మడమలు త్రొక్కికొని రావలసి యుండగా రాలేదు.

తిక్కన రెండాటవెలదులు, నొక్కవచనమును మాత్రమే వెచ్చించెను. ఇప్పుడిది పై ఘట్టానువాద మనుటా? అనగా దానిని కుదించి చెప్పెననవలెనా? లేక యింకేదో ప్రతిమూలమై యున్న దుండియుండవలెనది మనకు చిక్కలేదనుటా? కొంత యీదృష్టితోడను పరిష్కరింప వలసియున్నది. అనువాదము మూలాభిప్రాయమే కాని మూలఘట్టానువాదము కాదనుట పై సంవాదము ధ్రువపరచు చున్నది.

తిక్కనగా రనువదించని శివమాహాత్మ్యక విషయములైన నాల్గధ్యాయాలు గ్రంథప్రతులు (G) లో లేవనియు తెలుగు ప్రతులు (T) లో కలవనియు గావున తిక్కన గ్రంథలేఖన ప్రతులనే యనుసరించి యుండవచ్చునని భం. ప్ర. పీఠిక (31 పుట) యథసూచికలో గుర్తించిరి. ఇది పరిశీలనార్హమే. ఇట్టివాని చర్చ కిది యదనుకాదు.

అనుశాసనికమున కొన్ని విషయము లనువదింపబడలేదని భం.ప్ర. (పీఠిక P - 31) లో క్రిందివాని నుదాహరించినది.

I. కర్మఫలచర్చ (7). II. సృగాలవానర సంవాదము. (9). III. దశవిధ ధర్మాలు (13). IV. శపథకథ (96). V. హాస్తికూటము (105). VI. యుధిష్ఠిర - బృహస్పతి సంవాదము (112 - 14) VII. శాండిలీసుమన స్సంవాదము (124). VIII. వంశాను కీర్తనము (151). IX. భీష్మ మరణ దుఃఖితయగు గంగను కృష్ణద్వైపాయను డూరార్చుట. మూలమున కృష్ణు డోదార్పగా కొంత వ్యాసుడు. తెలుగున కేవల మితడే.

ఇది పొరపాటు. నాల్గవది యైన శపథకథ యొక్కటే తెనుగున రానిది. మిగిలిన వన్నియు ననూదితములే.

I. దైవ పౌరుష కథనానంతరము 1 వ ఆ. ము

II. సుపర్ణకథానంతరమున 1-273, 74.

III. ఆ సందర్భమున లేదు కాని 5-174 పద్యవిషయమిదే. ప్రథమాశ్వాసమున రావలసినది పంచమమునకు పోయినది.

V. ఇంద్ర గౌతమ సంవాదమేయిది (4వ ఆ. ము.). కాని యి దన్ని ప్రతు లందును విషయసూచికలో నింద్రమతంగ సంవాదమనియే ముద్రితమై యున్నది.)

VI. 4-246 నుండి 279 పద్యాల వరకున్న విషయమిదే.

VII. 4-355-362 పద్యము లందున్నది.

VIII. 5-313-14

IX. అంతయు మూలము ననుసరించియే యున్నది. (కాని విషయసూచికలో గంగను కృష్ణద్వైపాయను డూరార్చుట - యని ముద్రించిరి. దీని ననుస రించి పై ప్రతిపీఠిక యట్లు వ్రాయుట. ఘట్టము తీసి చదివినచో నంతయు మూలానుసారమే.)

*1 ఈ పొరపాట్లకు కారణము పైవానిలో నైదవది తక్క మిగిలిన వేవియు విషయసూచికలో పూర్వముద్రాపకులు ముద్రింపకుండుట. (ఉస్మా నియా ప్రతియందు నిట్లేకలదు).

---

*1 ఈవిషయము ప్రస్తుతపరిష్కర్త భండార్కరు ప్రతి ప్రధాన సంపాదకులు శ్రీ దండేకర్ గారికి వ్రాయగా వారు దీనిని గూర్చి సరిచూచుకొందుమని సమాధాన మిచ్చిరి.

# ఆశ్వాస శిల్పము

పర్వ ప్రారంభాంతశిల్పము పైన చూచితిమి గదా తదను గుణముగా నాంధ్రశిల్పి యాశ్వాసవిభజన చేసినా డంటిమి.

1 – వ ఆ. ము. గౌతమీలుబ్ధక సంవాదముతో ప్రారంభమై శ్రీమన్నారాయణుడు సుపర్ణునకు స్వస్వరూపావబోధ కల్గించుటతో ముగిసినది.

2 – వ ఆ. ము. అష్టావక్రకథతో నారంభమై – గోదానఫలరూపమైన గోలోక ప్రాప్తితో నంతమగుచున్నది.

3 – వ ఆ. ము. అనుష్ఠానయోగ్యము లైన వేదాధ్యయనాధ్యాపన బ్రహ్మచర్యాది సద్విషయ ప్రస్తుతితో ప్రారంభమై వ్యక్తావ్యక్తసమన్వయ కర్మమైన పంచయజ్ఞవిధానముతో సాంతము.

4 – వ ఆ. ము. ధూపాదిమహత్త్వస్తుతితో నుత్థితమై యుమామహేశ్వర సంవాదారంభమున లీనమై——

5 – వ ఆ. ము. మణుల పైసంవాదముతో మొదలై భీష్మ స్వర్గారోహణముతో సమాప్తమైనది.

ఇట్లు ప్రారంభములు కర్మవిధానముతో మొదలై యవ్యక్తవిషయముతో ముగియుట వ్యాసపర్వనిర్మాణ శిల్పానుసారి. మహర్షి ముఖ నిర్వహణసంధులు చూపగా తదనుసారియై మహాశిల్పి తక్కిన సంధిత్రయమును మూ డంకములుగా విభాగించెను.

ఇది కాదన్నచో మూలగ్రంథమందలి 168 (గో. ప్ర.) యధ్యాయముల (భండార్కరు ప్రతిలో 154 అధ్యాయములు) లో మొదటి 18 అధ్యా – ప్రథమాశ్వాసముగాజేసి, 19–73 వరకు ద్వితీయాశ్వాసముగా విభాగించి, తృతీయము 97 అధ్యా. వరకు గ్రహించి, చతుర్థముగా 98–140 వరకున్న విషయమును తెనుగించి, 140–168 తుదివరకు పంచమాశ్వాసముగా ననువదించుటలో నర్థము కనుపింపదు.

ప్రథమాశ్వాసము 18 అధ్యాయముల విషయమై - ద్వితీయము 54 అధ్యాయముల విషయమా? - ఇంత భేదము దేనికి? - కావున నావిభజనలో పై యర్థ మూహ్యము. కాక ప్రత్యేకధర్మముల కొక్కొక్క యాశ్వాసముగా విడదీయుటయు ద్రష్టవ్యమే.

ఉదా :— గో సువర్ణ దానాదులు. శ్రాద్ధకర్మ కంగభూతములైన వానినెల్ల తృతీయమున సంగ్రహించి-ధూపదీపాది విషయముతో చతుర్థమును ప్రారంభించెను. దీని నుమామహేశ్వరసంవా దారంభముతో ముగించి యదే విషయముతో పంచమ మారంభించెను. ఇట్లే, ద్వితీయము గోదానవిషయముతో నంతమై దానితోడనే తృతీయారంభము జరిగెను. దీనిచేత రెండాశ్వాసములకు నడుమ సన్నివేశ నిబిడత్వము వచ్చుచున్నది. నాటకమున నంకావతారము వంటిదిది.

మూలగ్రంథ ప్రధాన తాత్పర్యానుసారము గావించిన యాశ్వాసవిభజన యందలి సౌందర్యమే యాశ్వాసశిల్పము.

# కథానువాదము

సామాన్యముగ ననువాదకుని పని మూలవిస్తృతిని కుదించుట - మూల క్లుప్తతను వర్ణనాముఖమున విశదీకరించుట. మూలము కొన్నిచోట్ల గర్భిత సౌందర్య పరకముకాగా తిక్కన దానిని విస్తరించి వ్యాఖ్యాప్రాయముగ వర్ణించును. మూలము వర్ణించినచో తిక్కన కుదించును. ఇది మొత్తము మీద చెప్పినమాట. ఈపర్వమున కథావిషయమున క్లుప్తతనే పాటించెను. ఉదాహరణముగా — కుమారస్వామికథ, నహుషోపాఖ్యానము - లు చూడవచ్చు. తారకమరణ మెట్లు సంభవించెనని ధర్మజుడు ప్రశ్నింపగా భీష్ముడు 86 వ. అధ్యాయము మొత్తమున సమాధానము చెప్పెను. నహుషపతనకారణ మేమన్న ధర్మజప్రశ్నకు భీష్మ సమాధాన మాతని దుర్గర్వము హేతువుగా నతడు మునివాహనుడగుట-యగస్త్యు శాపము, ఇత్యాది కథకోసము మొత్తము 100-వ యధ్యాయము వెచ్చింపబడెను.

I ఈ రెండుకథలు ధర్మజునకు శ్రుత పూర్వములే. కావున నాంధ్రశిల్పి పృచ్ఛకుని ప్రశ్నలను తీసివేసి కథను ప్రస్తుతమునకు చాలినంతగా కత్తిరించెను. అనగా సువర్ణ - ధూపదానాంగములుగా పైకథలు రాగా కథాప్రాధాన్యము పోయి నట్లే గావున తదనుగుణముగా వానిని ప్రవర్తింపజేసెను. మూల మందిది లేదని కాదు. కాని యచట కథాశ్రవణాభిలాషిగా పృచ్ఛకు డుండగా నత డిదివరకే విన్నవాడు కావున తిక్కన్న తదభిలాషిగా చిత్రించలేదు. ఇదొక పద్ధతి క్లుప్తీకరణ.

II గోరఖ్‌పూరుప్రతిలో 39 వ. అధ్యా. రుచికథ. ఇందులో 10 (28-30) శ్లోకములలో నింద్రుడే యే మాయారూపములలో వచ్చునో గురువు శిష్యునకు వివరించెను. తెనుగున నొకే యొక (2 - 188) పద్యమున్నది.

సుదర్శనుకథ (2-వ. అధ్యా.) లో నామె యందమును జెప్పుచు — 'తాదృగ్రూపా న నారీషు భూత పూర్వా'— అనగా 'అమరపురంధ్రీ రామణీయ కంబు నిస్సారంబగు నట్లుగా' నని (1-45) తెలుగు జిలుగు.

అతిథివచ్చి యోఘవతి నభిలషించెను. అచటి శ్లోకము
'తథేతి లజ్జమానా సా తమువాచ' (2-51.)

తెనుఁగు — సతి దన పతివచనంబులు - మతిఁజొనుపుం దెంపు మాను మాన
వెఱచు న
య్యతిథి పనుపుసేయక త్రో-చు తలం పలవఱుచుఁ జేయఁ జూచుం
దలరున్

ఇట్టు లురియాడు చిత్తంబు నేట్టకేని
నాథుచెప్పిన ధర్మంబునకుఁ జొరంగ
నూలుకొల్పి నిర్ణయమునఁ గీలుకొన్న
లజ్జ వ్రేగున బోలెవ్రాలంగ మోము (1-72, 73.)

ఈ యమూలకవర్ణనమందలి మొదటిపద్యము పాత్ర చిత్తవృత్త్యుద్బోధకము. 2-వ. పద్యపు చివరివాక్యము లజ్జమానాసమాససౌందర్య వ్యాఖ్యానము. మూలమున సౌందర్యము గర్భితము (Implied ). తెనుగున వర్ణితము(Described). సామాన్యముగా తిక్కనగారి మార్గమిదే.

III గరుత్మంతుని కథలో నశ్వవర్ణన. ఇదికేవల ప్రాబంధికరచన. అచటి ప్రౌఢోహలు - అలంకారాలు దాని యపూర్వసౌందర్యమును వివక్షించుచు చూచు కద్రూవినతల దర్శన వ్యామోహమును తెల్పుచు పన్నిదము సఱచుటలోని సామంజస్యమును నిరూపించుచు తర్వాతి కథాప్రవర్తనకు మెట్టు కట్టుచున్నది.

IV భంగాస్వనుని కథలో నింద్రు డాతని సంతానము నడుమ పోరపొచ్చెములు రగుల్పగా వారు కలహించి చచ్చిరి. అప్పు డాతల్లి

సంతప్తా ప్రరురోద (12-32) అని మాత్రమే యుండగా స్త్రీ స్వభావోచితమైన దుఃఖానుభావవర్ణన మిక్కిలి సొగసై కరుణరసాంగత్వము చెందుచున్నది. (చూ. 1-299)

ఆమె యేడ్చుచు నింద్రునితో 'కరుణమబ్రవీత్'— (12-33)
'కరుణ మొగంబునందు గనుంగొని' - (1-300)

299 – పైపద్యమున కరుణ రసానుభావ వర్ణనము. కావున నింద్రు డామె మొగాన వ్రేలెడు కరుణను జూచి యని తర్వాతి పద్యము. కాక రసము నిత్యమను భావ ముఖముగనే కదా వ్యంజింపబడుట. ఇట్టి నాతని రచనమున తామరతంపర. మన స్తత్వ చిత్రణమే కాక యాతనిరచన సర్వథా యనుభావముఖముగనే యావిష్కృతమైనది. వర్ణన మనగా ననుభావవర్ణనమే. వర్ణనాత్మకం కావ్యమ్మనుట లోని తాత్పర్యమిదే.

V నృగచరిత్రలో (70 అధ్యా.)

భవాన్ దాతా భవాన్ హర్తే త్యథ తౌ మామవోచతాం (13)
దేశ కాలోప సంపన్నా దోగ్ధ్రీ శాంతాతి వత్సలా
స్వాదు క్షీరప్రదా ధన్యాఽమమ నిత్యం నివేశనే
కృతంచ భరతే సా గౌర్మమ పుత్ర మపస్తసమ్ (16–17)

దీని యనువాదము——

"ఇచ్చిన వారలు కొనఁగా – వచ్చిన యడ్డంబుగలదె ? వసుధాధిప ! యం
చిచ్చఁగడు నొచ్చి పలికిరి – వెచ్చని నిట్టూర్పు లడర విప్రు లిరువురున్"
"పాలుగడు బెక్కు దాని సబాము లెన్న–పెయ్య కర్మిలి గలదు మ త్ప్రియ సుతుండు
పాల కేడ్చిన యపుడ చన్నట్టు నిచ్చు– నేది ప్రొద్దైన నట్టి గో వెందు గలదు?
"శ్రీవోలెనింటిలో నా । గోవుండఁగ"—(3–427, 28)

ఎంతసొగసు. భవాన్ భర్తా–యనుటకు 'ఇచ్చిన వారలు కొనగా వచ్చిన' యనుటలో నెంత గడుసుదన మున్నది ! ఆబ్రాహ్మణుని కోపమెంత యణచుకొన్నను నది దాగక బయటపడనే పడినది. రాజుముందు బైటపడుటకు వీలులేదు. పడకుండ నుండుటకు వీలులేదు. వెచ్చని నిట్టూర్పులన్న వర్ణన రసపరిధిలోనిది, కోపవ్యంజకము.

ధన్యామమ నివేశనే – శ్రీ వోలె – ఎంతపవిత్రానువాదము.

మమపుత్ర మపస్తనమ్ కృతంచ – యన్న మూలమెంత వక్రోక్తి సుందరము. కావుననే యనువాదకుడు పైరీతి మార్చుకోవలసి వచ్చినది.

# * సౌపర్ణో పాఖ్యానము

దీనిని చిక్కని ప్రబంధముగా దిద్దినాడు మహాకవి తిక్కన.

ఆదిపర్వమందలి యీ కథ (కద్రువ) తల్లి తన సంతానమున కేల శాపమిచ్చె - నన్న ప్రశ్నకే సమాధానము.

కథను రెండు ఖండాలుగా చేసినచో ప్రథమము వినతా దాస్యవిషయము. ద్వితీయము తదవసరణ మూలకమైన సువర్ణ సుధాసయనము. తిక్కనగారి తీర్పులో దీనికే ప్రాధాన్యము. ధర్మజ ప్రశ్న సుపర్ణుని మాహాత్మ్యము వినిపింపు మనగా భీష్ముడు గరుడి కత చెప్పెను. కావున కథలో ప్రాధాన్యము దీనికి. కద్రూ వినతల కథకుకాదు. ఇది దాని కంగము.

ఇందు చేతనే యప్రధానమైన యీ కథ గరుత్మంతుడు జనించిన తర్వాత నడుమ చెప్పబడినది. ప్రధాన విషయమైన గరుడి జన్మను ముందు చెప్పుట ధర్మజప్రశ్నకు సరియైన సమాధానము. ఇందుకే వినత దాస్యము నేకవాక్యము ననే సూచించి కవి మిన్నకుండుట. నన్నయ్యగారికథలో దీనికి ప్రాధాన్యము కావున దీర్ఘీకరించెను. తిక్కనగారి కథా ప్రణాళికలో దీనికి ప్రాధాన్యము లేదు.

ఈ కథ లోకవృత్తాంత సముచితమైన పద్ధతి - రచన - లో కవి సంఘ టించెను. లోక మందాకథ యెట్లు జరుగుటకు వీలున్నదో యట్లుగా వ్రాయుట. లోక స్వభావో పేతమైన కథనపద్ధతి యని యర్థము.

ఒక కుటుంబ మున్నది. సవతులున్నారు. వారి నడుమ పొడుపులు, దెప్పుళ్లు - ద్వేషము - కష్టసుఖములు - ఇట్లుండును గదా ! ఆ పద్ధతితో నీ కధ చెక్కబడినది. కథాంతమున కథాశిల్పసూచకముగా కవి——

---

* ఈ వ్యాసము భారతి పత్రికలో వచ్చినది. దానినిట గ్రహించుట కనుమతించిన తదధిపతులకు కృతజ్ఞతలు.

— 'మానవలోకకలిత బహుళానందకరంబు' (1-272) అన్నాడు. పై స్వభావోచితముగా కథాయోజనము జరిగినది.

కద్రువ కింటి నిండుగా సంతానము. పాపము! వినతకు లేదు. ఆమెకు వగపు మాత్సర్యము గల్గి యొక యండము నవియించెను. తనకు లేదని వగపు. దానికున్నదని మాత్సర్యము. సాపత్న్యమనగా నింతే. ఆ యవియించిన గ్రుడ్డు నుండి పూర్వాంగ దార్ఢ్యముగల కుమారు డుదయించి

"ఇరువుర మేము పుట్టుదు మహీనపుమేనులతో —

— న ప్పెనుపు బొందగ నీ కవియించి తిట్లు మ

త్సరమున జాపలంబునను — (1-172)

అని శపించెను. శాపకారణము మాత్సర్యము. ఎవరిని గూర్చి? కద్రువను గూర్చి. ఆమెకే దాసి యగు మన్నాడు కొడుకు. ఆ మాత్సర్యకారణమున తన కపరాంగ హైన్యము సంభవించినది. ఆ కోపమున శపించెను. శపించి తన దారిన తాను పోలేదు. మాతృదేవత యమాయకురాలు. ఉత్తమురాలు. మెత్తనిది కోపముననేదో యన్నాడు. శాపభీతమైన తల్లి యేమగునో యని తమ్ముని పుట్టుక వరకు వేచియుండి తర్వాత సూర్య సారథ్యవృత్తి కేగెను. యన్మాహాత్మ్య మర్థించి ధర్మజుండు ప్రశ్నించెనో యట్టివాడు పుట్టెను. దానిని భీష్ముడు —

'ఘనతరకంధరుండు దృఢకాయుడు —

... ... ... సుపర్ణుడు పుట్టె భూవరా!"—(1-177)

అని వర్ణించిన తీ రతి లోకము (ఇది రచనా శిల్పమున వ్యక్తీకరింప బడును) వాడు పుట్టినదే తడవుగా తాత గారైన పితామహుని కడ పెరుగుచున్నాడు. సిద్ధ సాధ్యులు ముద్దు చేయుచున్నారు, ఐశ్వర్యము. అధికారము లున్నవి. ఇంటిగొడవ పట్టించుకో లేదు. పట్టించు కొనుటకు తెరపి లేనంత రాజ భోగముగా నున్నది పెంపకము. పెద్దదిక్కునుండి యైశ్వర్యమున్నవారి వ్యవహార మింతే. వీరు దుర్మార్గులు కావచ్చు. వాడు కాలేదు. వాడు మహానుభావుడు కావున.

ఈ కథ నింతటితో త్రెంపి వినతకు దాస్యము ప్రాప్తించిన కథను మొదలు పెట్టెను. ఆ కథనుండి కవి యీ కథలోకి చేసిన లంఘనము మహాశ్చర్యముగ నున్నది.

జననిం బాసి చరింపనవ్వు తన యిచ్చం బక్షినాథుండునున్
— చరించుఁ బరితుష్టస్వాంతుఁడై యెల్లెడన్ (1-279)

ఆకాలంబున వినోదంబున కరిగి యొక్కెడ --
" చంచుల చిగురాకుఁ జించి యాడుచు నలి - నెలుగించుగండుకోయిలల
... ... ... ... ... సొంపు
తగిలి కొని యాడుచు " -- (1-181)

ఎవరు ? గరుత్మంతుడే యనుకొనుట సహజముగదా ! కాని కాదు. కద్రూ వినతలని పద్యాంతము. ఇదెంత విభ్రాంతి హేతువైన మలుపు ! చమత్కార మైన రచన !

సవతులు విహరించుచున్నారు. ఉచ్చైశ్శ్రవము తోచెను. వినత యన్నది. ' ఎంత తెల్లగా నున్నదో చూడవే, యని కద్రువ - అపరాంగమున నీలిమ తోచుటలేదా యన్నది వాదు పెరిగి పందెము దనుక జరిగెను. వినత పోయి చూతమా యనునేమో యని కద్రువయే - ' పతి పరిచర్యకు గాలంబయ్యె' నని ' యప్పటికింజూపు దప్పించె' నట. కద్రువ ధూర్త, ఆమె గద్దరితనము, గడుసుదనమంతయు నామాటలో నున్నది. వినత 'కాదు. ఇప్పుడే చూత' మని పట్టు పట్టునా ? 'పతి పరిచర్య' కంటె గుఱ్ఱపు తోక - యెక్కువా నీ' కని కద్రువ నిగ్గదీయును. వినతకపకీర్తి. వినత యంగీకరించినది. వారింటికి వెడలిరి.

కద్రువ నాటిరాత్రి కొడుకులను గుఱ్ఱపుతోకను 'నల్ల చేయరయ్య' యని యడిగెను. పెద్దకొడుకులు వాసుకి మొదలగువారు 'ఇది యధర్మము. మావల్లకా'దన్నారు. వీరిట్లు మాటాడుచుండగా కొందరు 'ఎక్కడేనిఁ జనిరి' వారి నీమె శపించెను. ఇది యచ్చమైన లోకస్వభావము.

ఒక తల్లి పెద్దకొడుకున కొకపని చెప్పెను. వాడు 'చేయనుపొ' మ్మనును. తనంతవాడైన కొడుకు నేమియు ననలేని యా తల్లి మనస్సున కోపము

మనస్సు తాపమున నిప్పువలె లోలో భ్రమించుచుండగా చిన్నకొడుకుల మీద దృష్టి ప్రసరించెను. చిన్నవాని యాట పాట లేమో వాడేమో. ఇల్లు పట్టడు. వేళకింత తినుట. పోవుట, ఇంటి పట్టున నుండడు. అట్టివాని నుద్దేశించి 'ఈ చిన్న వెధవ కెక్కి పట్టదు. వాడు వచ్చినాబాగే. ఒక యేడ్పేడ్చి పూరుకొంటాను. వాడే మైనా నామాట వింటాడా! వింటే నాకీ బాధ వుంటుందా! ఈ దొర గారు నామాట వింటారా! పెద్ద వాళ్ళైపోయారు. ఆ చిన్న వెధవ ఎటు చచ్చాడో--"

ఇది లోకస్వభావము. చేయనన్న వానికి లేదు. మొగము తప్పించిన వానికి సంకటము.

ఆ పాములందు కొన్ని మొగము తప్పించెను. మనకేమి మూడునో యని! వాని బాధకు వచ్చినది.

వినత వాసి యైనది. ఈ సర్వకథ యెప్పుడు జరిగెను? తన నుద్ధరించు తాకొన్న యాకొడుకు లేనివేళ. ఆయనకీ విషయము తెలియదు. క్రొవ్వి తిరుగు వానిని జూచి నారదుడు --

"వానిపై సవతాలికి, దట్టి పనులు సేసి నంగంగ నద్దెస చింత వంత
లేక నీ విట్టు తిరుగంగ లెస్సయగునె - అద్భుతోజ్జ్వలతేజ! కశ్యపతనూజ!"

(1-205)

ఒక కుటుంబము నం దొకకొడుకు గొప్పవాడు. వీడు దాని సాధక బాధకాలు పట్టించుకొనడు. ఎక్కడో యుండును. తలిదండ్రులు 'పోనీ పసివాడు వాడి కీగోల చెప్పి బాధించుటదేని' కని చెప్పరు. ఐన వాడొకడు చూచి 'ఏరా మరిపోతే గొప్పవాడివి. వాళ్లంత బాధపడుతుంటే నీ తిరుగుడేమో, నీ వేమో! వాళ్ళ గోడే పట్టించు కోవేరా?' అని చీవాట్లు పెట్టు సందర్భమున్నదా పద్యమున.

పెద్ద గరుడికి కోపము వచ్చినది. నాతల్లినింత బాధించు నా పెద్దమ్మ యని పిలచు వారెట! దేనికి? ఆమె బాధకేకాదు "ఆ నోరు లేని తల్లి యింత పడియును నాతో చెప్పలేదు. నేనును పట్టించుకోలేదు. వంద యేండ్ల దాస్యము-

తానింటలేడు. ఇంత జరిగినది. అయ్యో !' ఇది వగపు. దానితో "మేలు మేలప్ప హితంబు జేసెఁ జెలియల్ మనుచున్న" దన్నాడు.

తల్లి యమాయికతను పురస్కరించుకొని, కద్రువ చేసిన మోసముపై కోపము. ఆమె నోరులేనితనముపై నీమె నోరి గద్దరితనముపై కొపము. అంతయు మనస్స్వభావమే. లోకమే. వెంటనే వాయువేగమున వెళ్ళి తల్లినిచూచి 'విషాద భరార్త మూర్తియై' నమస్కరించెనే గాని ఏమియు మాటాడలేదు, ఏమనును, దోషమంతయు తనది. ఇంతటి కొడుకుండగా నంత బాధ ననుభవించిన తల్లిని చూచి యే మనవలె, ఆవురు మనవలె. ఆతడు గంభీరుడు, కావున లోలో నావటిల్లెను.

ఇది 'విషాధ భరార్త మూర్తి' యనగా

తరువాత కద్రువ కడకేగి 'పరమ వినీతియై నెఱఁగి బాంధవ మారఁగ దారి తారి — అల్లన నేదో యన్నాడు. పెద్దవారి కడకేగి వేచియుండుట. దాని కోసము పడు పాట్లు "తారి తారి" లో నున్నది. ఇది మహాకవి శబ్ద ప్రయోగవైచిత్రి. పైది భావగర్భితరచన కుదాహరణము. ఇది వేరే శిల్ప మయ్యు ప్రస్తుతమును బోధించు చున్నది. అనగా లోకస్వభావమును వ్యంజించు చున్నది.

అన్నాడు. 'నీ చెల్లెలను దాసి చేసిన నీకే మచ్చగదా ; విడిచిపుచ్చుము. లోకము నిన్ను నుతించు' నని ఆమె చలించలేదు. మరల నన్నాడు, 'నేను నీ కుమారుడను. నా మొగము చూచి యైనను చేయుముఁ. కద్రువ సంగతి తెలియదు. పుట్టినదగ్గరనుండియు పితామహుని చెంతనున్నవాడు. "నేనింత వాణ్ణి. నామాట వినదా పెద్దమ్మ ఈ "ధీమా" తో— "ననుఁ జూచియైన తల్లీ కృపసేత పెద్ద యును లెస్స"— లోకస్వభావోచిత శబ్దసంఘటన. ఇట్లేకదా వ్యవహారము. వీడెంతకు వదలుట లేదని యామెమొగము ముఱకటించు కొన్నదట ! కద్రువ పెత్తనము "చెలాయించు" చున్నది. వీడు వచ్చి బంధుత్వము త్రవ్వుచున్నాడు. ఈ లోకోపమును పైశబ్ద మభినయించుచున్నది. మహాకవి శబ్దమనగా నిట్టిది. చివర కన్నది.

"బలవంతుండవు నేర్పుఁ జందములఁ జెప్పఁ జాలితి—" బలవంతుండవు శబ్ద మామె యవహేళనను ధ్వనించుచున్నది. పెద్దమొన గాతవు (–"నను జూచి యైన తల్లీకృపసేత పెద్దయును లెస్స"— యన్నాడుగదా యందుకని) నేటికి వచ్చి నేర్పుతో బంధుత్వము త్రవ్వినంతనే సరా. ఈ నాటికి పెద్దమ్మ కన్పించి నదా. ఈ రిత్తమాటలతో నేమి పని. "తల్లికావలెనన్నచో లోకులు నిన్నుం బ్రశంసింపఁ దెమ్మమృతమున్"— పద్యము పద్యమంతయు నవహేళనమే. ఇందుకే రచనలో బిగింపు లేదు. శిథిలబంధము. సామాన్యముగా తిక్కనగారిది గాఢబంధము. ఇట నవసరమై యిట్లు వ్రాసెను. ఆ చులకనతనము చేతనే – తెమ్మమృతమున్ – అనుట. అదేదో చాల తేలిక యైనట్లు. తేనేతేలేడని విశ్వాసము. తెచ్చునా, మరీమంచిది. ఇంకొక భావమున్నది. రేపు లోకము తన్నాడి పోసుకొనవచ్చు. "తనంత కొడుకువచ్చి పాపం నోరుతెరిచి అడిగితే కాదంటానికి నోరెలా వచ్చిందో! ఏ మాడకూతురో!" అని పొరుగువారు బుగ్గలు నొక్కుకో వచ్చు అందుకని "అట్లే నాయనా! తెమ్ము. నీతల్లిని గొంపోమ్ము"— ఇది లౌక్యుల చాకచక్యము. ధూర్తస్వభావము.

గరుడి స్వర్గ మేగెను. అమృతభాండము చుట్టు వహ్ని జ్వలించుచున్నది. "ఎట్లురా" యని విచారించి బ్రహ్మకడ కేగగా నాయన "ఇంత వెన్నవేయు" మన్నాడు. అట్లే చేసెను. ఇందును లోకస్వభావ మున్నది. పసివాని కొక విషయము తెలియదు. పెద్దవా రున్నచో వారిమీదికి మనసు మరలును. వారుండరు. వీడే తంటాలు పడును. ఇదియు నంతే. లేనిచో నంతవాడు "ఱెక్కలు కమరు నేమో?" యనుకొనునేమి?

సుధనుతెచ్చి కద్రువకు జూపి తల్లిదాస్య మీగెను. అమృతము చూపెనేకాని యీయలేదు. ఎందుకని? కద్రువ యన్నదేమి? తెమ్మమృతమున్– ఎట్లు లోకులు ప్రశంసింప. అట్లే తెచ్చెను. తెమ్మన్నదే గాని యిమ్మన లేదు. అరే! తెమ్మనగా నిమ్మనుట కాదా! కాదు. ఎచట? ఇట్టివారి సందర్భమున. ఆమె తనను దిరస్కారముగా నన్నది. ఇందుచే నితడు –

"జననీ! నీ వమృతమ్ము తెమ్మనిన యా సత్సూక్తి పాటించి – విశ్రాంతి లేకుండుమీ"— అన్నాడు. ఆమె "బలవంతుడ" వన్న ధోరణిలోనే జననీ!

యన్నాడు. అని తల్లిని గ్రహించి "మాటవెర వేహెర" – కద్రువకు బుద్ధి చెప్పి వెడలిపోయెను. మాటవెర వనగా తెచ్చి యీయకుండుట (ఇది మూల మందున్నదే. కావుననే లోకస్వభావముపై తిక్కన కథ నంతయు త్రిప్పుట)

లోకమం దొకముట్టెపొగరుబోతు మరొకనితో "ఒరే నా చెయ్యి వంచు నీ బలంచూద్దా" మన్నాడు. వాడు వీని చేయిని వెనుకకు మెలిపెట్టెను. వాడు చెయ్యి బెణకి యేడ్చి "వంచమంటే యిట్లాగా" అన్నాడు. వీడు నీవు వంచ మన్నావేగాని ఎటో చెప్పలేదుగా మరి" అన్నాడు. ఈ లౌకికసంఘటన దృష్టిలో నుంచుకొని పై సందర్భము చూడవచ్చు. ధూర్తస్వభావమును శిక్షించుటే తాత్పర్యము.

గరుత్మజ్జన్మ సంభవించెనని కవి చెప్పి సిద్ధసాధ్యులు పలాలించు చున్నారని చెప్పెను మఱల నదే సిద్ధ సాధ్యస్తుతితో కథ ముగిసెను. దీనిచే కథ కొక పొందిక వచ్చును. ఎత్తుగడ –దింపుగడ లందలి సమత్వ మొక గుణమే. సమత పద్యమందే కాదు. కథ – కావ్యముల మీద నుండు నట్టిదే.

ఇది ప్రధాన కథాశిల్పము. మానవలోకమందలి వృత్తాంతముగా కవి వ్రాయుట యాతని లోకజ్ఞతకు గీటురాయి. అస లదిలేనినాడు కవియేమి వ్రాయును?

కథాశిల్పమునకు వన్నెపెట్టు రచనాశిల్పమును చూడదగినదే. సామాన్యముగా నిది కవిబ్రహ్మశైలీ విషయము. అనగా సర్వత్ర దృశ్యమానమగు విషయము. శైలిలో వ్రాయదగినది. కాని కథాశిల్పము చెంతనే వ్రాసినచో విషయ స్పష్టత సిద్ధించును. గావున వ్రాయుట. ఇది పద్యరచనా శిల్పము. అనగా నాతని పద్యము నిట్లు చూడవలయునన్న సూచనగా నాల్గుపద్యములు గ్రహింపబడుచున్నవి.

ఇందు రెండు మూడు రకాల శిల్పము లున్నవి.

(1) ఛందః శిల్పము (2) రచనాశిల్పము (3) బంధ శిల్పము లేక సౌందర్యము. మొదటిది వేఱే యధ్యాయమున వ్రాయబడినది. అంద చేర్చని పద్యములను గూర్చి యీ కథలోనివేయిట గ్రహింపబడుచున్నవి. మూడవది శైలిలో వ్రాయబడును.

| | | |
|---|---|---|
| I | (1) అనూరుడు పుట్టినపుడన్నమాటలు<br>(2) గరుడి జన్మ | రెండును చంపకమాలలే. |
| II | (1) కద్రువ సుపర్ణునితో నన్నమాటలు<br>(2) ఇతడు సుధతెచ్చి యామెతోనన్న మాటలు | రెండును మత్తేభములే. |

I     అన్నదమ్ములు సమానబలులు. బలమే కాదు. మనస్స్వభావమును. ఆసాదృశ్యమును వ్యంజించుచున్న దా సమానవృత్తము. అరుణుడు శప్త వినతతో – "తల్లీ! వలవ దడల నిది విధాతృ వశమయి వచ్చెన్" సరిగా గరుత్మంతుడు కద్రువతో – నా జనయిత్రికి దాస్యము వచ్చుట. 'దైవకృత్యమ' – యని. సమాన దైహిక మానసిక విన్యాస సూచనకై సమానవృత్త స్వీకరణ.

II     కద్రువ యే మనస్తత్త్వముతో నన్నదో యదే మనస్తత్త్వముతో గరుత్మంతు డామె నాక్షేపించెను. ఆ మనస్తత్త్వ సామ్యమునకు సమానవృత్తమును గ్రహించినాడు మహాకవి.

# రచనాశిల్పము

అరుణుని మాటలు — ఇరువుర మేము వుట్టుదు మహీనపు మేనులతో
త్సరమున -

యతిప్రాస లం దూనిక యున్నది. అది వక్త కోపమును వ్యంజించుచున్నది. హీ - ని సాగదీసి చదువవలెను. ఎంతబలముగా వాడు పెరుగునో యంతదాక సాగదీసినా డరుణుడు. అంతగా బెరుగదలచిన వానిని నడుమనే త్రుంచినది. తల్లి - మత్సరమున - 'మ' తో పాదము తెగి 'త్సర' తో తర్వాతి పాదము మొదలై 'మ' బరువెల్ల 'త్స' మీద పడి యతని కోపమును రమణీయముగ ధ్వనించుచున్నది. ఈ పద్యము పెనుపు పొందని వాని మాట. పెనుపు పొందిన వాని వర్ణన "ఘనతర కంధరుండు" - ఇది గాథ బంధ సుందరమైన పద్యము. పై పద్య మందింత యోజస్సు - శబ్ద ఘటనాత్మకమైనది - లేదు. కారణము -కాల మున పుట్టిన వాడొకడు. అకాలమున పుట్టిన వాడొకడు.

పై నారదుడన్న పద్యము - అద్భుతోజ్జ్వల తేజ - కశ్యపతనూజ! — సంయుక్తాక్షర విన్యాసము గరుత్మత్పరాక్రమము నవహేళన పఱచుచున్నవి. కశ్యప - శ్య యతిస్థానమగుట. దానిని విరిచి నొక్కిన లక్షణము వ్యంజించుచు వక్త చిత్త మందలి జుగుప్సను ధ్వనించుచున్నది. కాక వాడెదురు తిరిగినచో - 'నేనే మన్నానురా నీవుకశ్యప తనూజుడవు కావా? అద్భుతోజ్జ్వలతేజుడవు కావా?' యని తప్పించుకోవచ్చు. ఇదియు లోకస్వభావపోషకమే.

కద్రువ శపించిన పద్యము —

> ఆతఁడు సర్పయాగమను నధ్వరముం గుపితాత్ముఁడై పితృ
> ప్రీతిగఁ జేయుఁ దద్దహన భీకర భూరిశిఖా ప్రవేశ సం
> జాత దురంతతాపమునఁ జావగలారని శాపమిచ్చెఁ ద
> త్పాతనవృత్తికిన్ వెఱచి తక్కటినాగము లా భుజంగితోన్.

సమాస జటిలత కోప జటిలతకు వ్యంజకము. గీట్లు కొట్టిన వాక్యములపై బరు

వుంచి చదివినచో పండ్లు మీటు చున్నట్లుండును. అనగా ననుభావము నభి నయించుచున్నది. ఆ కోపమంతయు చావ గలారన్నమాటలో గూడు కట్టినది. పీడవిరగడైనదని చేతులు దులుపు కొన్నట్లున్న దామాట యనుట. వాడిది త్రాచు పాము పగ యని లోకము. పద్యమందలి భుజంగి శబ్దము దానిని స్ఫురింపజేయు చున్నది. కాక పాము తన గ్రుడ్లను తానే తినునని లోకము. ఈ సర్పస్వభావ మును సూచించు శబ్దమును వాడుట కవి నిద్రాతనమునకు - జాగ్రత్తకు నిదర్శనము.

ఇట్టీకథలో కవిబ్రహ్మ శిల్పము. (1) శబ్దము, (పైన నటనట స్ఫురింప బడినది. (2) రచన. (3) పద్యము. (4) ఛందము (5) శబ్దాభినయ శక్తి ఆ యీ ముఖాలుగా నుండునది ప్రధాన కథాశిల్పముతో బాటు కన్పించు చున్నది. అనగా నీ లఘుప్రబంధశిల్పము సామాన్యముగా తిక్కన కవితాశిల్ప మును సూచించుచున్నది. ఈదృష్టితో నాతని కావ్యము చూడదగినది.

# కావ్యోచితవర్ణనలు

సాగరోపవన వర్ణన - (181) దీనిచే వినతా కద్రువలు వనవిహారార్థమై వెళ్లిరని తెలియుచున్నది. లేనిచో వారుచ్చైశ్శ్రవదర్శనము చేయుటకు గాని తర్వాతి కథ జరుగుటకు గాని వీలులేదు.

అశ్వవర్ణన (183) ఇది వారుత్సకతతో దర్శించుట కనువైన హేతు నిరూపణ చేయుచున్నవి. అశ్వమును చూచి పన్నిదము వేసి వారిర్వును దాని చూచుటకు వెంటనే యేల పోలేదు? పందెము వేసి కొనుట మాత్రమే మూలము తెల్పినది. వెంటనే కద్రువ కొడుకులనుబిల్చి యావిషయము తెల్పినట్లు మాత్రమే మూలమందుండగా తెనుగున - పతి బరిచర్యకు గాలంబయ్యెనని కద్రువ నెపం బిడి యప్పటికి "జూపు దప్పించె" (192) నని యుండుటచే పై సందేహము నివృత్తమగుచున్నది.

పరశురామునిచే నీకథ విన్నట్లు భీష్ముడు మూలమందనగా నిందేమియు వేదు. మొదటి యండమును వినత ‹వగపును మత్సరంబు గదిరెడుమదితో› నవియించెనట. ఇది యామె చిత్తవృత్తిసూచకము.

అరుణుడు శాపమిచ్చినంత వినత - వెలవెల బాఱుచు వడకుచు నలుకుచు -(173) ఇది భయభావమును వ్యంజించు సాత్త్వికభావసామగ్రి. కద్రువ కొడుకులను రావించి కన్నునీరు దొరఁగంగ (193) విషయము చెప్పెనట. ఇచటి బాష్పము కద్రువ 'కుటిలంపు దలపు' (193) ను వ్యంజించుచున్నది.

వినత 'పందె మేమనగా' కద్రువ వినత వదనంబున జూడ్కి నిలిపి -(189) పందెము చెప్పెను. ఈ యనుభావము కద్రువ యాలోచన - కుటిలాలోచనకు వ్యంజకము.

గరుత్మంతుడు వచ్చి కద్రువతో వినతను విడిచి పుచ్చు మన్నపుడామె ‹మొగమ్ము ముఱకటించు' కొన్నదట. ఈ యాంగికాభియనునకు మూలము దుష్ప్రజ్ఞాపరీతా - యని.

ఇట్లుచితవర్ణనముచే నభినయద్వారమున రచించుట కథానిర్మాణ రహస్య వేత్తయైన నాడు సిద్ధించునట్టిది.

# ధర్మానువాదము

"తొల్లి యిట్లు వసిష్ఠుండు బ్రహ్మనడిగిన నమ్మహత్మ్యుం డుపదేశించిన వాక్యంబుల యర్థంబు లుపన్యసించెద" — (1-133)

"ఆ దేవి మకరధ్వజుమాతకుం జెప్పిన వాక్యంబుల యర్థంబు లుపన్య - సించెద"— (1-284)

పై వానినిబట్టి తిక్కన యనువాదపద్ధతి కావ్యారంభమందే సూచించినట్లు "అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద" — మూల భారతార్థ - తాత్ప ర్యము తెనుగున చెప్పదలచు కొన్నట్లు స్పష్టపడుచున్నది. అచట నున్న పదము నిచట తెనుగున బెట్టలేదు. దాని తాత్పర్యము ననువదించెను. కావున ధర్మఘట్ట ముల నిట్లే తాత్పర్యదృష్టి ననువదించెను.

ఉదా :— దైవ పౌరుష కథనము మూలమున 49 శ్లోకాలలో నుండగా తెలుగున 6 కందాలు రెండు తేటగీతులు మాత్రమే. మూలమందలి 5, 6, 10, 11, 14, 15-20, 23, 24 శ్లోకము లనూదితములు కాలేదు. వీని తాత్పర్యమిది.

"అబీజము మొలకెత్తదు. బీజము లేనిదే ఫలములేదు. బీజము నుండి ఫలము, బీజములు పుట్టుచున్నవి. ఏ బీజము కర్షకునిచే క్షేత్రమున నాటబడునో దాని యందలి సుకృతమో, దుష్కృతమో ఫలముగా మొలకెత్తును. కృతము ఫలింపక తప్పదు. అకృత మభోజ్యమే. కృతిధన్యుఁడు. అకృతుఁ డురెసిన చౌడు వలె నుసియై భ్రష్టుడగుచున్నాడు. జ్యోతీ నాగ చంద్రార్కులందఱును పురుష కారముచే దివ్యు లగుచున్నారు. అర్థైశ్వర్యములు, స్నేహితులు, ఆభిజాత్యాదులు సర్వమకృత కర్ముల కలభ్యములు. శౌచమున విప్రత్వము, విక్రమమున క్షాత్రము, పౌరుషమున వైశ్యత్వము, సేవచే శూద్రత్వము శ్రీనందుచున్నవి. నిష్క్రియుడు, నదాత, యకర్మశీలి, యశూరుడు, క్లీబుడు, నతపస్వి యర్థప్రాప్తి నందలేడు. స్వకర్మఫలము లేనిచో సర్వము నఫలమే. దైవమును చూచియేని లోక ముదాసీ నముకారాదు. ఎవడు కర్మచేయక దైవమును విశ్వసించునో వానిది వృథాశ్రమ

ఇది నపుంసకుని స్త్రీ యభిసరించినట్లు. పౌరుషవంతుని దైవమే యనువర్తించును —" ఇత్యాది.

దీనిని స్థాపించు పూర్వరాజన్యుల కథ లుదాహరింపబడినవి (30 - 40 శ్లోకాలు). వీనిలో పరశురాముడును - భృగుడును బలియు లోనుగాగ (1-140). ఇట్లు కొందఱే తెనుగున వచ్చిరి. మిగిలిన వారి నెత్తివేసెను. ఇందులో కొంత యౌచిత్య మున్నది. 38 - శ్లోకమున నృగుడు కృకలాసమగుట కథ. ఇది తర్వాత రాబోవుచున్నది. కావున 40 - పాండవ విషయమే కావున - చెప్ప నక్కరలేదు.

మిగిలిన శ్లోకములలో కొన్నిఁటిని కలిపి యొకే పద్యమున కుదించును. 7-8-13 శ్లోకాలు మూడును 136 - వ పద్యమున నిమిడిపోయినవి. 12 - 22 కలిసి 135-వ పద్యమున నొదిగిపోయినవి.

> యథాగ్నిః పవనోద్ధూతః - సుసూక్ష్మోపి మహాన్ భవేత్
> తథా కర్మ సమాయుక్తం - దైవం సాధు వివర్ధతే
> యథా తైల క్షయా ద్దీపః - ప్రహాస ముపగచ్ఛతి
> తథా కర్మ క్షయా ద్దైవం - ప్రహాస ముపగచ్ఛతి — 43-44

ఈ రెంటికి క్రమముగా 138 - 139 పద్యములు యథానువాదాలు. అనగా నా యధ్యాయమున వీనికి ప్రాధాన్య మున్నదని కవి వ్యాఖ్యానము. 139 - పద్యమునకు 140 పద్యము నుదాహరణముగా నాంధ్రీకరించెను. మిగిలిన రాజులకథల నెత్తివేసి దీనిని మాత్రమే గ్రహించుటలోని రహస్య మిదియే. మూలమున పరశురామ విషయము, 33-వ బలి విషయము 35-వ శ్లోకాలలో నుండగా రెంటిని కలిపి 139-గా వ్రాసెను. మూలమం దాయా యుదాహరణలను ముందిచ్చి దాని తాత్పర్యమును 43-44 శ్లోకాలుగా కుదింపగా తెన్గున దాని తల్లక్రిందులు చేసినాడు చమత్కారియైన యాంధ్రకవి.

## II

పార్వతి శివునిస్వరూపమును గూర్చి - నీ నాల్గు ముఖములందు పూర్వము చంద్రునివలె ప్రియదర్శనము. అట్లే పశ్చిమోత్తరములు. దక్షిణము రౌద్రము.

ఊర్ధ్వము జటాకపిలము. ఏల? నీ కంఠ నైల్య కారణమేమి? పినాక మేల ధరింతువు? జటిల బ్రహ్మచారిగా నేల యుంటివి? — ఇది నాల్గు శ్లోకాల మీది నాల్గు ప్రశ్నలు. (చూ. 140 వ. అధ్యా.)

తక్కిన యొక్కొక్క ప్రశ్ననే విడమరచి యడిగించి దానికి సమాధానము ముగిసినంత వేరొక ప్రశ్నగా వ్రాసెను. (చూ. 4-424-30)

## III

మూలము 23-వ అధ్యాయమున 60 నుండి 82 శ్లోకముల వరకు నిరయగాము లెవ్వరో వర్ణింపబడినది. 85 నుండి 102 వరకు స్వర్గగాముల వర్ణన. ఈ రెండు పద్ధతులను రెండు - రెండు సీసములలో గవిబ్రహ్మ (2-61, 62, 63. 64) నిష్పక్షపాత బుద్ధియై కుదించెను.

## IV

"దానప్రియ వచనంబుల రెంటియందును నధికరంజనం బెయ్యది సెప్పవే" (4-381) యని ధర్మజు డడుగగా భీష్ముడు దానంబు రంజకంబగుట దెలుప వలవదు— అని సామవాదగుణంబు తెల్లంబగునట్టి యితిహాసంబు వినుమని బ్రాహ్మణ రక్ష స్సంవాదమును చెప్పెను. దానవిషయము తెలుపవలవ దనుటకు హేతువది పూర్వమే - వ్యాస మైత్రేయసంవాదము (4-347) న వచ్చినదని సూచించుట. ఇచట సామవాదగుణమునే చెప్పెదనని యాకథ చెప్పెను. మూలమును దీనికే ప్రాధాన్యమిచ్చినది కావున. మూలమున (124 అధ్యా.) బ్రాహ్మణ రక్ష స్సంవాదము 30 శ్లోకాలు. తెలుగున మూడే సీసములు (4-382, 84, 86) 30 శ్లోకాల చివళ్ల - తేనాసి హరిణః కృశః. మూడు సీసాల చివళ్ల — "కార్శ్య పాండురతలు కలుగు ననఘ". కథాంతమున నిట్లేర్పడ జెప్పిన- అని వ్రాసెను. ఏర్పడ ననగా పదేసి శ్లోకాల కొక్కొక్క సీసము వ్రాసి నానని మనకు సూచించుట మూడే సీసాలు వ్రాయుట మూడే ముక్కలలో తేల్చిచెప్పుట.

## V

ధర్మజు డొక పురావృత్తము సెప్పుమనగా భీష్ము డుమామహేశ్వర సంవాదము సెప్పబోవుచు "పౌరవోత్తమా! య ప్పురావృత్తంబు ప్రవర్తించుటకుం

గతంబైన కథ మున్ను సెప్పి మరిదానిం జెప్పిన నొప్పియుండుం గావున నప్పరి పాటిం జెప్పెద"(4-395) అని శ్రీకృష్ణుని చరిత్ర చెప్పెను. మూలమునందును ముందు కృష్ణునిచరిత్ర - తర్వాత నుమామహేశ్వరసంవాద మున్నది. తెనుగు కవి తర్వాతి కథకీ కృష్ణచరిత్ర పీఠిక వంటిదని మూలకథాక్రమ వ్యాఖ్యానము చేయుచున్నట్లా పై వచనము నట్లు వ్రాసినాడు. ఇట్లు మూలమును చిన్నమాటలచే వ్యాఖ్యానించు పద్ధతి యొక విధమైన యనువాదశిల్పము.

# వాక్యఖండములు - తద్గతశిల్పము

1) తిక్కనగారు తమ యనువాదమున నడుమనడుమ కొన్ని వచనపు దుంటలు అమూలకములైనవి వ్రాయుచు వచ్చిరి. వాని ప్రయోజన మిచట చర్చింప బడుచున్నది.

3. ఆ. ము. న సౌదాసుడు వశిష్ఠునితో నేది పవిత్రమని ప్రశ్నింపనాతడు గోవని చెప్పి యది-సురలకు మనికిపట్టు (28) అని చెప్పి 'మరియును'(29 వచనము) అని వ్రాసెను. మూల మందలి (78 అధ్యా) 10 శ్లోకాలలో గో మాహాత్మ్యము సామాన్యముగా చెప్పి తద్విశేష విషయము తర్వాత చెప్పబోవుచున్నది. తిక్కన యా 10 శ్లోకాల భావము 3-28 పద్యాన కుదించి 29- వచనపు ముక్క వ్రాసెను. ఇది యాగామి గో మాహాత్మ్య విశేషసూచక మగుచున్నది.

2) 'అని నిర్దేశించి వెండియు న మ్మునీంద్రు డా నరేంద్రున కిట్లనియె' - (3-35) (అదే సందర్భము) దీనితో 78 వ. యధ్యాయము తెగి 79- ప్రారంభ మగుచున్నది.

పై 35 - వచనము తర్వాతిది పద్యము. అది 79 - అధ్యాయ మందలి 8-వ శ్లోకానువాదము. ఆ యధ్యాయమున 27 శ్లోకాలున్నవి. 80-వ అధ్యాయము 16 శ్లోకాలు. ఈ రెం డధ్యాయములను రెండు రెండు కందాలలో నందముగ సంగ్రహించెను. 36-37 పద్యాలు 79 యధ్యాయము. 38, 39 పద్యాలు 80 వ యధ్యాయము. *1 బ్రహ్మభేద్యమగు కుదింపు ఆ యధ్యాయమునకు సార

---

*1 సీతాసౌందర్యము విని రావణు డామె నపహరించెనని పై శ్లోకమున నని క్రింది శ్లోకముగా దీనిని -

"తతో బధ్వార్ణవే సేతుం నిహత్య యుధిరావణమ్
సీతామాదాయ రామోఽపి సాకేతం పునరాగతః"

అని కుశలవులు పాడగా విని రాముడు "అహో! సంక్షేపః - అన్నాడట. ఇది కుందమాల 6వ యంక మందలిది. దీనిని మహాకవి యొక శిల్పాంగముగ భావించినట్లు పై సంక్షేప పద్ధతిని శిల్ప మనవచ్చు.

భూతములైన వానినే యనువదించుటచేత రచన క్లుప్తత సాధించెను. 80-అధ్యా. 9-వ. శ్లోకము 38 - వ పద్యము 12 - వ శ్లోకము 39 - వ పద్యము. రెండే యాత దనువదించినది. మిగిలిన వక్కాఅలేదని కాబోలు !

అదే కథలో (భీష్ముడు) 'అమ్మహీపతితో' గో. విశేషం బింకను వినుమని యిట్లనియె (3-42). దీనితో మూల మందలి 81 - వ యధ్యాయ మారంభ మగుచున్నది.

పితృపూజనంబులకుఁ బాత్రంబు లెట్టివన్న ధర్మజప్రశ్నకు సమాధానముగా భీష్ముడు - నీవడిగి మేలుసేసి తాకర్ణింపుము. (3-172) అన్నాడు. ఇట్లే - డు దాన కర్తలెందేని వసింతురా లోకంబెట్టిదని ధర్మజుడు ప్రశ్నింపగా పితామహుఁగో దీనికి బ్రహ్మవాక్యంబులుగల విట్ల యింద్రు డడిగిన నతనికి బ్రహ్మ యిట్లనియె.

"అడిగి మేలుసేసి తా లోక మెవ్వరు నెఱుగ కునికి తెల్లము" (2-464) దీనికి మూలము -

"యోయం ప్రశ్న స్త్వయా పృష్టో గో ప్రదానాది కారితః."
నా_స్తి ప్రష్టాస్మి లోకేఽస్మిం_స్త్వత్తోఽన్యోహి శతక్రతో (73-1)

బ్రహ్మ నన్నెవ్వరు నడుగలేదని మూలమున ననుచుండగా నీతెలుగు బ్రహ్మ యట్ల న్నాడు. అందు పెద్దవాని మాటతీరు - కొంత హాస్య ప్రియత్వము - తొంగి చూచుచున్నది. ఇదొక చమత్కారము. ఇట్టి వానితో కేవల ధర్మ కథనము లందొక యాభిముఖ్యము శ్రోత కేర్పడును. ఈ హాస్యప్రియత్వము తిక్కనగారి యనువాదము నందటనట కన్పించుచున్నది.

ధర్మరాజు భీష్మునితో "నాకలోకం బేకప్రకారమ నోహరియో - బహు ప్రకార ప్రమోదియో" యనగా భీష్ముడు "భవదీయ ప్రశ్నంబునకుఁ బ్రాదేశ విశదీకరణంబగు నుత్తరంబై యుండెడు" (4-54) నని గౌతమేంద్ర సంవా దము మొదలుపెట్టెను. ఆ కథ యట ధర్మజప్రశ్నకు లొడితె డెడములో నున్న దట ! వ్యాసకథ యాప్రశ్నకు సూటిగా సమాధానము చెప్పక వక్రముగా వ్యంజిం చుచున్న దన్న తాత్పర్యమును మహాకవి చమత్కారముగ నట్లన్నాడు. అనగా కథా తాత్పర్యము నిట్లు చూచుకోవలసినదనియు మహర్షి కొన్నిచోట్ల నిట్లు వ్రాయుననియు సూచన.

: విను వర్ణాచారంబుల, ననఘ యిచట దెలుపఁ దొడగనైనను మునులీ
పను లాయుర్వృద్ధికరము, లనుట కతనఁ దెలుపవలసె నీకునై చెప్పంగన్
(4-125)

దీని మూలము 104 - వ అధ్యాయము. అం దాయుర్వృద్ధి హేతువు సదాచార మని చెప్పి 145 - 48 శ్లోకాలలో రాజప్రశ్నను వర్ణింపగా తిక్కన దాని నను సరించి చివర నట్లన్నాడు. అది యమూలకము. వర్ణాచారములను దెలుపననుట హాస్యప్రియత్వమే కాక యిది దానికి పూర్వాపరములందు చాలచోట్ల వచ్చిన విష యమే. వాని నక్కడ చూచుకోవలసినదే. మరి యిచట చెప్పితివే. యనగా మునులు చెప్పిరి కావున చెప్పితిని. ఈపునరుక్తి వారిదే. తనది కాదనుట.

"నాస్తి వేదాత్ పరం శాస్త్రం - నాస్తి మాతృ సమో గురుః
న ధర్మాత్పరమో లాభః - తపోనానశనాత్పరం
బ్రాహ్మణేభ్య పరంనాస్తి - పావనం దివిచేహ్యచ
ఉపవాసై స్తథా తుల్యం - తపః కర్మ నవిద్యతే"—— 106-65, 66

మాతకును వేదమునకు ధర్మంబులకును - బరములగు గురుశాస్త్ర లాభములులేవు
తపము లే దుపవాస వ్రతంబు కంటె - నధికమైనది యంద్రు మహాత్ములనఘ!
పావనంబులలోనెల్లఁ బ్రాహ్మణుండు - పరమపావన మనుశ్రుతి పౌరవేంద్ర!
యట్లు గావున భూదేవ తార్చనంబు - భక్తి సంభృతముగ నడుపంగవలయు

అప్రసక్తం బైనను నీయర్థంబు వినవలయు నట్టిది గావునం జెప్పితిని — (4-153, 154, 155) గీట్లుగొట్టిన వాక్యముల రెంట నొకటే కావున 153 వ. పద్యము దాని యనువాదము - పోగా మిగిలినది రెండవ శ్లోకమున బ్రాహ్మణ విషయము. అది 154 పద్యముగా వచ్చినది. 3, 4 పాదాలు మూలమున లేవు. ఇది యప్రసక్తమట! శ్రోతవ్యము కావున పూరించినాడట. చమత్కారముగ నున్నది కదా!

"ధరణీసుర ధనహరణము - దురిత తమము -"

అనియె. నివ్వాక్యంబులు నీకుం జెప్పవలవదైన నితిహాసావసానవర్తి యగుటం జేసి వినిపించితి" (2-440-41)

మూలము 70 అధ్యా. 31 శ్లోకము కృష్ణుడు చెప్పినది. నృగ కథాంత మది. అదే 440 - పై పద్యము. విప్రస్వాహరణము దోషమని ధర్మజునకు తెలిసినదే. కావున 441 - వచన మటు వ్రాయుట. పాత్రౌచితీ రక్షణ యనుట కంటె హాస్యప్రియత్వమనుటయే బాగు.

"అని చెప్పి యాపగా తనయుం డొక విశేషంబు వినిపింపవలసి ధర్మజున కిట్లనియె" (2-393). వివిధ దానవిషయకమైన 66-వ యధ్యాయమందలి 16వ శ్లోకము దనుక తెనింగించి పై మాట వ్రాసెను. మూలమున — "అత ఊర్ధ్వం నిబోధేదం దేవానాం యష్టుమిచ్ఛతాం" (17) ఇట్లు మొదలైనది 36 వ. శ్లోకము వరకు సాగిన బ్రహ్మదేవతాసంవాదము సంగ్రహించి 394-95 వ పద్యము లందు 396లో గోదాన శస్త మహిమ విస్తరింతు - నన్నాడు. 393 విశేష శబ్దముల మూలమందలి "అత ఊర్ధ్వం నిబోధ"ను తాకుచున్నది. ఇంతేకాక 394-95 పద్యాలలో 66-అధ్యాయము కుదింపబడి 396-వ పద్యముతో మరొక యధ్యాయ మారంభమగుచున్నది. దానిని విస్తరముగా చెప్పుదునని విస్తరింతు- చే సూచించెను. నడుమ 50 - 60 శ్లోకాలుగల 66- ని కత్తిరించి కుదించి -67 ని విస్తరించునట. ఇట్లు చిన్నిమాటలచే నొక విశేషము ననువాదసంబంధమైన దానిని సూచించుట. అనువాద వైచిత్రి యనక తప్పదు.

పూర్వాపూర్వ విషయాల నుత్తరోత్తర కథలలో రాగా వాని నించుక స్మరించి దాని పునరుక్తిని భంగించు పద్ధతి యొక రకపు శిల్పము. ఇది మూల మందున్నదే యని పూర్వ దృష్టమే.

1. ఉదాత్త బ్రాహ్మ్యనిధియైన బ్రాహ్మణాన్వయంబునఁ బరశురాముడు జనించుట క్షత్త్రియ కులమున బ్రాహ్మణ్య విశ్రుతుండైన విశ్వామిత్రుఁడు జనించు టెట్లు ?

"తొల్లియుం గొంత వింటి నిస్సంశయంబు గాదు" (2-291) అని సంశయ నివారణార్థమై ప్రశ్నించును. సమాధానముగా భీష్ముడు చ్యవన కుశిక సంవాదమును చెప్పును. కొంత విన్నది పూర్వాశ్వాసమున. విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైన కథ భీష్ముడు చెప్పినదిచట నతుకబడి యీ చ్యవన కుశిక సంవాదము పూర్వాశ్వాసమున చెప్పిన కథకు హేతువుగా ముడి వేయ బడినది.

2-291 వచనము కేవలము తెనుగు కవిదే. పూర్వాపర కథా ప్రవర్తనౌచిత్య మును నిరూపించుచున్నది.

2. నహుషుడు ధూపదీప విశేషమున స్వారాజ్య పట్టాభిషిక్తుడైన కథ చెప్పి యాతని యజగరత్వమును బోగొట్టినది నీవే గావున నీకది తెలియునని భీష్ముడు సూచించెను (4-38). ఇది యరణ్యపర్వకథకు లగించబడినది. 4-38 మూల శ్లోకము.

"బ్రహ్మణా రాజశార్దూల యధా పూర్వం వ్యరోచత -
ఏవమే తత్పురావృత్తం నహుషస్య వ్యతిక్రమాత్" (100-38)

ఇందిదే మొదటిసారిగా కథ చెప్పబడినట్టి లక్షణ మున్నది. అనువాదపు సొగసు చెప్పనక్కరలేదు.

3. హరసనత్కుమారసంవాదమున నిత డతనితో—

"మఱియు సాంఖ్యయోగ - శిష్టమానసుల కరిష్ట పరిజ్ఞాన
వైభవాతిశయము వలసియుండు" (4-230)

ఎట్లనిన నీ దృష్టారిష్ట వికృతులయ - పలుకు వలికి వానినెల్లను వివరించెదనని పరాశర సంయమీశ్వరుండు శిష్యుల కుపదేశించిన విధంబులై యుండు నంత వట్టును మును నీ వాకర్ణించి తని యమ్మునివరుండు -(4-231)

ఈ పరాశరస్మృతి తృతీయాశ్వాసమున (270 నుండి) శిష్యుల కుపదేశించిన దానిని భీష్ముడు ధర్మజునితో చెప్పెను. దాని నిచట నెత్తివేయుటకు వేసిన యెత్తు సంగతి నట్లుంచి యట నాముని స్వశిష్యులతో చెప్పినదానిని సనత్కుమారుడు శివుని పరాశరస్మృతికి శ్రోతయైనట్లు 'మును నీ వాకర్ణించితి' వను చున్నాడు. అర్థమేమి? విన్నది ధర్మరాజు - లేక పరాశర శిష్యులు. అసలు శ్రోతలము మనము. వారెవ్వరును గారు. ఎంత గడుసు నోరిది!

కనిష్ఠులందు జ్యేష్ఠుడు - నితనియెడ వారు నెట్లు ప్రవర్తింపవలయునని ధర్మజు డడుగగా భీష్ముడు వివరించి (105- అధ్యా.) చివర -

లోభనిరతి కాసపడి పాడి దొఱంగినఁ బ్రాణగొడ్డపుం
బనులగు నవ్విధంబు మన పద్దదిగాదె జగంబెఱుంగగన్ (4-134)

ఇది కేవలము తిక్కనగారి ప్రౌఢమార్గము.

# ఛందశ్శిల్పము

ఇది కేవలము తిక్కనగారి శిల్పము.

దీనిని రెండు మూడు పద్ధతులుగా విభజించి చూడవచ్చు.

1) కథాద్యంతము లేకచ్ఛందమున నిబద్ధించుట
2) కథాప్రధానఘట్టము లేకచ్ఛందోబద్ధము లగుట
3) తత్తచ్ఛంద ప్రవృత్తిలోని మార్మికత.

## సుదర్శన కథ

"అనఘ ! గృహస్థధర్మమున యందుఁ జరించి నరుండు మృత్యు సం
జనిత భయంబు వాపికొనఁ జాలునొ జాలఁడొ —" (1-43)
"నరవర ! పొల్పు నోఘవతి నానదియై జనపావనాకృతిం
బరమతపంబులోని సగపాలను —" (1-82)

ఇట్లు కథాద్యంతము లందు చంపకమాలలే. ద్వితీయాశ్వాస ప్రారంభ మందలి యష్టావక్రకథాద్యంతములందు సీసమే నిల్చినది

రుచికథలో ప్రారంభాంతములు కందము (2-181) - 218 చే నందము లైనవి. ఇంద్ర గౌతమ సంవాదము గీతముల నడుమ బంధితమైనకథ (4-55, 79) సౌపర్ణోపాఖ్యానమున ఆద్యంతములందు సీసమే ప్రాసమై యున్నది.

ఇట్లాద్యంతములం దేకచ్ఛందము బంధించుటలో ప్రయోజన మున్నదా ? లేదా ? యన్నచో సమత యను గుణము పద్యగతముగా నున్నట్లే కథ మీద నుండవచ్చునుగదా ! పద్యమం దెత్తుగడ - దింపుగడ సమానముగా చెక్కుటచే నొక సమతాసౌందర్యసిద్ధి యున్నది. శిల్పమునకు పార్శ్వములు చెక్కబడిన ట్లుండుట ప్రసిద్ధమే. దానిచే నొక విచ్ఛిత్తివిశేషము నేత్రపర్వ మగుట ప్రసిద్ధమే. అట్లే యిదియును. కాక, దండి ఏకాక్షరముగాని ఏకస్థాన జన్య భిన్నాక్షర

సంపుటిగాని మనోవిస్మృతము గానంత యదూరవర్తి యైనచో నొకయందము వచ్చు' నన్నాడు. అట్లే యిదియును.

కథ యేకచ్ఛందముతో ప్రారంభించి యంతమగుటయే కాక ప్రారంభ చ్ఛందమే కథాప్రధానఘట్టములం దూది నిలుచుట కూడ విచ్ఛిత్తి విశేషహేతువే. గరుడి కథలో –

I 1) కద్రూవినతలు వాహ్యాళి చన్నపు డచ్చటి సౌందర్యము సీసమందే వర్ణితము.

2) కద్రువ కొడుకులతో అశ్వవాలమును నల్లగా చేయుమని చెప్పిన విషయము – ఆమె కుటిలనీతి సీసముననే.

3) గరుడి అమృతానయకము నర్థించి పోవువేళ – తండ్రి గజకచ్ఛప విషయమును చెప్పినది సీసమున

4) అంతము సీసమున.

II ఇంద్ర గౌతమసంవాదమంతయు సీసములే నిర్వహించినవి. మతంగుడు తన యేస్నగొాదమను ధారవోయు స్థలములుగా నాయాచోట్లు చెప్పుట కందము గీతము లందుండగా మాయామూర్తి ఇంద్రుడు దానికి చెప్పిన సమాధానము (నాలుగు) అన్నియు సీసములందే. రెండు పాత్రలు భిన్న భిన్న మనస్తత్త్వములతో మాటాడినట్లు భిన్న చ్ఛందము లుపయోగించుట పఠనవేళ పొడగట్టినచో నొక చమత్కారము కలుగకపోదు.

III కార్త్యవీర్య పవనసంవాదము (5–338 నుండి) న పవనుడు చేసిన బ్రాహ్మణ మహత్త్వస్తుతి సర్వము (5 పద్యాలు) సీసములందే. కార్తవీర్యుని యవలేపము నణచుటకై వాయుదేవుడు వచ్చి బ్రాహ్మణ్యమును స్తుతించును. అది నాల్గైదు ఘట్టములుగా నుండును. ఒక పురాణేతిహాసము చెప్పును. అత డది చెవి దూర్చడు. ఆ సమయమున కవి –"అనిననుం బలుకకున్న యన్నరపతితోడం బవమానుండు మఱియు నిట్లనియె" (5–346)

"ఒకతఱి దేవతలకు దైత్యులకు మహారణమయ్యె"— నని తర్వాత సీసము ప్రారంభించును. మఱల నతడు పెడచెవిని బెట్టును.

"అనిన నూరక యున్న. యర్జునుతోడ సదాగతి యిట్లను (5 - 348) ఇది సీసమే. ఇట్లు చెప్పగా "నావినియు నొక్కమూడయు నావిభు డాడండ దాని కలయక మఱియున్" - (351)

వాయుదేవుండు - 'అకట దత్తాత్రేయునకు' - అని సీసమునం దొక కథ చెప్పును. ఈ క్రమమున పఠించునపుడు హృదయము చమత్కరించుచున్నది. ఆ చమత్కారము నిర్మాణమర్మజ్ఞుడైన వా డేకచ్ఛందమునే పునరావృత్తము చేయుటచే కల్గించుచున్నాడు. అనగా కవి శిల్ప పరమేష్ఠి.

ధర్మానువాదములందు - కథానువాదము లందును మహాకవి సీసమునే గ్రహించెను.

(1) విషయమును సంగ్రహించుట. బృహచ్ఛందము గావున.

(2) అందు శిల్పములు సంయోజించుటచే దానికి ప్రాధాన్యము పోవు చున్నది.

ఈ రీతిగా సీసమును వ్రాయుటచే షోడశమహారాజుల విషయము సీసము నందే సడపుట వంటిదగుచున్నది. ప్రథమచ్ఛందముచే నేర్పడిన శ్రోత మనో వృత్తి పునః పునరేక చ్ఛందోవృత్తిచే నది నొక్కబడుచు వర్ణితాంతమునకు పుష్టి కల్గించుటయందు బర్యవసించుటచే నది శిల్పమగుచున్నది. అట్లే పైస్థలము లందును.

"అని యిట్లువర్తిల్లు నాలుగువాక్యంబులుం జెప్పి"— (2-44) దీనికి పైన ధరణి, కాశ్యప, వైశ్వానర, మార్కండేయులు గోష్ఠి నుండి యొక్కెడ జగద్ధిత వాక్పరు లైరని' (2-39) చెప్పి నాల్గు పద్యములు వ్రాసెను. ఈ పద్య ములు నాల్గిటికి కర్తలు పైవారు. ఇది ఓలిన (2-38) చదువుకోవలెనని కవి సూచన. (ఇది మూలమందు శిల్పమే)

గాంధర్వాది వివాహములను నిర్వచించు ఘట్టమున— ఇట్లు సెప్పం బడు నట్టి (2-225) అయిదు తెఱగులందు (226) పైన నైదు తెఱగుల వివాహములు చెప్పెను. దాని కిది సూచిక. ఇట్టివి పాఠకుని మనస్సులోని పతనవేగమునకు నిగళములు తగిలించి యతని నవధానపరుని జేయును. ఇదొక చమత్కారము. ఆ యైదుతెఱఁగుల వివాహములను నాల్గుపద్యాలలో జెప్పెను. పై 2-44 శిల్పమును చూచిన మన కిచట నాల్గుపద్యములే గదా చెప్పినది. యైదవ వివాహ మెచట చెప్పెను? అనిపించును. దానిని వెదకినచో నొకే పద్యమున రెండు వివాహపద్ధతులను నిర్వచించెనని తెలియును.

'అని భీష్ముఁడు వెండియు నా పన్నిరువురను' — (2-255)

ఈమాట చదివి వెనుకకు మళ్లినచో 12 పద్యము లుండును. పన్నిద్దఱు కుమారులను గూర్చి వానితో చెప్పెను.

పదియును నూఱును వేయును - మొదవులు గలవారు దానములుగా నొకటిం
బది యింటి నూటి నిచ్చిన - నదియు నదియును నదియు ననదృశమగు
ఫలము నెడన్ (3-30)

అదియు నదియు నన్ని త్రిరావృత్తిచే నేదైనను సమాన ఫలదాయకమే యన్న నిశ్చితార్థమును ముమ్మారు చెప్పి నట్లైనది.

ప్రతిధర్మమును ప్రశ్నించుచు ధర్మజుడు - 'ఎఱింగింపవే' యని ప్రార్థనా మూర్తియై యార్తితో పలుకును. మూలమున ప్రతి సమాధాన ప్రారంభమున "హంతతే కథ యిష్యామి" - అని యుండగా తిక్కన దానిని వదలి సమాధానము చెప్పించును.

ప్రతి కథాంత మందును మహాకవి 'దీని తాత్పర్య మెఱింగి కొమ్ము' — వంటి మాట తప్పక యనును. (ఈ తాత్పర్యమును నీలకంఠుని భాష్యమున చూడవచ్చు)

ఇవన్నియు చిఱు సొగసులు. శిల్ప సుధాపాథోధి పైన తేలిన పాల నురుగులు. తర్వాతి కవుల కిదియు మార్గోపదేశకమే. కాక ప్రతి శబ్దమునేదో యొక పద్ధతిగా నలంకరించుచునే పోవును గాని మహాకవి యూరక వ్రాయడనుట నిది సుష్ఠుగా స్పష్టపఱచు చున్నదిగదా!

# సంబుద్ధులు

తిక్కనగారి రచనలో తొంబదిపాళ్లు సాభిప్రాయ సంబోధనలే. అవి యాపాత్రమనస్సూచకములో, ప్రకరణోచితములో యై యుండి యొకవిధమైన చమత్కారమును గల్గించును. రెండు మూ డుదాహరణములు.

"అసదృశ రూపగుణ వర్తనాన్వయవిద్యా": (2-6) ఇచటి మూలము 'ప్రభో:' (19-17) అష్టావక్రుడు వదాన్యుని కడకేగి యతని కూతు సుప్రభ యను దాని పెండ్లాడగోరి యడుగగా నిత డన్నమాట. ఈఘట్టము వరుం డెట్టివాడు గావలయు - నన్న ధర్మజప్రశ్నకు సమాధానముగా భీష్మ డీకథ చెప్పెను. వరుని గుణగణము లన్నియు నాసంబోధనలో నిమిడియున్నవి.

రక్షావిధాన మాచరింపుము నీవు దృఢావధాన- (2-186)

మూలము - భృగు సత్తమ: (40-36, 39)

ఇది రుచికథలోనిది. దేవశర్మ యాగమున కుపదర్శనము గావింప నేగుచు దన భార్య రుచి రక్షావిధానమును శిష్యునిపై పెట్టినప్పటి సంబోధన. ఇది యాత నికి ప్రచోదన. హెచ్చరిక. చెప్పకయే చెప్పుచున్నది. ఆమెపై నింద్రుడు కన్ను వేసెను. అతడు మాయలాడు. ఎటువచ్చునో యెటుపోవునో తెలియదు. ఏమఱక యుండు మనుచున్నాడు. ఇది చిన్న విశేషణమే యయ్యు సందర్భమునకు మెఱుగు రాచు చున్నది.

విశాలచిత్త: (2-464)

బ్రహ్మ యింద్రునితో గోలోక విషయము చెప్పుచు నది తెలిసినవాడు లేడని చేసిన సంబుద్ధి. విశాలచిత్త మేమనగా - "అడిగి మేలు సేసి తాలోక మెవ్వరు - నెఱుక కునికిఁ దెల్లము - అదే పద్యము. కావున విశాలదృష్టి కల వాడై యజ్ఞాతవిషయమును సుజ్ఞాత మొనరించుకో గోరిన జిజ్ఞాసువైన దాని మనస్తత్త్వమును వ్యంజించుచున్నది.

ఇట్లు చూచుకో దగినది.

## గౌరవవాచకములు

తమరు - మీరు వంటి గౌరవవాచకముల నుపయోగించి పాత్రల నడుమ నున్న మర్యాదను వ్యంజించు పద్ధతియు ముగ్ధమే.

అష్టావక్రు నాహ్వానించుచు నుత్తర దిశాంగన - 'ఇందు రండనుచు' (2-10) "— మీరు రెంటి - నడఁగ నొక్కమాట యదరి పట్టుట కృత్య మనియెదరు—" (1-225) సుపర్ణుడు తండ్రితో మాటాడు పద్ధతి.

మీకు దెల్ప నెంతదాన - మీరడిగిన - (5-277-78) పార్వతి భర్తతో నన్న మాటలు.

కృష్ణుడు దుర్వాసునికథ ధర్మజునితో చెప్పుచు —"దుర్వాసుండు మన మందిరమునకు వచ్చి (5-371) మాయింటికి వచ్చియని యైన వానితో తెనుగు వాడనునా!? అచటనే కృష్ణుడు రుక్మిణి గూర్చి ప్రస్తావించుచు - రథవహన పరిశ్రాంత యగు మీ తల్లిం జూచి - (5-379) మీ తల్లి యట. లోకగురువు శిష్యుడైన వానితో ననుపద్ధతి ధ్వనించుచున్నది. గురు భార్యను 'అమ్మగారు' అనుట తెనుగునాట ధ్వనించు మాటయే.

# రసశిల్పి

*1 మూలభారతము వైదికసరస్వతి. ఆంధ్రభారత మాలంకారిక సరస్వతి. అది తత్త్వ ప్రధానము. ఇది రస ప్రధానము. అచటి శబ్దము నిదానకము. ఇచటిది శిల్పకము. అచటి ధ్యేయము ఋతము. ఇచటిది రసము.




మూలభారతము.




ఆంధ్రభారతము.

ఈ భేదము ప్రాచీనులే గుర్తించిరి. మూలభారతము తత్త్వప్రధాన మన్న దృష్టితో మహాభారత తాత్పర్య నిర్ణయకారుడు ఆనందతీర్థులు "- దుర్విజ్ఞేయ మథస్సర్వై, ర్భారతంతు సురైరపి-" అన్నారు.

ఇట్లే తిక్కనగారు "లేఖ్యంబైన యామ్నాయము". వేదస్మృతి వాదము లకుఁ దామూదల"- యనుటయు దీనికే. అట్లేని ధ్వనికారుని శాంతరసవాదము మాటయేమి? మూలము తత్త్వప్రధానమై రస మప్రధానమైనచో? దానిని కాదనుట కాదు. రసదృష్టి వ్యాసునిదృష్టు లనేకము లందొకటి. దానినే ప్రధానము చేయుట నిట జరిగినది. ఎడనెడనున్న శిల్పదృష్టిని విస్తరించి సర్వకథను

---

*1 ఉత్తరరామచరిత్ర నాందీశ్లోకము వైదిక సరస్వతీ ప్రార్థన. లోచన ప్రారంభ శ్లోక మాలంకారిక సరస్వతీస్తుతి

తదను గుణముగా చెక్కుట ఈశిల్పదృష్టి ప్రధానము. *1 దీనిచే నది పుష్టమై శోభించుచున్నది. ఇందుకే ధర్మాదులను కుదించి యాలంకారికశిల్పమును పెంచిరి. తిక్కన నాటికి ధర్మ - తత్త్వశాస్త్రములు భాష్యకారుల చేతులలో ప్రత్యేక శాస్త్రములైనవి. ఇందుచే గీతాదులను వదలుట. ఇది భారతాత్మ. కథ శరీరము. ఇది యది యొకటే. కావున వదలుటచే నష్టిలేదు. తిక్కన నాటికి ప్రత్యేక శాస్త్రమైనది యలంకారశాస్త్రము. వ్యాసుని నాటికేదియు లేదు. కావున ధర్మములు - శాస్త్రీయ విషయము లన్నియు వ్యక్తీకరించవలసిన యవసర మున్నది. తిక్కనకులేదు. నాడులేని యాలంకారిక శిల్పదృష్టి నేడు ప్రధానమై పోగా తిక్కన వైదిక సరస్వతిని - ఋతశిల్పమును — రసశిల్పముగా నాలంకారిక సరస్వతిగా బొమ్మ చెక్కెను. "కావ్యరసముం గొనియాడుచు నుందు వెప్పుడున్" అనగా నిది. *2 వేదముల నుండి నాట్యమును భరతమహర్షి వేఱుపఱచి నట్లు ఋతశిల్పము నుండి రసశిల్పము నీయన విడదీసెను. కావున ఋతము శిల్పముఖమున రసమై యాంధ్ర భారతముగ నవతరించినది. ఇది యాజాతి యదృష్ట విశేషము . ఋతశిల్పులు వస్తుశిల్పులు. వారు ఋషులు. కవులు రసశిల్పులు. *3 నాటకకర్తలు చేసిన దిదే.

---

*1 పనుంగు నెక్కి పెక్కనుంగు లిరుగడ రాన్ — (అ. శా. 4-333.)

సారపు ధర్మము — — — — (అ.శా. 4-80)

ఈ మాటలు విరాటోద్యోగము లందలివి. వీని నట్లే వ్రాయుటచే పాఠకుని మనస్సులలో తత్పర్వకథానుస్మృతి యేర్పడుచున్నది. ఋతశిల్ప మందన్న యనుస్మృతి నిది పోషించునదే కదా! కావున మూలమం దెడనెడ నున్న యీ శిల్పమును విస్తరించుట యనువాదకుల ఘనత.

*2 జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ - సామభ్యో గీతమేవచ
యజుర్వేదా దభినయాన్ - రసానా థర్వణాదపి"— (నాట్య. శా.1-17)

*3 భాస కాళిదాసాదులు చేసినపని యిదే. ఇందుకే వీరు క్రొత్తకథలు వ్రాయలేదు. ఉన్నదానినే గ్రహించి రసమూర్తులుగా నవతరింప జేసిరి. ఋషులు తత్త్వమందింపగా నాటకకర్తలు రసకుల్యలను త్రవ్విరి.

శిల్పశబ్దము శిల్పశాస్త్రవిషయము. దాని నిటకు ప్రవర్తింప జేయునపుడు తిక్కనగారి మనస్సులో నా శాస్త్రస్ఫురణ యుండి యుండక పోదు. ఆ శాస్త్రము ననుసరించి శిల్పమనగా యోగము. శిల్పి యనగా యోగి, సాధకుడు, రూపకారుడు. ప్రతిమాకారుడు – ఇన్ని యర్థములం దాశబ్ద మున్నది. యోగి, సాధకు డన్న యర్థము లందెట్లు కుదురును ?

కవి తాను చిత్రించదలచుకొన్న భావమును మనసా ధ్యానించును. ఆ వస్తువు హృదయాంతర్భాగము లందెక్కడో జిలుగుగా స్ఫురించును. ఆ ధ్యేయ వస్తు రూపమున తాను లీనమై తిరిగి విడివడి తదంతర్జాత రూపమునే ద్రవ్య మూర్తిగా చిత్రించును. ఇది యోగము. సాధన. భౌతిక ద్రవ్యమూర్తుల నాధార ముగ గొని రచించువాడు శిల్పికాడు. దవ్యమున కాధారమైన భావమును చూచు టకు యోగి కావలయును. "— therefore the mortal imager should resort to trance Vision, for thus and no otherwise and surely not by direct perception, is the end to be attained."— శిల్పి కర్మను గుఱించి యిట్లు శుక్రాచార్యులు తమ నీతిసారమున పల్కినట్లు శ్రీ ఆనంద కుమార స్వామిగారు తమ "The Transformation of Nature in Art" అన్న గ్రంథమున (పు. 166) వ్రాసిరి. అదే గ్రంథమున 114 వ. పుటలో నశ్వము నెట్లు చెక్కవలెనో తెల్పుచు శుక్రాచార్యు డిట్లన్నా డనిరి. —"When a figure of a horse is to be made, the model (bimba) should always be in View (Vikshya) and if one cannot be looked at (adrstua) the figure should not be made. The artist (silpi) having frist (agre) made his visual contemplation (dhyatua) on the horse and attentive to its froms (auayana natah) should do his work embodying all the proportions (mana) of horses meet for splendor and divorced from ill-omen" It will be seen here that inspite of the apparent demand for likeness to the horse inview there is insistance on Visualization—"

గుఱ్ఱ ు కు క్కుటకే ధ్యానము కావలె నన్నచో దేవతలను చెక్కుట కెంత కావలెను ? రెండును శిల్పిదృష్టిలో నొకటే. కాగా శిల్పావతార ద్వారము యోగము–ధ్యానము కావున శిల్పియోగి. 'మహా కవిత్వ దీక్షావిధి' ఏతా దృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవరసన్నిధిం బ్రశంసించుటయు నొక్క

యారాధన విశేషంబు"- ఇట్టి వందల మాటలు పై సిద్ధాంతమును సూచించు చున్నది. అలంకారికులు వాడని యీ శిల్ప శబ్దమును గ్రహించుటలో తిక్కన గారు తత్సంప్రదాయా ధారమైన తాత్త్విక దృష్టిని వ్యక్తీకరించిరి. ఇట నుండి యీ *1 రస సంప్రదాయము ప్రపంచితమైన దన్న మహాకవి దర్శనము దివ్యాద్భుతము.

శిల్పమనగా బొమ్మ. 'మట్టి బొమ్మ' అన్న మాటలో బొమ్మ కాక 'బంగారు బొమ్మ్మ' ఉచ్చారణలోని యూనిక గల బొమ్మ. ఇది భౌతిక మూర్తి కాదు. అంతర్జ్ఞేయమూర్తి. సౌందర్యమెప్పుడును నాంతరమే. విగ్రహము- తదనుసార ధ్యానము నుండి యే హృదయాకారమున నో స్ఫురించెడి మూర్తి- వేఱు. ఇది శిల్పము. అనిపై శుక్రవాక్యముల వల్ల స్పష్టపడుచున్నది. ఆ శిల్పము - అంతర్జ్ఞేయమూర్తి - ని వ్యక్తీకరించు శబ్దము శిల్పకము. ఇది యభినయాత్మకము. అభినయోపేతము కాని శబ్దమునకు తదంతర్జ్ఞేయమూర్తి నవ భావింప జేయు శక్తి లేదు. ఈ దృష్టి ప్రాచీనాలంకారికుల కున్నది.

కథాయాః స్వభినీతతా- 3వ. పరిచ్ఛేదమున భావికవిషయమున భామహు డన్న యీ మాట కథ సుష్ఠుగా నభినీతము కానిచో వక్రత సిద్ధించదని తెల్పు చున్నది. మఱి శ్రీ శంకుకు డన్నాడు. రత్యాదు లభినీతములే కాని స్వశబ్ద బోధితములు కావు. అనగా -

శోకేన కృతస్తంభః తథాస్థితోయోఽ నవస్థి తాక్రందైః
హృదయ స్ఫుటన భయార్తై రక్షితు మభ్యర్థితే సచివైః -

ఇత్యేవమాదౌచ నశోకోఽభినేయో, అపితు అభిధేయః

భాతిపతితో లిఖంత్యాస్తస్యా భాష్పాంబు శీకరకణౌఘః
స్వేదోద్గమ ఇవ కరతల సంస్పర్శాదేష మేవపుషి (రత్నావళి 2-11)

ఇత్యనేనతు వాక్యేన స్వార్థ మభి దధతా ఉదయన గతః సుఖాత్మారతి ః స్థాయి భావోఽభి నీయతే నతూచ్యతే నతూచ్యతే. అవగమన శక్తిర్హ్యభి నయనం వాచకత్వాదన్యా" (నాట్యశా. 6.వ అధ్యా.)

పై శ్లోకము వర్ణనాత్మకము. క్రిందిది వాచికాభినయోపేతము. అనగా వాచికానుభావ ముండుటచే నది స్థాయి నభినయించుచు దానిని సాక్షాత్కార కల్ప మొనర్చినది. పై శ్లోకము - శబ్దమర్థమును పరోక్షముగ చెప్పుచున్నది. అది వర్ణనమే. పరోక్షవర్ణన రసమును వ్యంజించలేదు. కాగా నెచట శబ్ద మనుభావ ముఖమున విన్యసింపబడునో యట రసము ప్రత్యక్ష మగుచున్నది. తిక్కనగారి యనువాదమెల్ల నిదే పద్ధతిని స్ఫుటీకరించును. దీనిని రెండు మూడు విధాలుగా చూడవచ్చు.

1. పాత్రల ముఖాన కథ నడపుట. ఇది స్పష్టమే. ఇదొక విధమైన 'కథాయాః స్వభినీతతా' కథాస్పష్టత సిద్ధించి వక్తవ్యాంశము నందు భావుకుడు లీన మగుటకు వీలైన నాటకపద్ధతి యగుచున్నది.

2. పాత్ర మనోభావానుకూల సాత్త్వికాభినయమును సూచించుట దగ్గత్తిక వెట్టి - వంటివి.

3. కథ ననుభావ ముఖముగా నవతరింప జేయుట.

తిక్కనగారి ప్రత్యేకత ప్రధానముగా నిక్క డున్నది. అంతటి రసధ్వని ప్రస్థానాచార్యుడు తెనుగున మరొకడు లేడు.

ఐతిహాసికశిల్పులైన ఋషులు వస్తుశిల్పులు. దానిని గ్రహించి రస మూర్తులుగా దిద్దినది కావ్యనాటకశిల్పులు. *1 వారు తాత్త్విక ధర్మతత్పరులు. వీరు కావ్యశిల్ప (ధర్మ) తత్పరులు.

---

*1 ఋతశిల్పుల పద్ధతి పల్లీ నాగరకత వంటిది. తాతగారు కథ చెప్పు పద్ధతి. వేసవిరాత్రులందు వేపచెట్టు క్రీనీడలో వెన్నెలలో పరుండి చుట్టు మనుమలు, మనుమరాండ్రు కూర్చుండగా తాతగారు కతలల్లి చెప్పుపద్ధతి. ఇంద శ్లీల ములును దొర్లును. పల్లెలలో నిది తప్పుగాదు. కావ్యపద్ధతి నాగరకము. ఇది భ్రాతగారి కథన పద్ధతి. తమ్ములు, చెల్లెండ్రు చుట్టుకొనగా నొకకొన భార్యయు నుండగా కథచెప్పు పద్ధతి. అశ్లీలము లున్నను భార్య మనసుకు తగులునట్లు వ్యంగ్యముగ భాసింపజేయుచు చెప్పుపద్ధతి. అది తపస్వి- ఋషి లక్షణము. ఇది రసతపస్వి - కవిలక్షణము. దీనికది యాధారము. ఇందుకే యీ వ్యాసము ఋత - రస శిల్పులన్న యధ్యాయములుగా వ్రాయబడినది.

సుదర్శనుకథలో నతిథివచ్చి యతని భార్యను వాంఛించెను. అది విని యాపె భర్త్రాజ్ఞయు నదే కావున నేమియు సంకోచింపలేదు. అంగీకరించెను. 'తథేతిలజ్జామానాసా' (2-51) అని మూలము. ఆమె ధర్మదీక్ష ధర్మమం దామె కున్న దృఢబుద్ధి యెంత విస్మయావహము! ఇది 'వజ్రాణామపి' కఠోరమైన ధర్మదీక్ష. ఇది ఋషి రచన. దీనిని తిక్కనగారు -

"సతి దనపతి వచనంబులు - మతి జొనుపుం దెంపెమాను మానవెఱచు న

య్యతిథి పసపు సేయక త్రో - చు తలంపల వఱచు -" (1-72)

ఈ డోలాందోళనము మూలమున లేదు. ఇది లౌకిక ప్రవృత్తి. పాతి వ్రత్యము- లోపించునుగదా యన్నబాధ. మూలమం దేల లేదు? అచట నతిథి మర్యాద. భర్త్రాజ్ఞా పాలనము వీని ముందా యాలోచన లేమి? ఏమైనను సరే. తల పోయినను సరే. ధర్మము ధర్మమే' "అరే! మానము పోవుచున్నది. బాధ యుండదా? ఆలోచన తావన్మాత్రమేని యుండదా; అది ఋతశిల్పము. ఇది రసశిల్పము. దాని ధ్యేయము ధర్మము. దీనికి రసము. దీని కాధారము లోకము. అనగా కథ, పాత్రల చిత్తవృత్తులు - ఈ భేదము ప్రధానము. కావున తిక్కన గారి దృష్టి రసలగ్నము. ఇందుచే మూలమందలి వస్తుశిల్పము ననుభావముఖమున రంగరించి నాట్యాయ మాన మొనర్చెను.

సుదర్శనుకథలో నగ్నివిరహవర్ణన (1-48) మఱియు నత డాసుదర్శనుతో స్వవిరహవేదన సూచించిన పద్యము (1-49) కేవల రసైకతత్పరములు. ప్రథ మానురాగము-చక్షుఃప్రీతి కలిగిన విధానమెట్లో మొదటిపద్యము చెప్పుచున్నది. అది సుదర్శనా సౌందర్య మెట్లాతని లోగొన్నదో చెప్పుపద్యము. ఆలంబన విభావ వర్ణన. రెండవది రతిభావవ్యంజకమైన తదాలంబన వర్ణన. సుదర్శన యంద మితని కాలంబము. దాని ననుసరించి యిత డన్నమాటలు తత్సౌందర్య వర్ణనమే కావున సుదర్శన కిది యుద్దీపనవిభావమై రతిపోషక మగుచున్నది. అగ్నిమాటలు వాచికాభినయము. అనుభావము. వాక్కే చేష్ట. ఇది శ్రీశంకుకుడు చెప్పిన పై శ్లోకము '-భాతి-' వంటిదే. ఆమె సౌందర్య మగ్ని కుద్దీ పనము. దాని నీతడు వర్ణించుటామె కుద్దీపనమై 'రతి' ధ్వనిత మగుచున్నది.

*1 ఇది కేవల రసతత్పరమైన రచన. కానిచో నమూలకమైన రచన కర్థములేదు.

శబ్దాభినయము:— పాత్రల ముఖముగ కథ నడచినచో నట్టే యనుభావవర్ణన మున్నచో శ్రవ్యము దృశ్యమాన మగును. సరే. మఱి కవి తానై కథ చెప్పు నప్పుడు వస్తువు నాట్యాయమాన మగుటెట్లు? అనగా శబ్ద మేవిషయము నభిన యించవరె. శబ్దమున కభినయశక్తి యున్నది. అది వాచకత్వము కంటె భిన్నము. వ్యావహారిక శబ్ద మభినయాత్మకము కాదు. కావ్యశబ్ద మభినయాత్మ కము. ఇది కవిమనోగతము. శిల వ్యవహారాపతిత శబ్దము. శిల్పము కావ్యశబ్దము శిల శిల్పమగుట యభినయద్వారముననే. భారతీయ శిల్పమేమి! కళ లన్నియు నభినయోపేతములు. *2 పాశ్చాత్యముల నభినయోపేతములై వాస్తవిక ప్రాకృ తికములైన వైనందుననే యాధునికకళ దానికి పూర్తిగ వ్యతిరేకములైన సిద్ధాం తములను పెంపొందించు కొన్నది. భారతీయశిల్పము ముద్రాభంగిమా మనోజ్ఞయై యలౌకికమై కేవల సౌందర్య నిధాన మగుచున్నది. శబ్దము నంతే. తిక్కన శబ్దము త్రిభంగిమా మనోజ్ఞమైన పాలభంజిక—

"మను వంశంబునఁ బుట్టి సర్వజనతా మందారమై నేల యె
ల్లను బాలించి జగత్త్రియీ ప్రణుత లీలం బొల్చె దుర్యోధనుం
డను రా జవ్విభు నొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్
(1-44 ఆ.శా.) వనితారూపము దాల్చి పొందెనతనిన్ వైదగ్ధ్య హృద్యంబుగన్"

---

*1 కాని యిట విచారణీయాంశ మున్నది. కథలో నీవర్ణనకు ప్రాధాన్యము లేదు. కథాతాత్పర్య మాతిథేయ సపర్య మృత్యుతారక మని. ఈ యగ్నికి జనిం చిన సుదర్శనునకు పుట్టిన యోఘవతి సుదర్శను వివాహమాడగా నీమెను ధర్మ దేవత వాంఛించుట - వారు ముక్తివడయుట కథ. కథాతాత్పర్యమిది కాగా పై శృంగార రసానుకూల వర్ణన మప్రధానమైన సుదర్శనాగ్నుల విషయమున నిబం ధించుట యస్థాన పతితము. కథాప్రాధాన్యవివక్ష యది కామిరసము గుణీభూత మగుచున్నది. ఉన్నను లేనట్లే. ఐనచో వర్ణనలోని యౌచిత్య మేమి? ఇందుకే మూలమున నీగొడవ లేదు. అక్కరలేదు కావున.

*2 పాశ్చాత్య శిల్పాదులు చూచిన నీవిషయము స్పష్టమే. అచట లౌకిక వాస్తవిక సౌందర్యమే పరచుకొని యుండును. 'ఎఫ్రొడైట్ - వీనస్' వంటివి కేవల భౌతికసౌందర్యమూర్తులు. గ్రీకుల నుండి 20వ. శతాబ్ది దనుక నూటికి తొంబదివంతు లీకళ వాస్తవికమేయని హెర్బర్టోరీడ్ చెప్పినదే.

ఇట భీష్ముడు వక్త. సుదర్శనుగాథ క్త వ్యాంశము. కథ నిక్కడ మొదలుపెట్టినాడు. ఉదారత స్పష్టమే. ఎత్తుగడలోని సొగసు- వంశం- అన్న చోట నారోహణము. జనత్తా - తా మీద దీర్ఘము తీయుట - మందారమై తన్మ యత్వము భజించి యర్ధనిమీలిత నేత్రాలతో ననుట - నేలయె, ల్లను- మొదటి వాక్యము బరువంతయు దెచ్చి 'ల్ల' - మీద పెట్టి నొక్కుట జగత్, ప్రణత - ద్విరుక్త రేఫ సంఘటనచే బంధసాంద్రత ఘటించుచు చెప్పు వక్త యొక్క యభినయాత్మకమూర్తి జిలుగుజిలుగుగా రేఖాచిత్రమై మనోంతర్భాగము లందు పొడుచుచున్నది. భీష్ముడు నటుడై విషయము నభినయోపేతముగా ప్రదర్శించు చున్నాడు. ఇది లేనిచో న వ్విభునొప్పు నర్మద కుద్దీపనమైన దన్నమాట య యధార్థమై తాటస్థ్యదోషము ఘటిల్లును. ఆ యొప్పు పై రెండు పాదములు పై రీతిగా నభినయాత్మకము లగుటచే సిద్ధించుచున్నది. (అనగా నర్మద ప్రేమించు టకు కారణ మాతని యొప్పుగదా! అదెట్టిదో శ్రోత కెట్లు తెలియును? పాత్రలు కతలోని వారు. శ్రోతలకు వారికి సామ్యమెప్పుడు తటస్థించును. అనగా వారి భావాదులు వీరి యనుభూతి కెట్లందును? ఇది లేక పోవుట తాటస్థ్య దోషము. ఇదెట్లు పోవును? అభినయద్వారమున. ఈ యభినయము శ్రవ్యకావ్యమున నెట్లు సిద్ధించును. ఆయొప్పుపాత్రకు తెలిసినది. శ్రోత్రనుభవమున కెట్లు రావలెను? కావున శబ్దమునం దభినయశక్తి నాధారించవలెను. ఇది కవిమనోగత మహాశక్తి అపుడా 'యొప్పు' శ్రోతలకును తెలిసినది.)

మొగమ్ము ముఱకటించుకొని- గరుడి వినతను విడిచిపుచ్చు మన గద్రువ చేసిన యభినయమును కవి సూచించుచున్నాడు. ఆమాటచే పెదవులు బిగించి మూతి యొక ప్రక్కకు త్రిప్పి 'ఊఁ' అని సాగదీసిన ఒక స్త్రీ రేఖామూర్తి. భావాకృతి సూక్ష్మ శరీరయై స్ఫురించుచున్నది. ఇదే శబ్దాభి నయమనగా. సర్వత్ర నింతే.

ఇట్లు ఋతశిల్పము రసశిల్పమై యాంధ్రభారతిగా నవతరించెను.

## శబ్దము

తిక్కనగారి శబ్దము బంతిపూవు. అది జాత్యము. చిగుళ్లతో శోభించు మామిడిమొక్క. మామిడాకుల తోరణాలు వ్రేలగట్టిన నందగించు తెలుగుల వాకిలి. వీనికి వాసనలు లేవు. దీని పరిమళము ఆంధ్ర పల్లీ సౌందర్యము. నూటికో తొంబదిపాళ్లు తిక్కనగారి శబ్ద మిట్టిది. సంస్కృతము తెన్గు గావించుట యనగా నేమి? మూల సంస్కృత శబ్దమే యే భావావేశమునకు ఆకృతియో ఆ భావావేశమున ననువాదకుడును తన్మయుడైనప్పుడు వా డేభాషాకవియో ఆ భాష యందలి జాతీయమే వాని నోటినుండి ఊడిపడును. ఇందుచే తిక్కనగారి శబ్దము తెలుగు పల్లెటూళ్ల అందము నెగబోయును. ముద్దబంతిపూవు వంటిదనుట. అది భావించినగాని తెలియని యందము. ఒక దేశపరిధికి యొదిగిన మనస్సున మాత్రమే భావింపబడునట్టి అందమది.

సారపుధర్మము (అను శా. 4 - 80) క్రూరపు భూతముల్ (అను శా. 4 - 435)

తిక్కనగారు సమాసము లిట్లు చేయుటలో అర్థము తెనుగు గావించుట. తత్సమీకరించుట కాదు. పుగాగమము చేయుటచేత సంధి సమాసములు తెలుగగుచున్నవి. సారధర్మము, క్రూరభూతము లనుటకంటె ఇట్లనుట తెనుగనుట జాత్యమనుట. ఇది యాతని శబ్ద స్వరూపమును సూచించుట కన్నమాట. (తిక్కనగారిది వికటశైలి. పుగాగమాదులు చేయుటచేత శైలియం దెగుడుదిగుడులు వచ్చి బంధ వైకల్యము సిద్ధించుచున్నది. సవర్ణ దీర్ఘాదులు చేయుటచేత మృదుబంధ మేర్పడి సుకుమారశైలిగా రూపొందు చున్నది. ఇట్లు శైలీ గతముగను దీనిని సమన్వయించ వచ్చును. అనగా శబ్ధమును శైలీకక్ష్య లోనిదే.)

తిక్కనగారు వాడిన శబ్దములకు సామాన్యముగా మూల ముండదు. అతడు చేసినది తాత్పర్యానువాదము గాని శబ్దానువాదము కాదు. ఒకవేళ మూలమెట్లుండునో యని చూచినచో నిట్లుండును.

| తెలుగు | | | మూలము |
|---|---|---|---|
| 1 అను | 1-3 పౌడపాపపుర్వ | 1-24 | క్షుద్రం సర్పం |
| 2 | 1-23 కాలుని యఱచేతిది | 1-52 | కాలాత్మకం |
| 3 | 1-76 ఓ యనుట లేకున్న, కన్నువఱపి | 2-63 | కథం న ప్రత్యుదేత్సద్య స్మయమానా యథాపూర్వా |
| 4 | 1-75 ఎలుఁగుసూపు | 2-63 | ప్రతి వచః |
| 5 | 1-211 ముఱకటించుకొని | | ద్రుప్రప్రజ్ఞాపరీతా |
| 6 | 1-263 ప్రుగ్గబడు | | సంశమనమ్ |
| 7 | 2-5 గట్టి ప్రాయమునది | 19-24 | వృద్ధాం |
| 8 | 2-14 ప్రమానై యుండెన్ | 19-79 | నిర్వికారం-కాష్ఠకుడ్యోపమమ్ |
| 9 | 2-8 సర్వము సంపన్నంబు | 19-51 | అర్చితోస్మి |
| 10 | 2-21 ముదురుదనంబు | 19-98 | జరయార్దితాం |
| 11 | 3-257, 258 ఇమ్మరి(యేల తడిసితి) | 95-15 | (కిం) చిరేణ (త్వమాగతేతి) |
| 12 | 4-113 ఉప్పులవాయి | 104-104 | అంగుష్ఠస్యచ యన్మధ్యమ్ ప్రదేశిన్యాచ్చ |
| 13 | 4-274 చచ్చునంతలు (వడి సిరిఁ దెచ్చుకొని) | 112-20 | అవాస్య ప్రాణసందేహం కార్కశ్యేన సమార్జితమ్ |
| 14 | 4-318 తెప్పదెఱలంగ (బం డు లేతెంచుచున్నయవి.) | 117-10 | శకటస్యాస్య మహా ఘోషం శ్రుత్వా |

ఇట్లుండును. ఈతని యనువాదమందలి శబ్దవిధాన మిది. కొన్నిటికి యథామూల ముండదు. తత్సందర్భము మాత్రమే యుండును. ఉదాహరణముగా పై 3, 5, 11, 14. ఇట్టివి. 12 వ సంఖ్య మాట వంటివి తెనుగుమాటనే పని గట్టుకొని వ్రాయవలెనని వ్రాసినట్లున్నది. 13, 14 వంటివి జాతీయములు. 9- వంటివి మూలమున కెక్కడి తెనుగు ?-

కావున, జాత్యమైన తిక్కనగారి శబ్దమునకు మూలము సంస్కృత గ్రంథ మున నుండదు. అన్వేషణ మనవసరము. ఆ మహాత్ముని నోటినుండి వచ్చిన నీశబ్దములు, తెనుగుమాటను, నోటనానిన నుడులు, నానుడులు, నానుడునుడులు సర్వము జాత్యమే. జాతిగలదే. ఆ శబ్దము లెచ్చట నుండి తెచ్చునో గాని బహు విచిత్రముగ నుండును. తెనుగుబాసలో నిన్ని శబ్దము లున్నవా ? ఆ బాస యిట్లుం డునా ? యన్నంత నివ్వెఱ గొల్పును. శ్రోతల కనులు మిఱుమెట్లుగొనును. చెవుల త్రుప్పు డుల్లును. ఇందుకే శ్రీనాథుడు "పదేను పర్వములు తెనుంగు గావించె" నని తిక్కనగారిని స్తుతించుట. (ఆయన వ్రాసినది పదిహేను పర్వ ములు చెప్పినచో వాచ్యార్థమే. అందు స్తోత్రములేదు. వాస్తవిక సత్యము చెప్పి నట్లు గావున. పదేనులో 'దే' ను దీర్ఘీకరించి చదివినచో గుండెలు బాదుకొనుచు చెప్పినట్లు స్ఫురించును. అనగా నాశ్చర్యము వ్యక్త మగును. తెనుంగు గావించుట యనగా మూలకథను తెనుగుకథగా మార్చుట. బంగారమును హారముగా మార్చుట వంటిది. అనగా పైరీతిగా ననువదించుట.)

ఈ దృష్టితో తిక్కనగారి జాత్యములైన పలుకుబడులు నీపర్వమున నిట్లున్నవి.

ప్రథ. ఆ. 1-1 అది యొక్క తల

1-11 పేదమాటలు

20 మిడుకనీక

29 ఒరగనాడిన యంతన్

34 తన జేసినదానిం బదకపోవ శివునకు వశమే ?

51 తలవీడు. (శబ్దారచంద్రిక 'వీడు' లో నఱుసున్న వేసి. పుర ప్రదేశము, సమీపప్రదేశము వంటి అర్థములు చెప్పినది కాని భారతప్రయోగమున అఱసున్న లేదు. పాఠాంతరమును వావిళ్ల ప్రతి చూపలేదు.)

192 చూపు దప్పించె

193 ఒడ్డారము

261 ఆగడము

ద్వి. ఆ. 24 పోయెదఁ బనులు గలవు

177 కుడుచుట కట్టుట పూయుట తొడుగుటయును

200 మూడిన

205 చిక్కువడి

217 పలుకు వలికి (ఈమాట 2-272, 3-447, 4-381 ఇట్లు చాలచోట్ల వాడెను. ఇది నేటి ప్రయోగమున తోచుట లేదు. కాని రాయవాచకమున "మాటా పలుకు లాడి" ప్రయోగ మున్నది. మాటాపలుకు లేకుండ అన్న ప్రయోగము నేడును నున్నది.)

223 కన్ను మనంబును దనిసిన గన్నియ

270 తలవిసరి- (కాదని- అన్న యర్థమున)

279 మొగమోట

302 కుడుపు నిదురయు వర్జించి

310 దాపట వలపట

331 ఇన్నిపోకలం బోయితి

365 నడుము (మధ్యలో నన్న యర్థమున)

402 గొడ్డు, బడుగు తెగులు గొంటు క్రేపు

423 మందట

427 సబాము

446 ఏటిమడ, వట్టోడి

464 అడిగి మేలుసేసితి

తృ.ఆ. 104 పెటిక

194 పూరి పంట ప్రాలు, ఆరుగబియ్యంబు

220 కనుపుగొట్టు

232 తూఁడు తీఁగలపొది

245 తూఁడుల కట్టు

257 త్రొక్కు (నడచు నన్న యర్థమున)

261 ఒదుఁగఁ బాఱక

297 కని కొనుచు
298 నలుమడించుకొను
285 ఇనుమాఱు, ముమ్మాఱు
299 అఱుగడు
300 అఱుగవంద్రుడు (ఈ రెండును పాపము పోదన్న అర్థమున)
306 ఇయ్యన (ఈయనకు రూపాంతరము)
చ ఆ. 90 పిట్ట, పుడుక, గోరు.
98 రచ్చకొట్టము
101 పాదు
164 తంగెటి జున్ను
183 చిక్కు గడవవచ్చు
203 చూఱ విడుచు
287 కుంటువడు
320 ప్రాణగొడ్డము
358 ఇలువడి (5 - 290 లో 'ఇలువాడి' అని యున్నది ఇచట పాఠాంతరములేదు. 4-358 దగ్గర 'ఇలువాడి' యని పాఠాంతర మున్నది శబ్దార్థచంద్రిక 'ఇలువడి' నే గ్రహించెను. 5-290లో ఇలువడి యన్నచో ఛందము పోవును. కాన ఇలువాడియే ఒప్పు)
381 వెనుకంబాఱు
407 ఉడుకులవెట్టు
పం.ఆ. 28 గురుములు
పం.ఆ. 34 పదాఱవపాలు
64 వట్టిలవాఱు
75 కారుత
84 తూలపోవు
93 కొనటులు
98 ఒరటులు
100 ఉఱుము
104 గ్రచ్చులు, తూన్కిఁదఱపి
107 పొలువలు
161 పొట్టు పొర లగుదురు
163 ఊరక కానఁగ నలవియె
202 తేరసి
211 కుంచెడు
212 పొంపిరివోవు
230 పొత్తినూలిపుర్వు
234 అచ్చుపడుచు
235 కోలుపులి
235 మాపు, రేపు
299 సైకంబు
345 పెడతల
345 నక్కిళ్లు
346 వలియం బాఱు
348 ముడుఁగఁబడి
370 చేరుగడ
372 మ్రొగ్గతిలు
429 పూరి పుడుక
430 మొలవంబెట్టని యట్టిది మొలుచునే
431 వెదకికొని వచ్చు

ఈ శబ్దప్రయోగము నందు మరియొక వైచిత్రి యేమనగా కొన్నిచోట్ల విద్యార్థిని దృష్టిలో పెట్టుకొని ఏకార్థకములైన శబ్దము లెన్నిటినో ప్రయోగించును ఉదాహరణమునకు

గొఱియనంజుడు ఖడ్గంబు నెఱచి గండ
మృగమునందలి పలలంబు మేకమాంసము (3-167)

చతుర్థాశ్వాస మందలి ఇంద్ర గౌతమసంవాదము యేన్గును గురించి. ఆ యేన్గు శబ్దమున కెన్నో పర్యాయవాచకములు కవి ప్రయోగించుట చూడగా విద్యార్థి కది యుపయోగపడు ననుటయే కాక యేకశబ్దమును వాడినచో విసుగుదల జనించును. గావున దానిని పరిహరించుటకు నవి వచ్చును. ఏనుగు 4-57, కరిపతి 58, సామజము 59, దంతి 61, హస్తి 63, గజము 64, వారణము 66, ఇభము 67, కుంజరము, కుంభి, గౌరు 70, రది 72, ద్విపము 73, మతంగము 75.

ఇట్లాతని శబ్దప్రయోగవైచిత్రి కంఠదఘ్నమై కన్పించుచున్నది.

# ప్రాచీన, నవీన పరాశరసూనులు

అనువాదకుడు మూలగ్రంథ తాత్పర్యమునే కాదు శైలిని సైతము ననువదించవలెను. అచటి పదబంధముచే లభించు శైలీరామణీయకమును ననూదితమైనచో మూలగ్రంథ సౌందర్యము దేశభాషావేత్తలకు బోధపడును. ఇది మూలకర్తను పరిచయముచేయుట. చాలవరకు నిది నాటకానువాద పద్ధతి. తిక్కనగారు చేసిన దిదే.

సౌందర్యము ద్వివిధము. స్త్రీ – పురుష భేదములచే. అది మసృణము. మధురము. ఇది గంభీరము. బంధురము. ఇట్లే సాహిత్యాదికళ లందును. మధుర లేక యాలంకారిక శైలి. విచిత్ర లేక క్షాత్రశైలి. వ్యాసశైలి రెండవది. తిక్కనదియు అద్భుతావహ మైనంత మధురముగాదు. వాల్మీకి, నన్నయలది మధురమైన యాలంకారిక మార్గము. ఇది యొదిగి ప్రవహించు శరత్స్రవంతి. ఉద్యానవనరామణీయకము. వసంతర్తు శోభ. వ్యాసునిది పురుషసౌందర్యము. వర్షాస్రవంతి. కేవ లాలంకారికమార్గమున కొదుగునది కాదు. కొన్నిసార్లు కేవల లోకానుసరణము చేయుచు మఱికొన్నిసా ర్లూత్పథమున నెగసి తాత్త్వికలోకముల కంట పెరగి మఱికొన్నిసార్లు రెంటికి నడుమ నున్న యాలంకారికమార్గముల కొదిగి నడచును. ఇట్టిది త్రివిక్రమమూర్తి. దీని లక్షణ మిది యని తెగవేసిచెప్పుట కష్టము. కనుక విచిత్రము. బంధసాంద్రము కనుక ప్రౌఢము. క్షాత్రము. కూర్పులో నోజ స్సున్నది కనుక. ఇందు గాంభీర్యము ప్రధాన లక్షణము. Micheal Angelo, cezanne – వంటి శిల్ప, చిత్రకారుల రచనలను Heroic Style అని వారి విమర్శకు లన్న మాటలు. వ్యాసశైలిని గూర్చి శ్రీ అరవిందులు Masculine అన్నారు. ఇది సర్వాత్మనా తిక్కనగారి కన్వయించును.

ఇచటి శబ్దము ప్రసన్నము. గంభీరము. ఇది శబ్దఘటనలో నుండును. ఎవ్వడో త్రివిక్రముడు తల యాకాసమున పెట్టి మాటలాడి నట్లుండును. శబ్దము కొబ్బరిబొండ్లముల నీరు వలె నుండును. కర్పూరజ్యోతి వలె నుండును. ఇం దాలంకారికగుణములైన మాధుర్యాదు లుండవు. అవి శబ్దార్థములకు నడుమ

పొరలువైచి తెరలు పట్టి పాఠకుని దృష్టిని యర్థము నుండి బాహ్య శాబ్దిక దశకు తెచ్చును. (ఇందుకే యాధునిక పాశ్చాత్యక శాపితామహుడైన పికాసో - రచన లందు వర్ణము లుప్తమై పోయినది. రంగునకు ప్రాధాన్యము పోయినది). తాత్త్విక దృష్టికల కవిలో దీనికి ప్రాధాన్యము లేదు. ఇచటి శబ్దము నిరలంకృతము సీదా సాదా మాటలు అంతయు 'దేశీవాళీ సరుకు'. కాని యీ మహాత్ముల చేతిలో నవి మొగము బిగించుకొన్న రారాజులు. గుండె దిటవుకల క్షాత్త్రకుమారులు. అరవ్యక్తీకరణార్థమే శబ్ద ముండును. దానంతట దానికి స్థితిలేదు. అర్థగ్రహ ణానంతరమే శబ్దమునకు తళుకు వచ్చును. ఇతరు లందు ముందు పదసౌంద ర్యము భాసించును. మహావేశమనస్కులై నందున విషయదృష్టిపై పోవుదురే కాని శబ్దముల నలంకరింతు మన్న పట్టుదలకలవారు కారు.

వ్యాస శబ్దమున వైదికవాసన యున్నది. అతడు ఋషి కావున. అది భవభూతి యందే యున్నది. వారి శబ్దము లందేదో శ్రుతిలక్షణము - పారమేశ్వ రీయకలక్షణ మున్నది. సంభవామి యుగే యుగే - నతత్ర సూర్యోభాతి వంటి చోట్ల రచన మాలంకారికమా? మధురమా? *1 కావున వైదికము. తాత్త్వికము. ఇట్టి రచనలో క్లిష్టత తప్పదు. ఇందుకే వ్యాసఘట్టము లున్నవి. తిక్కనఘట్టము లును పండితవేద్యములై యున్నవి. కాని సామాన్యముగ ప్రసన్నగంభీరము. తిక్కనగారు తెనుగుశబ్దమున కా వైదికలక్షణము కల్పించి యాభాషను పునీతము చేసిన మహాత్ముడు. సమాధ్యవస్థనుండి యావిష్కృత మైనందున కాబోలు శబ్దము శ్రుతిలక్షణ మేచుకొన్నది.

వీరి రచనలో వ్యక్తిత్వము, శాస్త్రీయ బుద్ధిపటుత్వము, తర్కలక్షణము మృదులోహపద్ధతి నతిక్రమించి భాసించును. చెప్పుచున్న భావమున బడి వారును కదలిపోవు స్వభావము కలవారు. కొండకొమ్ము నుండి దూకు సెలయేళ్లవంటి వారు. పాయలవెంట నొదిగిన తీపిజాలు కాదు. వీరిశబ్దము వాచ్యతామహస్కము తెగవేసినట్లుండును. అలంకార రస సంవిధానకాదుల దొకపద్ధతి.

వ్యాసశైలిలో ప్రధాన గుణాలు — **Pureness - strength, grandeur of intellect and personality** - ఇవి అరవిందుని మాటలు.

---

*1 ఈ శైలినే **The Problem of Style** లో **Middleton Murray** **"Sublime Style"** అన్నాడు. అట చూచుకోవచ్చు.

(చూ. Vyasa & Valmiki. పుట. 14) ఇందుచే నిది సర్వథా యాలంకారిక మార్గము కాదు. ఇందు శబ్దము చెక్కబడి యతుకబడును. వాల్మీకి శైలి యట్టిదిగా పై గ్రంథకర్తలు. వాల్మీకి దెంత విశ్వజనీనమార్గమో వ్యాసుని దంత కాదు. ఇది దేశీయము, జాతీయము. ఇదే తిక్కనగారి మార్గము. అది నన్నయగారి మార్గము. ఇందుకే రచనలో తిక్కనగారి మహావ్యక్తిత్వము కొట్టవచ్చినట్లుండును.

మొత్తము మీద వీరి శైలిలో నొక ఠీవి - దర్జా యున్నది. సంధి బంధ కార్కశ్య ముండును. అదొక యప్రధృష్య - అనధిగమ్యమైన పద్ధతి.

కావున విచిత్రశైలి యెంత వాస్తవికమో యంత తాత్త్వికము. ఎంత తాత్త్వికమో యంత యాలంకారికము.

ఈ దృష్టితో నాలంకారికులైన వక్రోక్తి జీవితకారాదులు సుకుమార - విచిత్రశైలులను గూర్చి కొంత వ్రాసిరి. వారి యాలోచనామార్గమున కిది తాత్త్విక భూమికగా కించిత్తు సూచింపబడినది. ఇది ప్రత్యేకించి వ్రాయదగినను నితరవిషయములతో బాటుగా స్థలాభావమున నీషత్తు స్పృశింప బడినది.

వ్యాస శైలిన గూర్చి —

* ఉత్తిష్ఠోత్తిష్ఠ కింశేషే భీమసేన యథామృతః
నా మృత స్యహి పాపీయాన్ భార్యా మాలభ్య జీవతి.
(విరా. 17-15)

---

* దీనికి తెనుగుపద్యము విరాటము
అందు సుఖోచితశయ్యను నిద్రమన్కి - ఇత్యాది కలదు. ఇందు యథామృతః వంటి మాటలేదు. కావున నౌచిత్యమున్న దనవచ్చు. ఉద్రేకము నణచుకొని భర్తను మర్యాదగా సంభావించుట యున్నది. మూలమున నసంయమితోద్రేక మున్నది. యథామృత ॥ - యన్నమాట భర్తను నిందించుట కాదు. పతివ్రత- అభిమానవతి పడిన యవమానాతిశయమును సూచించుమాట. ఇట్టి పట్ల సంయమన ముండునా? ఇందుచే మూలరచన మహోద్రిక్తమై నిబిడముగా నున్నది. తెలుగున సరళము వక్తమాటలో మృదుమనస్మిత యున్నది. ఇది చాలవర కాలంకారికమార్గము. ఈ దృష్టితో నిది బాగు. ఆ దృష్టితో నదియు. రెండును ప్రత్యేకరచనలు. ఇదే బుత - రసశిల్పము లనబడినది. భర్తను "నీవు" అన్న చనవు నాటిది. మీరు-అన్న గౌరవము నేటిది. ఈ రెండు దృష్టులతో నీరచనలు చూచుకోవలెను.

ఈ శ్లోకముఖమున శ్రీ అరవిందులు వ్రాసిన విషయము (పు. 35) చూచినచో నీ శైలీగుణము తెలియును.

ఆలంకారికమార్గమున నీవిచిత్రశైలి నిట్లు చూడవచ్చు. శబ్దము ప్రసన్నమగుట సర్వరసానుకూలత సిద్ధించినది. ఇదే రసాభ్యుచితబంధము. శబ్ద సంవిధానకమం దెగుడు దిగుడు లున్నట్లు (అనగా వికటబంధము) రస సంవిధానకమందును నున్నది. నానారససమావేశము ఘటించి ప్రధానరసస్ఫూర్తికి వీని నంగములు చేయుట. ఇదే భవభూతి కాళిదాసు నతిక్రమించి యాయన నాటకము లందు చేసినది. దానినే యాయన మూడు నాటకము లందును మాలతీమాధవము శృంగారాద్భుతము; వీరచరిత వీరాద్భుతము; ఉత్తరచరిత్ర - కరుణాద్భుతము నని రస ప్రాధాన్యముకు సూచించుటలో వాడిన యద్భుతశబ్దము విచిత్రసంవిధానక స్ఫోరకమే. నానారససమావేశము చేసి అహో! రసములు పరస్పరము స్పర్ధించుచున్నవి - ఇట్టి మాటలనును. ఈ స్పర్ధ సంవిధానకము. ఇది విచిత్రము. ఇదే తిక్కనగారి మార్గము.

# పద్యరచన

"పశ్చా ద్గురుత్వం సంయోగాత్ విసర్గణా మలోపనం
విసంధి వర్జనంచేతి బంధ చారుత్వ హేతవః" (వాగ్భటాలంకారము)

ఇది విచిత్ర మార్గశైలి. విసర్గ సంయుక్త ద్విత్వాక్షర పూర్వకలఘువు గురువైనపుడు రచన కదను త్రొక్కును. ఈ వికటబంధమునకు తెనుగున నాద్యుడు కవిబ్రహ్మ. ఈ లక్షణము సర్వత్ర దృశ్యమానమే. రచనలోని చిక్కదనమున కొక యుదాహరణము.

"ఘనతరకంధరుండు దృఢకాయుఁడు దీప్తముఖుండు వహ్నిలో
చనుఁడు మహోత్తమాంగకుఁడు చారు సుసంగత పక్షసారమం
దనుఁడు పరిస్ఫుర ద్ద్యుతివిడంబిత బాలదివాకరుండు లో
కనయన పర్వనిర్వహణకారి సుపర్ణుఁడు పుట్టె భూవరా!"

(అను. శా. I - 177)

ఆ మహాకవి యెంత దంతురముగ వ్రాయునో దీనిని బట్టి విచారించు కోవచ్చు. ఘు - తో పద్యమారంభమై గీట్లు గొట్టిన పదసంపుటి యందారోహణ భాసించుటచే వర్ణితాంశ మహత్త్వ ముద్బోధక మగుచున్నది. లో, చనుడు - మం, దనుఁడు ఈ సమానవిచ్ఛేదము. లో కనయన పర్వ నిర్వహణ - లో మీది దైర్ఘ్యము ర్వ - కార పునరావృత్తిపై యవరోహణ సారభూతములై దాని నెల్ల నిట నిపతించుకొనుచున్నది. పరిస్ఫుర ద్ద్యుతి - ఈ కూర్పుచే బంధవైకట్యము అశ్వగతి సిద్ధించుచున్నది. ఆ మహాత్ముని కూర్పు బ్రహ్మభేద్యము. మూలకారుని కథానిబిడత్వము వంటిదే. కూర్పులో నంత చిక్కదనమును తర్వాత రాయలు రామకృష్ణులను వదలి సాధించినవారు లేరు. ఆ మహానుభావుని శబ్దప్రసన్నత యభినయ విషయమందలి పద్యములు సాక్షాత్కరింప జేయును. ఆ శబ్దశోభ శివ సౌందర్యము కాని వైష్ణవ సౌందర్యము కాదు. అది కేవల వైదిక - ఆర్ష సంస్కృతీ

ప్రసన్నత. ఇందుకే వ్యాసశైలిని గూర్చి శ్రీ అరవిందులు - Diction of the upanishads - అన్నారు precise, pure, clear and full అని యా మహా యోగి దార్శనిక సత్యవాక్కు. ఇదే తిక్కనగారి శబ్ద సౌందర్యమును.

కవి బ్రహ్మశైలిలో నొక మహాలక్షణము - ఊహ- భావము ననుసరించి పదములు - పాదములు తెగవేసి నట్లుండును. తూచి - కొలతతో కత్తిరించి నట్లుండును.

చతుర్వింశతి తత్త్వంబులు వివరించెద —

అవధరింపుము భూతంబు లయిదుఁ దద్గు
ణములుఁ బది, యింద్రియముల్లు మనంబు బుద్ధి
యును మహేశ ! యహంకారమును బ్రకృతియు
నాఁగఁ దత్త్వంబు లిరువదినాల్గు పొలుచు (అను. శా. 4-178)

పద్యమే దానంతట నదొక చెక్కిన శిల్పము. పొల్లుమాటలు మందునకేనియు నుండవు. ఏదో మంత్రమువలె మనస్సునుపట్టి వదలిపోదు. కాని యది యందఱ మనస్సులను బట్టదు. లౌకిక మనస్సులు మాధుర్యాదుల నాకాంక్షించును గావున

*1 గోవగ్ని మయ మమృతమయ
మో వసుధాధీశ ! వినుము హోమ విధాన
శ్రీవాహిని నిచ్చెన త్రిద, శావాసంబునకుఁ బూజ్య మమరులకైనన్
(అను. శా. 2-277)

మూలమున 'గావోవహ్నిసమాభువి' - అన్నమాటను దెచ్చి ప్రాస స్థానమున 'అగ్ని' ని వేయుటచేత విధాన-దగ్గర ద్వితీయపాదము త్రుంచి తృతీయమును

*1 మూలమున 9 శ్లోకముల ప్రాణ మీ పద్యముగా నవతరించినది. అందలి 'వహ్నిసమా' 'స్వర్గస్యసోపానం' 'స్వర్గేపిపూజితాః' (51 - 26 - 34) మాటలతో పై పద్యము వచ్చెను.

'శ్రీ' తో ప్రారంభించుట - గోవగ్నిమయము, అమృతమయము - ఇటు వాక్యములను దెగవేయుట వీనిచే రచనశిల్ప మగుచున్నది. అమృతమయ - శబ్ద విన్యాసమున మృదంగధ్వనులు విన్పించుచున్నవి. ఈ యాలంకారిక రచనాశిల్పమును మించి యీ పద్యము ప్రసన్నగంభీరమై ఋషివాక్కువలె దివ్యమై మంత్రమువలె పారమేశ్వరీయకమై కన్పించుచున్నది. ఇది తెనుగునకు కవిబ్రహ్మచే కూర్చిన ఘనత. ఈ నిబిడ దివ్యశైలియే మూలకారునిదని శ్రీ అరవింద విమర్శ.

ఇట్లు వ్యాస శబ్దార్థ తత్త్వముల నన్నిటిని యనువదించి రసదశ నుండి ఋతదశకు పయనించిన మహాత్ము డాయన. ఋతశిల్ప - రసశిల్ప సమన్వయమే ప్రాచీన నవీన పరాశరసూనుల మార్గములు. రసచలనమున కాధారము, స్థిర ఋతశిల్పము. ఇది హరుడు. అది హరి. ఈ హరిహర సమన్వయ రూపమే తిక్కన భారతము.

నన్నయ గారెంత నాదబ్రహ్మోపాసకులో (ఈయన గేయమైన సామవేదము. వాల్మీకి ఫణితి మాధుర్యమును తంత్రీలయ సమన్వితమే. ఇది తెలియును గావున ప్రాచేతప స్తుతి చేసినాడు మహాకవి) *1 తిక్కన గారంత శబ్ద బ్రహ్మోపాసకులు. (ఈయన పాఠ్యమైన ఋగ్వేదతుల్యుడు. ఇందుచే గేయమాధుర్యమందు లేదు) ఈ సంగతి పుష్కలముగా నాకవి మహర్షికి తెలియును. కావుననే శాంతిపర్వమున—

"అరయంగా శబ్దంబును
బరంబు నన రెండు సూవె బ్రహ్మములు గుణో
త్తర ! శబ్ద బ్రహ్మభజన
పరుఁడు పరబ్రహ్మ మహిత పదముం బొందున్"

(శాంతి - 5-332)

---

*1 ప్రత్యేకించి శాంత్యనుశాసనికము లందలి ధర్మాదులను గూర్చి వ్రాసిన ఘట్టము లందలి పద్యములు చూచినచో నా మహాకవి శబ్దమందలి స్వచ్ఛత పవిత్రత కలిసి - శ్రుతిశబ్దతత్త్వము తెలియును. వేదాంతఘట్టములు హార సనత్కుమార - నారదసనత్కుమార ఘట్టములు అనుశాసనిక మందలివి చూడవచ్చు. అచట నాలంకారికములైన మాధుర్యాది గుణములు పెట్టినచో నా తత్త్వము ధ్వస్తమై పోవును.'

ఇట్లు వ్రాసెను.

ఈ భారత భారతీ సమర్చనాయజ్ఞమున నన్నును నిమంత్రితుని జేసిన ఆంధ్రప్రదేశ సాహిత్యఏకాడమీకి సర్వదా కృతజ్ఞతలు.

డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు



# విషయసూచిక

—o—

## ఆనుశాసనికపర్వము

### ప్రథమాశ్వాసము

విషయసూచిక

## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## విషయసూచిక



## చతుర్థాశ్వాసము

విషయసూచిక



పంచమాశ్వాసము

# విషయసూచిక

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము - ప్రథమాశ్వాసము

○—○—○—○

శ్రీమత్కటాక్షరోచి
స్తోమసముల్లాసవిహితసుస్థిరలక్ష్మీ
భూమానందితభక్త
వ్యామోహవిదూరయుక్త హరిహరనాథా.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దివ్యజ్ఞానదేదీప్యమానుండైన దేవవ్రతుండు వివరింప వివిధంబులగు ధర్మంబు లాకర్ణించి యజాతశత్రుం డతనికి సభక్తికప్రణామం బాచరించి వినయవిశేష విభూషితుండై. 2

సీ. అనఘ నాదగుచిత్తమునకు శమంబు గా
వించుటకై నీవు వివిధ విశద
భంగులఁ బరమ కృపానిరతుండవై
సకలధర్మోపదేశములుఁ జేసి
తిమ్మెయిఁ జెప్పఁగా నించుకయేనియు
శమము లేకున్నది చలముకొని య
నేకబంధుల వధియించితి నది యొక్క
తలయు నీ కలిగిన దారుణత్వ

ఆ. మొక్కతలయు నైన యుగ్రకర్మంబులు
చిత్తవృత్తిఁ దగిలి యుత్తలంబుఁ
జేయ శాంతి యెట్లు సిద్ధించు మునిమాన
నీయ యింక నేమిసేయువాఁడ.

వ. దుర్యోధనుం డతిలోభంబున నాతోఁ బంచి కుడువ నొడంబడండ యేనును సాగ్రహంబున నతనికిరాజ్యం బిచ్చి తొలంగి నిలువను మాయిద్దఱకతంబున నింత పుట్టెం బశ్చాత్తాపం బెప్పాటనుం ద్రోపు వడ దయ్యెడు. 4

—:గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదము :—

చ. అనవుడు భీష్ముఁ డిట్టులను నాతనితో నకటా వధింపఁగా
మనుజుఁడు గర్తగాఁడు వినుమా యితిహాస మొకండు సెప్పెదన్
మనుజవరేణ్య గౌతమి యనంగ శమాన్విత యొక్కభూసురాం
గన యురగంబుచే సుతుఁడు గాలవశత్వముఁ బొంది యుండఁగన్. 5

చ. వగచుచుఁ జూడ నయ్యురగవల్లభు రజ్జునఁ గట్టి తెచ్చి య
మ్మగువకుఁ జూపి దీనిఁ దల ద్రుంచఁగ మోఁదెదఁ గోల నొండె రెం
డుగ నెఱగత్తి వ్రేసెదఁ గడుం జెడు గీఁపొడపాఁపపుర్వు నే
మిగతి వధింతు నంచు నొక మేటికిరాతుఁడు రోషదీప్తుఁడై 6

క. ఉన్నఁ గని యప్పడఁతి యో
యన్న విడువు భుజగనాథు నవుడు నతఁడీ
పిన్నాతని ప్రాణంబులు
గొన్నది యిది దీనియసుఱు గొనియెద ననియెన్

వ. అనిన నక్కోమలి యక్కిరాతుం జూచి. 8

క. విధివశమున వచ్చినకీ
డధములు గొనియాడి వెడగులై విపులభవాం
బుధి మునుఁగుదురు మునుంగరు
సధర్ములగు నుత్తములు ప్రశాంతిం జులుకనై. 9

వ. అదియునుంగాక. 10

క. ఈపాముఁ జంప బ్రదుకునె
నాపుత్రుఁడు విడువు మర్జునక నావుడు వాఁ

డీ పేదమాట లెల్లను
గోపవివశుఁడై న నాకుఁ గొలుపవు ముగ్ధా. 11

ఉ. కావున నెట్లుఁ జంపుదున కాని భుజంగముఁ బోవ నీను జూ
నావుడు నింతి యర్జునకనామము నీ కవదాతభంగికిం
గావలదే మహీసురులు గా దనుచొప్పునఁ దత్సహాయులుం
బోవరు గాదె యేల నినుబోఁటికిఁ గ్రూరత నాదుసన్నిధిన్ 12

సీ. హింసకు నొడఁబడ నే నెట్లు ననవుడు
జనబాధకములైన జంతువులను
జంపినఁ బాపంబు సమకూర దని పల్కె
బోయ పట్టినరిపుఁ బొరిగొనంగ
వల దని చెప్పె నవ్వనిత వాఁ డహిఁ దెగఁ
జూచి జనంబులఁ గాచు టుఱదె
వృతుఁ జంపఁడె దేవవిభుఁడు యజ్ఞ ధ్వంస
నము సేయఁడే పాలనయనుఁ డట్ల

తే. కావె ధర్మవు హింసలు నీవు దీని
కియ్యకొను మని తఱిమె న ట్లెంత దఱిమి
నను దయావతియైన యన్నాతి పాప
మునకుఁ జొరదయ్యె బోయ కిట్లనియెఁ బాము. 13

. ఏ నేమి తప్పు సేసితిఁ
గానవు నెఱి నీవు లెస్సగా మృత్యుపరా
ధీనత బాలునిఁ గఱచితిఁ
గాని వినుము లేవు రోషకామాదు లెదన్. 14

వ. అనుటయు నతండు. 15

క. విను మృత్యువునకుఁ దగుసా
ధనమ వగుటఁ జేసి నిన్ను దండింపంగాఁ
జను ననవుడుఁ గుమ్మరికో
లను సారెం బోలితిం దలఁచి చూడు మెడన్. 16

వ. ఈ క్రియ నావశం బగునే యని పల్కినం బామున కర్జునకుం డిట్లనియె. 17

తే. ఏయువాఁ డుండ న మ్మేమిసేయు ననక
యోపి తత్ఖండనముసేఁత పాప మండ్రె
యెవ్వరేఁ బంపఁ గఱతు గాకేమి క్రూరు
నిన్ను గీటడఁగించిన నింద రాదు. 18

తే. అదియుఁ గాక విశేషించి యరయ బుద్ధి
గలుగునట్టి సాధనములు గారె మీరు
మృత్యువున కట్లుగావున మెలఁగ మిడుక
నీక పొరిగొనవలయు మి మ్మెల్లభంగి. 19

వ. అనిన విని బోయకు భుజగం బిట్లనియె. 20

తే. బుద్ధి గల్గు సాధనములపో హవిస్సు
లరసి వేల్తురు ఋత్విజు లాఫలంబు
గాంచు నధ్వరకర్తయ కాక వారి
కేమి పని యనఁగా మృత్యు వేఁగుదెంచె. 21

క. చనుదెంచి పామునకు ని
ట్లను నిను నేఁ గోరి పనిచినట్టుల నన్నుం
బనిచెం గాలుం డీచా
వున కీవును నేను హేతువులుగా మనఘా. 22

క. ఇనశశిపావక భూమి గ
గనజలపవనాది వస్తు గతులెల్లను గా
లునియఱచేతి వనినఁ ద
క్కినపని సెప్పంగ నేటికిని భుజగేంద్రా. 23

క. విను మిట్లగు చేర్పడ నెఱిఁ
గిన నాపై నిడుదు వెట్లు కిల్బిషముం గా
లుని చెయిది నన్ను దూఱిన
నిను దూఱుట యుఱదె నాదునిర్మాణమునన్. 24

ఆ. అనిన భుజగ మిట్టులను నీవలన నేను
గుణము సెప్ప దోషగణన సేయ
నన్నుఁ బనిచె నంటి నామీఁదిదోషంబుఁ
బాపికొనుట నాకుఁ బాడిగాదె. 25

క. విను మటు కాలుని దెస నై
నను దోషము కలిమి లేమి నా కాడంగాఁ
బని యేమి దోషగతిచిం
తనభాషణములకు నేను దగుదునె యనఘా. 26

వ. అని పలికి పాము బోయమొగంబు సూచి. 27

క. వింటే మృత్యువుమాటలు
గంటే నామీఁదఁ దప్పు గలిగించెద వి
ట్లింటం గట్టం దగునే
యంటకు నగి బోయ యిట్లులనియె నరేంద్రా. 28

క. నీవును మృత్యువుఁ బాపస
మాదేశితమతుల రౌఱగ నాడినయంతం
బోవునె మీపై దోషము
లే వెఱతునె యిట్టు లనినయింతన మీకున్. 29

వ. అనిన మృత్యువునుం బామును. 30

క. ఘనుఁడగు కాలునివశమునఁ
జనియెడు మా కరయ దోషసంగతి గలదే
యనునెడఁ గాలుం డచటికిఁ
జనుదెంచెం బ్రీతి ధర్మసంశయ ముడుపన్. 31

వ. చనుదెంచి యర్జునకు నాలోకించి. 32

క. పామును మృత్యువు నేనును
గా మీబాలకుని మృతికిఁ గారణ మీతం

దేమేఁ గర్మముఁ జేసెం
దా మృతిఁ బొందించె నదియ తలకొని యితనిన్. 33

క. విను కర్మం బొనరించును
జననము మరణంబు నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించు దనచే
సినదానం బడకపోవ శివునకు వశమే. 34

వ. అని చెప్పి. 35

క. కావున నిందఱు నుడుగుం
డీవాదం బనుడు బోయకిట్లను ధరణీ
దేవాంగన దనయెఱుకయు
దేవాలాపములు నొక్కతెరువై యున్నన్. 36

ఆ. ఇట్టివనటఁ బొందునట్టి పాపముసేసి
వనిత లిట్లు చగుదు రనఘ యివ్వి
ధంబు మరణ మొందఁ దగుకిల్బిషంబున
బాలురిట్లు పోదు రేల కలఁగ. 37

వ. అని వెండియు. 38

క. సకలజనంబులుఁ గర్మము
నకు ననుగుణమైన తెరువునం బోదురు దీ
నికి రోష విషాదము లే
టికి విడువుము పాము సంఘటింపుము శమమున్. 39

క. అన విని తెలిసి విడిచె న
ర్జునకుఁడు భుజగము నపాస్తరోషం డగుచుం
జని రెలమిఁ బొంది కాలుం
డును మృత్యువుఁ గావు నను విడువు మీవడలున్. 40

తే. కారు దుర్యోధనుఁడు నీవుఁ గారణములు
బాంధవుల రణమరణ సంప్రాప్తి కనఘ

వారు దమతమ కర్మముల్ గారణములు
గాఁగ నిట్లయి రేల శోకంబు నీకు. 41

వ. గౌతమీలుబ్ధకభుజంగమృత్యుకాల సంవాదం బను నియ్యితిహాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టికొలిపి యాపుట్టిన కలంకం దొలంగ జడిసి శమంబున సుఖివి గమ్మనినం గౌంతేయాగ్రజుండు సంతసిల్లి శాంతనవునితో నిట్లనియె. 42

—; అగ్ని దేవుఁడు సుదర్శన యను కన్యకను వివాహంబు సేసికొనుట; —

చ. అనఘ గృహస్థధర్మమునయందుఁ జరించి నరుండు మృత్యు సం
జనితభయంబు వాపికొనఁ జాలునొ చాలదొ యన్న నాసరి
త్తనయుఁడు దానికిం దగు విధంబు దిరం బగు నేనిఁ జాలు న
య్యను వొడగూడునట్టి యితిహాసము విన్ము నరేంద్ర చెప్పెదన్. 43

మ. మనువంశంబునఁ బుట్టి సర్వజనతామందారమై నేల యె
ల్లను బాలించి జగత్త్రియాప్రణుతలీలం బొల్చె దుర్యోధనుం
డను రా జవ్విభునొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్
వనితారూపము దాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్య హృద్యంబుగన్. 44

క. ఆరమణికి నతనికిఁ గ
న్యారత్నం బుద్భవించె నమరపురంధ్రీ
శ్రీరామణీయకము ని
స్సారంబ గునట్లు గాఁగ జగతీనాథా. 45

క. విను దానికిఁ బేరు సుద
ర్శన యన్నరనాయకుండు సంప్రీతిమెయిం
బనిచి తన యగ్నిహోత్రం
బున పరిచర్యలకుఁ బనిచె బుజ్జవ మొప్పన్. 46

వ. పనిచిన నప్పొలంతి యప్పనులవెంట మెలంగుచుండె నట్టియెడ. 47

సీ. అర్చించునప్పు డయ్యంగనకెంగేలి
జిగిసొంపు చిత్తంబు దిగిచికొనఁగ

నరసి కన్గొనునప్పు డయ్యింతికనుఁగవ
పొలపంబు రాగంబు వొదలఁజేయ

నన్యులఁ బని బంచునప్పు డమ్ముద్దియ
పలుకులతీపు గోర్కులఁ గెరల్ప
నల్లన యాఁడెడునప్పు డక్కొమ్మవా
తెఱతావి ధైర్యంబు ద్రిప్పుకొలుప

తే. మరుఁడు దోడ్తోడఁ దేఁకువమాలి కదిసి
తూపుగముల గ్రొవ్వాఁడిమి సూప నంత
కంత కగ్గలమగువలవంతఁ దూలి
పోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర. 48

వ. ఇట్లు మదనాగ్ని నుదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో నేకాంతంబున
నిట్లనియె. 49

సీ. చిగురుటాకుల గాసిసేయు నీయడుగుల
చెలువంబు సూడ్కులఁ జేర్చికొనియె
మారేడుపండులగారాము సెఱచు నీ
యెలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చె
నునుఁదీవఁ జీరికిఁ గొనిన నీ మైఁదీవ
మురిపంబు డెందంబు మరులుకొలిపె
నెఱచందురుని సిగ్గువఱుపంగఁ జాలు నీ
నెమ్మోము దాలిమి వమ్ముసేసె

తే. నాతి నీకు నై పెక్కుబన్నములు వడితి
నంగజునిచేత వల్లభ వగుము నాకు
నావుడును సిగ్గుగదిరి యాననము వాంచి
యలఁతియెలుఁగున నిట్లను నాలతాంగి. 50

క. కులకన్యకలకు వేడుకఁ
దలపీడులఁ బరులతోడితగుమాటలకుం

దలకొనఁ దగునే గురుజన
ముల కా కిత్తె ఱఁగువారు పురుషార్థనిధీ. 51

వ. అనిన విని హుతవహుం డట్ల కాక యనియె నాసమయంబున. 52

ఉ. ఆనరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావలికిఁ బూజ లొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్రిఁ గృపయేర్పడ దానము గాఁగ నావుడున్. 53

వ. అవ్విభుండు. 54

తే. అన్యవర్ణుండు దీనిఁ డీయనకు నెట్లు
గూఁతు నీవచ్చు నని మదిఁ గుత్స వుట్టి
యీఁడ ప్రార్థన మఫల మై యేఁగి యజ్ఞ
సమయమున నగ్ని దనమూర్తి సంహరించె. 55

క కని యజ్ఞనపతి ఋత్విజు
లును దానును వెఱఁగుపడి విలోపము వాటి
ల్లెనొకో కర్మగతుల నని
మనమున నూహించి భవ్యమంత్రముఖరులై. 56

వ. పావకునిం బ్రస్తుతించు చుండ నద్దేవుం డాభూదేవతలకు నల్లన తన తెఱం
గెఱింగించిన. 57

తే. వార లానృపుతోఁ జెప్ప గారవంబు
సంతసముఁ దలకొనఁగ నయ్యింతిఁ బెండ్లి
సేసె విప్రకుమారుఁడై చెన్ను మెఱసి
యగ్ని వరియించె నచ్చెరువంద జనులు. 58

వ. ఇట్లు సుదర్శనావివాహోత్సవం బనుభవించి విభావసుండు విభాప్రభాస
మానుండగుచు హుతంబులు పరిగ్రహింప దుర్యోధనుయాగంబును సుప్ర
యోగం బై చెల్లెఁ బదంపడి. 59

క. అనలునకు సుదర్శనకును
జనియించె నుదాత్తగుణవిశాలుఁడు సుద
ర్శననామధేయుఁ డానృపుఁ
డనూనధర్మమునఁ దాల్చె నవనీభరమున్. 60

వ. ఆసమయంబున. 61

ఆ. అతని కోఘవంతుఁ డనువాఁడు జనియించె
నుదితయశుఁడు వాని కోఘరథుఁడు
నోఘవతియు ననఁగ నుదయించి రయ్యోఘ
వతికి నావిభుండు వరుని నరసి. 62

వ. ఒరుల మెచ్చక. 63

క. ఆలేమ సుదర్శనునకు
నాలిం గా నిచ్చె నద్దహననందనుఁడున్
లోలతఁ గైకొని పరిణయ
కేలి నడపి విమలబుద్ధిఁ గృతనిశ్చయుఁడై. 64

వ. గృహస్థధర్మానుష్ఠానంబునన మృత్యువు జయింతు నని ప్రతిజ్ఞ సేసి యోఘవతియునుం దానును గురుక్షేత్రంబునకుం జని యందు రమణీయ ప్రదేశంబున విశాల మగుపర్ణశాల కావించుకొని యుండె నట్టియెడ నయ్యో లనాఁగతో నతం డిట్లనియె. 64

తే. అతిథిఁ బూజించు వేడ్క నా కగ్గలంబు
వెలఁది నీవును ననుకూలవృత్తిఁ దాల్చి
సొలయ కప్పని నడపఁగా వలయుఁ బూని
యే నిచట నున్నయప్పుడు లేనియపుడు. 66

క. అతిథిజనులు దమతమవాం
ఛితము లనుభవించునట్లు సేయం గనినం
గృతకృత్యతఁ బొందరె గృహ
పతియును గృహిణియును ధర్మభారమువలనన్. 67

క. అతిథి నినుఁ గోరెనేనియు
మతిఁ గింకిరిపడగ యోలమాసగొనక నీ
వతనికిఁ బ్రియంబు సల్పుము
సతికిం బతివనుపు సేయఁ జను నెల్లదియున్. 68

—: సుదర్శనునింటికి ధర్మదేవత యతిథియై వచ్చుట :—

క. అని యూఁది చెప్పి యొకనాఁ
డనఘు యతం డిధ్మములకు నటవీస్థలికిం
జనినయెడ నతిథి యొక్కఁడు
సనుదెంచిన నాసనాదిసంభావనలన్. 69

క. అతివినయంబున సమ్మా
నితుఁ జేయఁగ నాలతాంగి నెమ్మోమునఁ జూ
పతఁడు నిలిపి కామాతుర
మతి నైతిం బ్రియ మొనర్పు మానిని నాకున్. 70

వ. గృహస్థధర్మప్రకారంబు నీయెఱుంగని యదియే యని పలికిన నప్పరమ
పతివ్రత వేఱొండు దెఱంగుల నభ్యర్థనీయంబు లయినవస్తువు లుపన్యసిం
చిన నతం డవి యెవ్వియు నొల్ల ననుటయు. 71

క. సతి దనపతివచనంబులు
మతిఁ జొనుపుం దెంపు మాను మాన వెఱచు న
య్యతిథిపనుపు సేయక ప్రో
చుతలం పలవఱుచుఁ జేయఁ జూచుం దలరున్. 72

తే. ఇట్టు లురియాడుచిత్తంబు నెట్టకేని
నాథుచెప్పినధర్మంబునకుఁ జొరంగ
నూలుకొల్పి నిర్ణయమునఁ గీలుకొన్న
లజ్జవేఁగునఁబోలె వ్రాలంగ మోము. 73

క. తెఱవ యొడఁబాటు మాటం
బఱివోయినగొంకుతోడ బ్రాహ్మణుఁ గొని క

న్మఱుఁ గగునెడకు నరిగె న
త్తఱి వచ్చె సుదర్శనుండు ధరణీనాథా. 74

ఆ. వచ్చి పర్ణశాలవాకిట నిల్చి య
త్తన్విఁ బిల్చె నతిథి దాని నల్ల
నూర కుండు మనియె నువిదయు భూసుర
శాపభీతి నెలుఁగు సూపకుండె. 75

సీ. పేర్కొని పలుమాఱుఁ బిలిచి యోయనుట లే
కున్న నయ్యింటిలోఁ గన్ను వఱపి
వల్లభుఁ గానక వహ్నితనూజుండు
దలఁ కొంది ప్రేముడిపలుకు పలుక
నతని నుద్దేశించి యతిథి నా కాతిథ్య
మొనరించుచున్నది వనిత నీవు
గృహధర్మవిదుఁడవు కినియకు మయ్యమ
మ్మనుఁడు నప్పరమపుణ్యాత్మకుండు
తే. నీదుకతమున నేను సమ్మోదమగ్న
మానసుఁడ నైతి నతిథులు మహితపూజ
నములు గాంచినగృహములు విమలతరము
లండ్రు బుధు లింత యెఱుఁగుదు నట్ల నడతు 76

వ. అని పలికి వెండియు. 77

ఉ. నావచనంబు నట్టుల మనంబును దీనికి సాక్షు లుర్వియుం
దావకుఁడున్ జలంబును నభంబును వాయువుఁ జంద్రసూర్యులున్
నావుడు మ్రోసె నాకసమునన్ విశదంబుగ దివ్యవాణి సం
భావితుఁ డీతఁ డీవిభునిపల్కు నిజం బని కౌరవేశ్వరా. 78

ఆ. అప్పు డతిథి ప్రీతి నతనిసన్నిధి కేఁగు
దెంచి దుర్నిరీక్ష్యతేజ మడరఁ
దనదుమూర్తి యధికతరసమున్నతిఁ బొలు
పెసఁగ నిల్చి యతని కిట్టు లనియె: 79

సీ. ధర్మదేవత నేను దగ నీదుచిత్తంబు
నారయ వచ్చితి ననఘ నీవు
నిశ్చలవ్రతుఁడవు నీప్రతిజ్ఞకు హాని
గలిగినఁ దెగఁజూడఁ దలఁచి తిరుగు
వెనువెంట మృత్యువు విను జయించితి దానిఁ
గామరోషాదివికారసహిత
ముగ నంతరంగంబు మున్న గెల్చితి భవ
త్సతియుఁ బవిత్ర యస్ఖలిత చరిత

ఆ. యొడలితోడ నీకు నూర్ధ్వలోకమునకు
నరుగ వచ్చు నెప్పుడరుగుతలఁపు
దోఁచె నప్పు డిదియుఁ దోడిద యై ప్రీతి
నరుగుదెంచు ననియెఁ గురువరేణ్య. 80

వ. అని వెండియు. 81

చ. నరవర పొల్చు నోఘవతి నా నదియై జనపావనాకృతిం
బరమతపంబులోనిసగపాలను నియ్యమ యున్న సామున
న్వెరవునఁ దొంటిమై నిలిచి నీకుఁ దగం బరిచర్య సేయు ని
చ్చరితము మీకు నిర్మలయశంబు నొనర్చుట కే నొనర్చితిన్. 82

వ. అని చెప్పి ధర్ముండు ధవళహయసహస్రంబు పూనిన మాననీయరథంబు
నం జనియె నోఘవతి యద్దేవునిచెప్పినట్ల వర్తిల్లె సుదర్శనుండు బరమ
సంతోషభరితుండయ్యెఁ బాండవాగ్రజా నీమనంబున నెక్కొల్పు మి
క్కథయభిప్రాయంబు. 83

ఆ. అతిథిపూజఁ గడచినట్టిధర్మవు గృహ
స్థులకు నొండు లేమి దెలుపు చున్న
యది సమస్తకిల్బిషాపహ మీ యితి
హాస మిచ్చు నెల్ల యభిమతములు. 84

క. అనినఁ బితామహుతో న
జ్జనపతి బ్రాహ్మణ్య మవులజాతులు మూఁటన్
జనియించినవానికి దొర
కొనునొకొ యతివిమలకర్మ గుణ యోగమునన్. 85

వ. అని యడిగిన నతం డతని కిట్లనియె. 86

తే. బ్రాహ్మణత్వంబు గడు దుర్లభం బనేక
జన్మములఁ బొంది తిరుగంగ సంభవించి
నపుడు గనునది యున్నతమైనయప్ప
దంబు విను మెఱిఁగించెద దానితెఱఁగు.

—: ఇంద్రమతంగసంవాదం బనునితిహాసప్రకారము :—

వ. అది యింద్రమతంగసంవాదం బనునితిహాసం బాకర్ణించిన నెఱుంగనగుం గావున నక్కథ యుపన్యసించెద నొక్కవిప్రునికొడుకు మతంగుం డను వాఁడుయజ్ఞార్థంబై నపనికిం దండ్రిపనుపునం బోయి. 88

క. మదమునఁ బెలుచన యొకగా
డిదకొదమం గోల గొని యడిచె నడిచిన నా
వ్వాదవి తనతల్లిఁ జేరఁగ
నది సని నన్నితఁ డడిచె నని చెప్పుటయున్. 89

వ. ఆగార్దభి దనకొదమతో వీఁడు చండాలుండు ప్రచండస్వభావుండు గాకుండునే యనినం బూర్వజన్మకర్మవిశేషంబునం దిర్యగ్జాతిభాషావిదుం డగుట నవ్విప్రపుత్రుం డప్పల్కులు విని యిది దూషణభాషణంబు గాదు నిరూపణా లాపంబై యున్నది యట్లు గావున మాలతనంబు గలుగ నేర్పు నని నిశ్చయించి యగ్గాడిదకడకుం బోయి. 90

క. తనకుం జండాలత వ
చ్చినకారణ మడిగి దానిచేతం గంద
ద్ఘనిచెయిది మంగలికి నిజ
జననికిఁ బొం దగుట విషాదముతోడన్. 91

వ. తనపోయెడుపనికిం బోవక మరలి సదనంబునకుం జని జనకున కత్తెఱం
గెల్ల నెఱింగించి యతనితో శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించిన
వాఁడు చండాలుం డగుటకు సందియం బేమి గార్దభి శాపజాత గానోపు
నది యున్నరూప పలికె బ్రాహ్మణ్యంబు దపంబున సంపాదించెదం గాక
యని పల్కి వీడ్కొని వనంబునకుం బోయి 92

క. పరమతప మాచరింపఁగ
సురపతి వొడచూపి యడుగు సువ్రత నీకున్
వర మిచ్చెద ననిన ధరా
మరత్వ మి మ్మనియె నతఁడు మది ముద మొదపన్ 93

చ. అనవుడు బ్రాహ్మణత్వము మహత్త్వ మెఱుంగవ యన్యజాతి కం
దునె యది యొండు వేఁడు మది దోఁచిన మే లనియున్ బలారి వాఁ
డనితరసాధ్యమైనతప మస్ఖలితంబుగఁ జేయు చుండెదం
జనుము మహాత్మ నీవనిన సస్మితుఁడై యతఁ డేఁగె నేఁగినన్. 94

వ. మతంగుం డేకపాదంబున నూరేండ్లు తపంబు సేసిన నింద్రుండు గ్రు
మ్మఱ వచ్చి. 95

తే. ఏను వల దని చెప్పిన మాన వెట్లు
పరమదుర్లభపద మాసపడి కరంబు
మేలితప మాచరించె చండాలుఁ డిట్టి
దాన నశియించు నిది నీకుఁ దగదు విడువు. 96

వ. విను మిత్తెఱంగుతపంబునకుఁ బదిమడుంగులు సేసి చండాలుండు శూద్రుం
డగు నూఱుమడుంగు లనుష్ఠించి శూద్రుండు వైశ్యుండగు వేయిమడుంగు
లాచరించి వైశ్యుండు క్షత్త్రియుండగు నప్పుణ్యాచరణంబునకుఁ బదివేలు
మడుంగులు నిర్వర్తించి క్షత్త్రియుండు దుర్బ్రాహ్మణుం డగు నానియ
మంబునకు లక్షమడుంగులు సల్పి శమదమసత్యాహింసల నమాత్సర్యం
బున నార్యబ్రాహ్మణహృదయంబులు సదయంబులు గావించి దుర్బ్రాహ్మ
ణుండు సద్బ్రాహ్మణుం డగు నిట్లు బ్రాహ్మణ్యం బలఁతులం బడయ

వచ్చునే పడసియు నది సెడకుండ నడప శక్యం బగునే యనేకజన్మం
బుల నొకప్పుడు బ్రాహ్మణజన్మంబు నొందియుం గొందఱు ధనవాంఛా
విషయలౌల్యాదులం దదాచారంబుగ దిగ విడచి చెడుదు రిట్టిమహాపదంబు
గోరి నిన్ను నీవ యేల వినాశంబు నొందించుకొనియెద వీతపోనిష్ఠ సాలించి
తగునది యొక్కవరంబు వేఁడు మనియె ననిన వాఁ డూర కున్న నాఖం
డలుం డరిగె వెండియు. 97

క. అంగుష్ఠ మొకటి మోపి మ
తంగుఁడు నూఱేండ్లు సేసెఁ దపము నియతిమై
నంగముతో లస్థులతో
సంగతముగఁ దోఁప వెక్కసముగా నరముల్. 98

ఆ. ఇట్లు సేసి శక్తి యెల్లను గడచన్న
నతఁడు నేల వ్రాలె నతిరయమున
వచ్చి యమరఁ బట్టి వాసవుఁ డక్కట
నీకుఁ జెప్పనయ్యె నెమ్మి నేను. 99

వ క్షత్త్రియాదులచేతనుం బట్టువడని బ్రాహ్మణశార్దూలంబుతోడి మేలంబు
దక్కుము నీకు నొక్కవరం బిచ్చెదం గైకొను మని పల్కుటయు నతం
డొడంబడినం బరమాదరంబున. 100

ఆ. చండదేవుఁ డనఁ బ్రశస్తి వహించి సు
స్త్రీలు పూజనంబు సేయఁ గామ
రూపధారి వై నిరూపింప విహగభా
వంబు గల్గి ప్రమదవర్తి వగుమ. 101

క. అని వర మిచ్చి మహేంద్రుఁడు
సనియె ననిన విని యజాతశత్రుఁడు గాంగే
యునితో బ్రాహ్మణ్యము పెఱ
జనులనుఁ బొందంగ నిట్లశక్యం బేనిన్. 102

—: విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గలిగిన తెఱంగు :—

వ. విశ్వామిత్రుం డెట్లు వొందె నత్తెఱం గెఱింగింపవే యని యడిగిన నన్నర
దేవునకు దేవవ్రతుం డిట్లనియె 103

సీ. జాహ్నవీదేవికి జనకుఁడై వెలసిన
జహ్నునికులమున సంభవించె
గాధి నాఁ బ్రకటభూకాంతుఁ డాతనిపుత్త్రి
యగుసత్యవతి దన కాలిఁ గాఁగ
నిమ్మని యర్థించె నమ్మహీశ్వరు ఋచీ
కుం డనుముని భృగుకులవరేణ్యుఁ
డతని కీ నొల్ల కప్పతి దనకూఁతున
కుంకువగాఁ జెప్పె నొక్కకర్ణ

తే. మసితమై తెలుపారెడుహరుల వేయి
మానియై భార్గవుఁడు దేరఁ బూని వరుణుఁ
గానఁ జని యవ్విధముఘోటకముల వేఁడె
నాతఁ డిచ్చుట కొడఁబడి యతనితోడ. 104

కం. నీవలసినప్పు డట్టిహ
యావలి ప్రభవించు నెచటనైన ననవుడున్
దీవించి యరిగి యమ్ముని
దేవతటిని యుత్తరంపుఁదీరమునఁ దగన్. 105

వ. నియతుండై తలంచినతత్క్షణంబ గాధిచెప్పినచందంబగుగుఱ్ఱంబులు వేయు
నుం బుడమి పొలిచి నిలిచె దానం గన్యాకుబ్జంబున కనతిదూరం బగు
తత్ప్రదేశం బశ్వతీర్థం బనం బరఁగె నమ్మునికుమారుం డత్తురంగంబుల
నిచ్చిన నచ్చెరువును సంతోషంబును శాపభయంబును హృదయంబున
ముప్పిరిగొనం దన పుత్త్రికి నుంకువగా నియ్యకొని. 106

తే. గాధి యమ్మునిపుత్త్రు శీఘ్రమునఁ బెండ్లి
సేసె నిట్లు వరించి ఋచీకుఁ డధిక

సమ్మదమున గృహస్థధర్మమ్ము నడపు
చుండి సంతానకాంక్ష నయ్యువిదతోడ. 107

వ. నీకుం బుత్రోత్పత్తి గావింపం జాలుచరువు సంపాదించెద ననియెఁ దొల్లి దానితల్లి దనయల్లునిమహాభావం బెఱుఁగుటంజేసి యాసత్యవతితో నాకుం దనయుండు గలుగ దయ సేయునట్లుగాఁ బుణ్యకర్త యగునీభర్తం బ్రార్థింపు మనినయది గావున నమ్మాట యమ్మద్దియ యతనికింజెప్పిన నప్పరమ ధర్మపరుండు. 108

తే. రెండుచరువు లొనర్చి యొక్కండు బ్రాహ్మ
ణత్వ మత్యుజ్జ్వలముగ నొనర్చ నొకటి
రాజభావంబు నధికతీవ్రముగఁ జేయఁ
జాలునట్లుగ నిజతపశ్శక్తిఁ జేసె. 109

వ. ఇట్లు గావించి యారెంటిని సత్యవతికిం జూపి తత్ప్రభావంబు వేఱువేఱ యుపన్యసించి క్షాత్రం బయినచరువు మీతల్లి కిచ్చి బ్రాహ్మం బయిన దాని నీవు పుచ్చికొనుము ఋతుకాలంబున నీతల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును నాలింగనంబు సేసి భక్తితో మీమీ చరువు లుపయోగించునది యని నియోగించె వారియుపయోగంబుసమయంబున విధివశంబునం జేసి. 110

క. చరువులు నమ్ముని చెప్పిన
తరువులు పేద్వడియె సుతకుఁ దల్లికి నట్ల
య్యిరువురు నుపయోగింవఁగఁ
గరువులు దత్ప్రకారకలితము లయ్యెన్. 111

వ. దివ్యబోధ మహనీయుండు గావున. 112

ఆ. చ్యవననందనుండు సత్యవతీగర్భ
భంగి సూచి యకట బ్రాహ్మణుండు
గాఁడు తరుణి నీదుకడుపులోపలిబిడ్డ
క్రూరుఁడై నరాచకొడుకు గాని.

వ. అని పల్కి చరుతరువ్యత్యాసంబున నట్లగుట దేటపడం జెప్పిన నబ్బోటి
యత్యంతవిషాదవేదనాదూయమానమానసయై. 114

క. నీకుం బుట్టెడుకొడుకు వి
వేకనిధీ బ్రాహ్మణత్వవిరహితుఁ డైనన్
లోకము మెచ్చునె యట్టులు
గా కుండఁగఁ జేయు తపము గౌరవ మొప్పన్. 115

తే. నాకు నివ్వర మిమ్మని నమ్ర యగుడు
వీఁడు బ్రాహ్మణుఁడగుఁ గాక వేనికొడుకు
నందు రాజత్వసంపద యతిశయిల్లు
ననియెఁ గరుణార్ద్రచిత్తుఁడై య త్తపస్వి. 116

వ. అట్లమ్మని యావహించుటకతంబున సత్యవతీపుత్రపౌత్రులై నజమదగ్ని
పరశురాములు క్రమంబున బ్రహ్మక్షత్త్రతేజోవిరాజితులయిరి గాధి
భార్యకు జనియించి విశ్వామిత్రుండు 117

క. నరనాథుం డై యుండియు
జరుతరుగుణసంక్రమమున సద్బ్రాహ్మణతా
స్ఫురణంబు వడసెఁ దపమును
గర మధికం బతనియందుఁ గలిగెఁ గుమారా. 118

—: వీతహవ్యుం డనురాజునకు బ్రాహ్మణత్వంబు గలిగిన ప్రకారము :—

వ అనిన విని ధర్మజుండు వీతహవ్యుం డనురాజు బ్రాహ్మణత్వంబుఁ బడసె
నని విందు న త్తెఱం గెఱింగింపు మనవుడు నతనికి శంతననందనుం డి
ట్లనియె మనుసంభవుడైన శర్యాతియన్వయంబున హైహయుం డనునొక్క
జనపతి జనియించి వత్సదేశాధీశుం డయి పొలిచె నతనికి వీతహవ్యనామం
బునుం గలిగియుండుఁ దదీయభార్యలు పదుండ్రు వారలు వీరులుం బ్రబ
లులు నగు పుత్త్రుల నూర్వురఁ గాంచి రమ్మహారథులు విక్రమకుతూ
హలంబున. 119

సీ. హర్యశ్వుఁ గాశీశు నాజికిఁ బిలిపించి
యొక్కొయుమ్మడి లావు నుక్కు మెఱయఁ
బొదివి చంపిరి వాని పుత్త్రుండు పట్టంబు
గట్టె సుదేవుండు గ్రమ్మఱంగ
నురవడి నరిగి యద్ధరణీశు ననిఁ దెగఁ
జూచి రా హైహయసుతులు గడిమి
నాతనినందనుఁ డగుదివోదాసుండు
రాజైన నమ్మహీరమణుమీఁద

ఆ. నడచి వారు ఘనరణం బొనరించి సై
న్యంబుఁ ద్రుంచి రోఁడి యతఁడు వాఱి
ప్రకటసంయమిని భరద్వాజమునిఁ గని
యధికభక్తి నతని నాశ్రయించి. 120

క. తనకులము వీతహవ్యుని
తనయులచేఁ ద్రుంపఁబడుట దగ నెఱిఁగింపన్
విని యతఁ డోడకు నీకొక
తనయునిఁ గలిగింతు రిపువిదారణనిపుణున్. 121

వ. అని పుత్రకామేష్టి సేసినం బ్రభవించినపుత్రుం డప్పుడ పదుమూఁ డేండ్ల ప్రాయంబువాఁ డయ్యెఁ బ్రతర్దననామధేయుం డగునక్కుమారుం డమ్మహాత్మునియనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబ యధిగమించి. 122

చ. ముని కృప నావహింపఁగ సముజ్జ్వలతేజముఁ బొంది ప్రీతిమై
జనకుఁడు యౌవరాజ్యపదసంగతుఁ జేసినఁ బేర్చి యవ్విభుం
డనుమతి సేయ నెత్తి చని యాజిముఖంబున వీతహవ్యనం
దనతతి నెల్ల గీ టడఁచె దర్ప మెలర్పఁగ నశ్రమంబునన్. 123

క. తనయులఁ దెగటార్చి వడిం
దనమీఁదం గవిసినం బ్రతర్దను శౌర్యం

బున కలికి వీతహవ్యుం
డనయము వెసిఁ బాఱె భృగువునాశ్రమమునకున్. 124

ఆ. పాఱి భీతి దోఁపఁ బల్కె నమ్మని తన
దైనశిష్యసమితి లోన నునిచె
నతనిఁ గాశిరాజసుతుఁడును వెనువెంటఁ
దగిలి యచటి కరిగి తగువిధమున. 135

క. మునిపతికిని వినయము సే
సిన నిట రాకకుఁ గతంబు సెప్పు మనియె న
జ్జననంద్యుఁ డక్కుమారుం
డనఘా మధ్యస్థవృత్తివై వినవలయున్. 126

వ. అని పలికి తమకులంబు వీతహవ్యునికొడుకులచేత నశించినవిధంబును దాను వారల నందఱ ప్రమందించుటయును వీతహవ్యుం డాహవంబునం దనకు నోడి పాఱుటయును జెప్పి మునీంద్రా యారా జిట వచ్చె నాతనిం బొలియించుటకై వచ్చితిననిన నత్తపోధనసత్తముండు. 127

క. విను మిచ్చట నృపకులసం
జనితుఁడు లేఁ డింతయుం బ్రశస్తమహీదే
వనికాయమ కనుఁగొను మని
తనశిష్యప్రతతిఁ జూపె దయ చిగురొత్తన్. 128

వ. చూపినం జూచి. 129

ఆ. అతఁడు నగుచు భృగునియడుగుల కెఱఁగి మ
హాత్మ దీన నేఁ గృతార్థవృత్తి
నైతిఁ బగతు నిట్లు జాతికిం బెడఁబాపి
గాసి గాఁగఁ జేయఁ గంటిఁ గాన. 130

క. కలుగునె యమోఘ మగునీ
పలుకున కన్నృతత్వ మేను బనివినియెద న

న్నలఘుకృపఁ జూడు మని తగఁ
బలికిన ముని ప్రీతి నానృపతి వీడ్కొలిపెన్. 131

ఆ. వీతహవ్యుఁడును మహాతపస్సందీప్తుఁ
డై నయమ్మునీంద్రు నప్రతర్క్య
భంగి భాషణముల బ్రాహ్మణుఁడై గృత్స
మదసమాఖ్యుఁ గాంచె మహితసుతుని. 132

వ. తత్పుత్త్రపౌత్త్రక్రమంబున సుతేజసుండును వర్చసుండును విహవ్యుండును
వితత్యుండును సత్యుండును సంతుండును శ్రవసుండును దమసుండును
ప్రకాశుండును వాగింద్రుండును ప్రమతియును రురుండును సముద్రుండును
శునకుండును శౌనకుండును నన మహాద్విజులు జన్మించి రిట్లు విద్యా
మౌక్తికశ్రేణివంశం బగు మునివంశంబునకు మూలం బయి యవ్వీత
హవ్యుండు భవ్యకీర్తి వడసెఁ బాండవాగ్రజా యింక నెయ్యది యడిగెద
వడుగు మనుటయు నతండు దైవంబును బౌరుషంబును నను రెంటి
యందు నెయ్యది యధికంబు సెప్పు మనిన నప్పురుషవరుండు దొల్లి
యిట్లు వసిష్ఠుండు బ్రహ్మ నడిగిన మహాత్ముం డుపదేశించిన వాక్యంబుల
యర్థంబు లుపన్యసించెద నాకర్ణింపు మని యిట్లనియె. 133

—; భీష్ముండు ధర్మరాజునకు దైవపౌరుషంబుల తెఱం గెఱింగించుట :—

క. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజ మరయ దైవము రెండున్
సూత్రపడఁ గూడెనేనిం
బాత్రం బగుఁ గర్మకరుఁడు ఫలమున కెందున్. 134

క. విను పురుషుఁడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ఫల మొనరించున్
జనములు గార్యము నడపఁగ
ననుకూలత నిచ్చుఁ గాక యయ్యైఫలముల్ఁ

తే. పౌరుషమ్ము దైవంబుతోఁ బ్రాపు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర

విత్తు సహకారి గాకున్న రిత్త నేల
వంధ్య మగుఁ గాక తా ఫలవంత మగునె. 136

తే. మేలు రెండులోకంబుల మేల తెచ్చు
గీడు సేసినఁ దప్పదు కీడ యగుట
కాన పురుషవర్తనమున కానుకూల్య
శీల మగుదైవ మది ఫలసిద్ధిఁ జేయు. 137

క. అనలం బించుకయైనఁ బ
వనుచేతవెలుఁగొందుమాడ్కి వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున దైవము నానుకూల్యము గురుప్రవరా. 138

క నేయి పొలు పఱిన దీవియ
మాయుకరణిఁ గర్మశుద్ధి మలిఁగిన హీన
త్వాయత్తంబై తానును
మాయును దైవానుకూల్యమహిమ మహీశా. 139

తే. పరశురాముఁడు భృగుఁడును బలియు లోను
గాఁగ మహనీయపురుషులు గర్మసూక్ష్మ
భంగిఁ గలుషితదైవప్రభావితాత్మ
లైరి కర్మంబు దైవంబు నలఁతు లెట్లు. 140

క. విను పౌరుషమును దైవము
నని రెండును గార్యఫలము నందింపఁగ నె
ట్టన కారణములు గావున
జననాయక సదృశములు విచారింపంగన్. 141

వ. అనిన విని ధర్మతనయుండు సత్కర్మంబుల నయ్యేడుఫలంబులు విన
వలతు ననుటయు నక్కురుసత్తమునకు నక్కురుపితామహుం డిట్ల
నియె. 142

సీ. అధ్వపరిశ్రాంతుఁ డగువింతవానికి
నన్నంబు పెట్టినఫల మట్టి దిట్టి
దనఁ బెద్ద యగ్నిసమారాధనమునకుఁ
బౌరుషశ్రేష్ఠత భవ్యదాన
ములకుఁ దత్తద్వస్తువులమహామహిమలు
మౌనంబునకుఁ బరిజ్ఞానశక్తి
యతులతపంబున కధిక భోగము లహిం
సకు రూపబలచిద్రైశ్వర్యసిద్ధి

ఆ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాస
ములకు జిత్తశుద్ధి ఫలజలంబు
లాహరించి యునికి కాధిరాజ్యము పత్త్ర
భక్షతకు దివంబు ఫలము లధిప. 143

క. శ్రుతిపఠనమునకు నర్థ
ప్రతిబోధంబునకు వరుస ఫలములు సౌఖ్య
స్థితియును సుగతియు సత్య
వ్రతమునకు ఫలంబు ముక్తి వసుధాధీశా. 144

క. ద్రుమముల దళకుసుమఫలో
ద్గమములక్రియఁ గర్మముల నొదవుఁ దత్ఫలముల్
దమతమతఱిఁ గర్తకు భో
గ్యములై నియతిని శుభాశుభాకారములన్. 145

వ. అని చెప్పి. 146

చ. వినుము జరానుబంధమున వెంట్రుకతండముఁ బండ్లు పీనులుం
గనుఁగవయున్ జరం బొరయుఁ గాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణ గా
దనయముఁ బేర్చి ప్రాణముల నప్పక పో వనిరోగ మల్పబు
ద్ధి నరులు ద్రోవ లే రది మదిం జొర నీరు సుఖార్థులై బుధుల్. 147

క. పాపంబుఁ బుణ్యమును దృ
ష్టాపరులకు దుఃఖసౌఖ్యసంపాదు లగున్

భూపాల వితృష్ణులు ని
ర్లేపు లగుట వారిఁ బొంద లే వాఫలముల్. 148

వ. అని పల్కినం బాండునందను లందఱుం బ్రహ్మర్షోత్కర్షంబు నొందిరి గంగానందనుండు ధర్మనందను నుద్దేశించి యీయర్థజాతంబు మునిప్రణీతం బయి యధిగతం బైనది నీకు నుపదేశించితి నీ వింక నేమి విన వల తన వుడు నాభూవల్లభుండు నిజాశ్రయంబున కాస్పదం బయినపురుషునెడ భక్తజనంబు చరితం బెట్టిది గావలయు నని యడిగిన నతం డతని కిట్ల నియె. 149

—:భీష్ముఁడు ధర్మజున కాశ్రయం బెప్పుడు నపరిత్యాజ్యం బని చెప్పుట:—

క. విను కాశీశ్వరుదేశం
బున నొకలుబ్ధకుఁడు వేఁటవోయినచోటన్
ఘనతరవిషదిగ్ధశరం
బున నేసిన మృగముఁ దప్పి భూజముఁ దాఁకెన్. 150

క. పూవులఁ గాయలఁ బెరిగిన
యావృక్షము శుష్క మయ్యె నవ్విధమున ధా
త్రీవర తదీయకోటర
మావాసము గాఁగ నొకమహాశుక ముండున్. 151

క. అది తరువు విడిచి పోవక
హృదయంబున భక్తి పేర్మి నెండను గాలిన్
బెదర క ధృతిమై నయ్యెడఁ
గదలక యుండె ననుజీవిగౌరవ మెసఁగన్. 152

ఉ. దానియుదాత్తవృత్తము శతక్రతుఁ డాత్మ నెఱింగి వచ్చి బెం
దైనది యిమ్మహీజము మహాతరువుల్ ఫలవృద్ధి నొందెఁ యి
క్కానన ననేకముల్ గలుగఁగా నిటు లేటికి నిందు నిల్వ నో
మానితకీరమా యనియె మానుషభంగికరూప మొప్పఁగన్. 153

వ. అనిన విని యాశుకంబు. 154

చ. అనయముఁ బండు చుండునెడ నాశ్రయ మొప్పిన నిల్చియెండి పో
యినతఱిఁ బాసి పోక తగ వెట్లు కృతఘ్నత గాదె యివ్విధం
బనిమిషనాథ యన్న నతఁ డచ్చెరువంది పురాకృతోపసం
జనితవిశేష మీఖగము జానుగ నన్ను నెఱింగె దీనికిన్. 155

వ. మే లొనర్చెదం గాక. 156

క. అని తలఁచి నీదుపలుకులు
విని మెచ్చితి వరము గోరు విహగోత్తమ నీ
వనిన శుకంబు మహీజం
బునకుం బేరెలమి వేఁడె భూపవరేణ్యా. 157

ఆ. అమరవల్లభుండు నమృతసేచనమున
భూజము నకుఁ దొంటిపొల్పుకంటె
మిగుల నెలమి సేసె మేలియాశ్రితు లిట్ల
మనుతు రధిపుఁ గురుకుమారవర్య. 158

—:విభులకుం బాటింపవలయువారిని భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట:—

వ. అనిన నతం డెవ్వరిఁ బాటించుట విభులకు వలయు నని యడిన నాభూ
పతికి భీష్మం డిట్లనియె. 159

సీ. జననాథ విను తపస్స్వాధ్యాయముఖకర్మ
కరణత నుభయలోకముల వశగ
తములఁ జేయఁగఁ జాలుధాత్రీసురులు మన్న
నకుఁ బాత్రములు పతి నాతి కెట్లు
రాజునకును నట్లు బ్రాహ్మణుఁ డొడయుండు
బ్రాహ్మణుం డనుమాటపావనంబు
హర్షించి శుభముల నలిగి యాపదం నిం
ద్రునకైనఁ జేయు విప్రుండు నృపతి

ఆ. గొడుకుఁబోలె నరయ గురుఁబోలెఁ గొలువంగ
నగ్నిఁబోలె నిష్ఠ నర్చితుఁడుగఁ

జేయ వలయు విప్రుఁ జెప్పెద వేదసం
వాద మేకబుద్ధి నాదరింపు. 160

వ. వేదంబులు దమలోన గోష్ఠి సేయుచున్న సమయంబున. 161

సీ. బ్రాహ్మణజాతికిఁ బరిభవం బొనరింప
మున్ను చేసిన పుణ్యములు నశించు
జపహోమముఖకర్మసంచయంబున కధి
కతరంబు విప్రముఖమున నిడుట
భూసురార్చన మొకమాసంబు సల్పినఁ
బాపంబు లెల్లను బాసి పోవు
నగ్రవర్ణులఁ గాంచి యాదరింపక యుండు
కంటెను గీ డొండు గలుగ దరయ

తే. నని క్రమంబున ఋగ్వేదమును యజుస్సు
సామము నథర్వణమ్మును సారభూత
భవ్యసంభాషణము సేఁత దివ్యమునుల
వలన వింధుము కౌరవకులపవిత్ర. 162

—: భీష్ముండు ధర్మజునకుఁ బరమ మైనధర్మంబు చెప్పుట :—

సీ. అని చెప్పి భీష్ముఁ డమ్మనుజేంద్రునితోఁ బర
మశ్రేష్ఠమైనధర్మంబుఁ దెలియ
విను మని పల్కి యిట్లను మద్రనాథుండు
సత్యవతీపుత్రుచరణములకు
నెఱఁగి కేలు మొగిడ్చి యెద్దాని నెఱుఁగుట
యెఱుకల కెల్లను నెక్కు డని స
భక్తికసమ్మతిఁ బ్రార్థించి యడిగిన
నమ్మహాముని దయ నతనిఁ జూచి

ఆ. విష్ణు నెఱుఁగు టధికవిమలబోధము యజ్ఞ
మూర్తి యజ్ఞకర్తృమూర్తి యజ్ఞ

ట్లొప్పుమి తంద్రికై నం గని యుల్లము బెగ్గిల నీశునంఘ్రులం
గప్పంగ మౌళిభూషణముకాంతి ప్రణామముసేసెం జేసినన్. 420

ఆ. హరుండు కరుణం జూడ నాహిమవన్నగ
దాహ ముడిగి శోభితత్వ మొలసె
నార్య పరమవిస్మయముం బొంది యాసర్వ
భువనకర్తతోడ సవినయముగ. 421

సీ. నిటలంబుకను దెఱచుటకుం గారణ మేమి
సర్వేశ! యిది రహస్యంబు గాక
యున్నని( జెప్పవే యన్న నద్దేవుండు
కాంత! నీ కెఱింగింపం గానియట్టి
పని యెందుం గల్గునే వినుము లోకాత్మక
త్వము నాకుం గల్గుటవలనం జేసి
నన్నది వొందిన నన్నిలోకంబుల
నది వొందుం గాన నాయంబకములు

తే. నీవు మూయంగం దిమిరంబు నిఖిలలోక
చయముం గప్పిన భూతముల్ భయముం బొందె
నీకరంబులు ద్రోవక చీకటియును
బెఱచుటకు ఫాలనేత్రంబు దెఱవ వలసె. 422

వ. అనిన విని యంబిక తనకు నడుగవలయునట్టివి యడుగుటకు నది యవ
సరంబుగాం గనికొని యక్కపర్ది కి ట్లనియె. 423

క. నాలుగుముఖములు నీకు
న్ఫాలనయన! కలుగం గారణం బేమి మధు
శ్రీలాలిత్యాస్పదవా
క్యాలీకలనమున నాకు నానతి యీవే! 424

వ. అనిన విని యమ్మిహాదేవికి నదేవుం డిట్లను దైత్యులు సుందోపసుంద లన
నిద్దఱు గలరు వారలవార్య భుజవీర్యశౌర్యసంపన్నులు నస్త్రశస్త్రవిద్యా
లున్నై యుండుదురు వారలవినాశంబునకై మయుండు లోకంబులం గల

యొప్పులం దెల్ల నుత్తమసారంబులు దిలప్రమాణంబు లాహరించియొక్క
కామినిం గావించి తిలోత్తమ యను పేరిడి నాకడకుం దెచ్చిన నచ్చెలువ
నాకుం బ్రదక్షిణంబుగా వచ్చునెడ నే నిది తేవకార్యంబు సేయనోపుఁ బొ
మ్మను తలంపుతో నత్తరుణి తరిగిన దిక్కుదిక్కున కొక్కొక్క
మొగంబు దాల్చి దానిం బరీక్షించితి నాఁటం గోలెఁ జతుర్ముఖుండనై
యుండుదు. 425

చ. అన విని గౌరి నీకు భువనాధిప! కంఠమునందుఁ గప్పు గ
ల్గినకత మేమి నాకు నెఱిఁగింపుము నావుడు దేవదైత్యు లం
బునిధి సుధార్థమై తరువఁ బుట్టి విషంబు త్రిలోకభీకరం
బనితరసాధ్యమై యొదవె నత్తఱిఁ దాల్చితి దానిఁ గుత్తుకన్. 426

తే. అట్లు కంఠంబునందు మహావిషంబుఁ
దాల్ప నీలతగల్గిన దానఁజేసి
కమలజాదిసురులు నీలకంఠుఁ డనుచు
నన్నుఁ గొనియాడి రప్పుడు నలినవదన! 427

వ. అని చెప్పి శంకరుం డింక నేమి యడుగ వల తడుగు మనుటయుఁ
బార్వతి పినాకం బెల్లయాయుధంబులకంటె మెచ్చి పట్టుదు దీనికిం గతం
బెయ్యది యని యడిగిన నామృడుం డామృడానికి ట్లనియె. 428

సీ. ఆదియుగంబున నబల! కణ్వుం డను
సంయమి తపము నిష్ఠానిరూఢి
మెయిఁ జేయఁ బెరిఁగె వల్మీకంబు తనువు ము
నుంగ నర్పుట్ట వేణువును బుట్టె
విను లోకసామాన్యఘనత గాకుండ మ
హాద్భుతాయామంబు నధికమైన
పరిణాహమును గల్గె బ్రహ్మ యమ్మునికిఁ బ్ర
త్యక్షమై వర మిచ్చె నతనిమీఁదఁ

ఆ. బెరిఁగి యున్నవెదురు గర మర్థిఁ దాఁ బుచ్చి
కొని జగద్ధితంబు గోరి చేసె

నాకు విష్ణునకుఁ బినాకశార్ఙ్గము లగ్ర
ఖండమున నొలర్చె గాండివంబు. 429

వ. ఇవ్విధంబున విండ్లు మూఁడు గావించి లోకహితం బాచరించి యవ్విరించి యమ్మూఁడవవిల్లు దాఁ గైకొని తనలోకంబునకుం జనియె నిది పినాకంబు సంభావనీయంబైన తెఱం గని చెప్పిన. 430

క. విని గిరితనూజ పెఱవా
హనముల నొల్లక వృషంబు నఖిలేశ్వర! నె
మ్మనమునఁ గైకొని యెక్కుడు
వినఁగా నే వలతుఁ జెప్పవే కారణమున్. 431

వ అనిన నద్దేవుఁ డమ్మహాదేవి కి ట్లనియె. 432

సీ. హిమవచ్ఛృగంబునం దేను లోకహితార్థ
మైన మహాతప మాచరింప
గోవులు చుట్టుఁ దేఁకువ సెడి తిరిగి నన్
సంకటపెట్టినఁ బంకజాక్షి!
కోపించి చూడ నంతాపాకులత్వంబుఁ
బొందె గోకుల మరవిందభవుఁడు
నమరులుఁ జనుదెంచి ప్రార్థించి వృషముఁ గా
నిక యిచ్చి కరుణ జనింపఁ బలికి

తే. నాకు గోపతి యనియెడు నామ మిచ్చి
రపుడు గోబాధ మాన్చి రయ్యమలవృషము
వాహనముఁ గేతువును గా శివప్రచార
మాచరింతు నెల్లెడ నది యాది గాఁగ. 433

వ. అనుటయు నంబిక యప్పరమేశుతో నీవు పరమశుచులును రమణీయంబులు నగు నివాసంబుల వసియింపక యశుచియు గేశాస్థికపాలదుర్గంధదుర్ద ర్శంబు నైన శ్మశానంబున నునికిఁ గతం బేమి యనిన నతం డిట్లనియె. 434

— : శివుఁడు పార్వతికిఁ దనశ్మశానవాసతకుఁ గారణంబు చెప్పుట —

ఉ. క్రూరపుభూతముల్ జనుల ఘోరవిధంబుల ముట్టి యెప్పుడున్
మారణ మాచరింపఁగ సమస్తజనంబులు నాశమొందఁగా
వారిజసంభవుం డెఱిఁగి వచ్చి ననుం దగఁ గాంచి తత్ప్రతీ
కారము సేఁతకై వినయగౌరవ మొప్పఁగ వేఁడె వేఁడినన్. 4÷5

వ నిశ్చితంబుగా నొక్కెడ నుండి లోకంబులు రక్షింపవలయు నని తలంచి
నట్టియెడ 436

తే. మోక్షపరులు శుచిస్థానముగఁ బ్రశంస
సేయుదురు విజనత్వవిశేష మెఱిఁగి
కాన యింపై శ్మశానంబు మానసమున
నొలసెఁ గావున నయ్యెడ నునికి గలిగె. 437

చ. అచటన యుండి లోకముల నన్నిటి నాత్మఁదలంచి రక్ష సే
యుచు విహరింతు భూతచయ మొక్కటఁ గూడి చరింతుచున్కికిం
బ్రచురకుతూహలుండ నయి రాగముఁ బొందుదు నట్లు గాన నా
కచటు నివాస మయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే. 438

తే. అనిన భసితాంగరాగంబు నస్థిఫణధ
రాభరణములుఁ బరశుశూలాయుధములు
నై మహోగ్రత భీకర మైనరూప
మభవ! యేల కైకొంటి పే వనియె గిరిజ! 439

వ. అనుటయు నమ్మహేశ్వరుం డాపరమేశ్వరితోడ. 440

సీ లోకస్వరూపంబు లోలాక్షి! రెండువి
ధమ్ములు శీత ముష్ణమ్ము నాఁగఁ
జను నివి రెంటను సకలంబు గ్రథిత మై
యుండు సౌమ్యాగ్నేయ యోగకలిత
మఖిలజగంబు సౌమ్యము విష్ణుఁ డాగ్నేయ
మేను వహింతు మిద్ధ్యురుదెఱంగు

నెనయుటఁ గొని ధరియింతు నీవిశ్వంబుఁ
గావున నాగ్నేయభావరూఢ

తే. యైన యాకృతి లోకహితార్థముగ వ
హించినాఁడ నిం కెయ్యది యీవు నన్ను
నడిగె దడుగుము నావుఁడు నార్య సోముఁ
దలఁ బ్రియంబున నేటికిఁ దాల్చి తనియె. 441

చ. అనవుఁడు దక్షుయజ్ఞమున కల్గిననాఁడు సురాలి కేను బీ
డన మొనరించుచోట వికటంబుగ సోముని మేను ద్రొక్కఁగా
నను శరణంబు వేఁడిన మనంబున నక్కటికంబు పుట్టి చే
సిన దురితంబు సోము నిబు సేయక పో దని మౌళిఁ దాల్చితిన్. 442

చ. అన విని కొల్చియున్న మును లందఱు నీశు దయావిశేషము
న్మనముల మెచ్చి పొంది యభి నందనపూర్వము గాఁగ భక్తియున్
వినయము నుల్లసిల్లఁ బదివేల విధంబులఁ బ్రస్తుతించి ర
య్యనుపమధాము గౌరి సమయం బిది నా కని మోడ్పుఁగేలితోన్. 443

తే లోలలోచన దీప్తులు బాలచంద్ర
భూషణుని వదనంబునఁ బొలయ మునుల
మానసంబులు సంప్రీతి నూన సాంత్వ
నస్వరంబున ని ట్లను నలిననాభ! 444

క. వర్ణాశ్రమధర్మము లభి
వర్ణింపుము వేదనిరతవత్సలః యవి నా
కర్ణములతో నఖిలజన
కర్ణంబులఁ బొంది పుణ్యకర్తృత యొసఁగున్. 445

వ. అనియె నని యిట్లు గౌరి లోకహితార్థంబుగా వర్ణాశ్రమధర్మంబులు పరమే
శ్వరు నడుగుటయు నారదముని కృష్ణునకుం జెప్పినతెఱంగు భీష్ముండు
ధర్మజునకుఁ జెప్పుట యుపన్యసించిన నాకర్ణించి. 446

క. మునివర! నాదగుచిత్తం
బునఁ గౌతూహలము చాల మొలతెంచి తలి
ర్చున నెలరారెడు నేర్పడ
వినిపింపుము మీఁదికథ సవిస్తారముగన్. 447

వ అని యడుగుటయు. 448

మ. స్ఫుట తత్త్వోదయ సంభృతైక మధురా భూతైక రక్షాధురా
తటినీపింఛమనోజ్ఞమౌళిలలితా దాంతాత్మ సంకీలితా
త్రుటితాపత్వ సమున్నతాశ్రితజనా దూరాంజనానువ్రతో
త్కటశీలావనలోల దివ్యహృదయా ధర్మప్రసన్నోదయా! 449

క. దేహాభిమానసంభృత
మోహతమోనిరసనాభిముఖభూరివివే
కాహీన మహాతత్త్వస
మాహిత చిన్మాత్రరూప మధురిమ సుభగా! 450

మాలిని త్వరితవిహితగాథధ్యాయి సమ్మోదవాదా
స్ఫురదరి దృఢ శూలస్ఫూర్తి సంశస్తహస్తా
తరణిశశిమయత్వోదారతాచిత్రనేత్రా
పరమనియతినిష్ఠా భవ్యహృత్పద్మసద్మా! 451

గద్యము : ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నానుశాసనిక
పర్వంబునందుఁ జతుర్థాశ్వాసము

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము - పంచమాశ్వాసము

o—o—o—o

శ్రీకాశీత్యాదర సు
శ్లోకాలోకన విలాస సుస్థిరభవనా
శోకముదాద్యవధూతి
వ్యాకోశవివేకభవన హరిహరనాథా! 1

—: శివుఁడు పార్వతికి వర్ణాశ్రమాచారంబులఁ దెలియఁజేయుట :—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకుఁ
జెప్పి యిట్లనుఁ గౌరవశ్రేష్ఠ! పద్మ
నాభుతో నవ్విధంబున నారదుండు
పార్వతీదేవిప్రశ్న ముపన్యసించి. 3

వ. ఇట్లనియె నప్పర్వతరాజపుత్రి ప్రార్థించిన నప్పరమేశ్వరుండు పరమాదర
భరితుండై. 4

సీ. అజుఁడు మున్ను లోకహితార్థంబుగా బ్రాహ్మ
ణులను సృజించి రాజులను వైశ్యు
లను శూద్రులను గ్రమం బొనరంగఁ గల్పించె
నాజాతులకు నోలి నతనిముఖము
బాహులు నూరులుఁ బదములు సంభవ
స్థానంబు లగుటయుఁ దారతమ్య

భాగిను లగునని పార్కృతి కాతండు
　　　తత్తదాచరణీయధర్మములును

ఆ. వినుము విస్తరించె విప్రులు లోకధా
రకులు వారియెటఁ బరాభవంబు
సేఁత యెల్ల చేటుఁ జేయు సమ్మానదా
నములు సకలశోభనము నొనర్చు. 5

చ. ప్రియ మతి యజ్ఞునేనియు దరిద్రునినేనియు విప్రుఁ గందఁ జేఁ
త యుభయలోకసౌఖ్యములు దవ్వగఁ జేయుఁ దదీయ మైననిం
దయు నను బెట్టుదిట్టుట యధర్మత నాతనిసొమ్ము పుచ్చికొం
టయును మదర్థముం గొనుట డాఁపక చెప్పితి నిక్క మింతయున్. 6

వ. అని పలికి యి ట్లనియె. 7

సీ. అధ్యయనంబును యజనంబు దానంబు
　　　నధ్యాపనంబును యాజనముఁ బ్ర
తిగ్రహంబును బ్రశాంతియుఁ దపస్సత్యశౌ
　　　చంబులు విప్రధర్మంబు లాప
దలఁ దక్క నతనికి వలవదు వాణిజ్య
　　　మగ్ని కార్యంబు శూద్రాన్నవర్జ
నము నిజదారసంగమనియమంబును
　　　నిర్బ్రొద్దు గుడుపును హింసలేమి

ఆ. యును నివాసశుద్ధియును నతిథిప్రియ
త్వంబు బ్రాహ్మణులకు వలయుఁ దపము
పేర్మి సాధనముగ ధర్మమూలముగ వా
రల సృజించెఁ గాదె నలినభవుఁడు. 8

ఆ. క్షత్రియులకు విప్రసంరక్ష ముఖ్యధ
ర్మంబు సరణి వారిరక్షణమునఁ

గాని బ్రదుకఁ దమ్మహానుభావుల పాల
నంబు సేయ శోభనంబు నొందు. 9

క. రమణీ! యధ్యయనము యజ
నము దానము సాధుపోషణము దుర్జనులన్
దమియించుటయు సముత్సా
హము కల్మియు ధృతియు నృపుల కగుధర్మంబుల్. 10

తే. శస్త్రజీవికయును నరిషష్ఠభాగ
మాహరించుటయును భృత్యునరయుటయును
బ్రజ వివాదంబు వినుచోటఁ బక్షపాతి
గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి. 11

సీ. వణిజులు లోకప్రవర్తనంబుల కెల్ల
నుపకారకులు గృషియును ననేక
భంగి బేహారంబుఁ బసులఁ బెంచుటయుఁ గృ
త్యంబులు వారల కధ్యయనము
యజనంబు దానంబు నర్థకర్మంబులు
త్రైవర్ణికద్విజత్వమ్ముకతన
నాతిథ్యములు విధేయములు వారికిఁ దిల
గంధరసముల విక్రయము దగదు

తే మూఁడుజాతుల శుశ్రూష మూలకార్య
గతి తదుపయుక్తి శూద్రులకలిమి నడచు
వారు శుశ్రూషకులు విప్రవందనంబు
వినయ మక్రూరు లగుట తద్విహితకృతులు. 12

క. తనతనవర్ణంబునకుఁ ద
గినయాచారంబు నడపి కిల్బిషరహితుం
డనఁ బరఁగు నెల్లవారికి
విను ముమ్మను జన్మసౌఖ్యవిభవము గల్గున్. 13

వ ఇవి వర్ణధర్మప్రకారంబు లింక నాశ్రమధర్మంబులు వివరించెద నాకర్ణింపు మని పలికి పార్వతికిఁ బరమేశ్వరుం డిట్లనియె. 14

సీ బ్రహ్మచర్యవ్రతపరమనిష్ఠయు గురు
నాశ్రయించుటయు నధ్యయనకృతియు
నగ్నికార్యంబు గుర్వర్థసంచారంబు
భైక్షచర్యయుఁ గమలాక్షి బ్రహ్మ
చారిధర్మంబు లాశ్రమముల కెల్ల నా
శ్రయణీయమై గృహస్థత్వ మొప్పు
శౌచంబు నిజదారసంతుష్టియును బంచ
యజ్ఞంబులును నిగమాభిరతియు

తే. దానహోమదయాతిథి మాననములు
వలయు గృహమేధికిని వనవాసవన్య
భోజన బ్రహ్మచర్యజటాజినప్ర
ధారణములు వానప్రస్థ ధర్మకోటి. 15

చ. కినియమి నంగవర్జన మకించనభావము తాల్మి విప్రవా
సనము ప్రశాంతి యార్జవము శౌచము సద్వ్రతనిష్ఠ భైక్షభో
జన మిల నిద్రసేఁత కృప సంతతత్వ విచింతనంబు మా
నిర్మమతిధర్మముల్ శ్రుతి గణించినభంగిన యేను జెప్పితిన్. 16

వ అని యిట్లాశ్రమధర్మంబులు సెప్పిన విని యప్పరమేశ్వరుతోఁ బార్వతి తపంబు తపం బనుచు మునిజనంబు లాచరింతురు దానితెఱం గెఱింగింపవే యనిన నద్దేవుం డిట్లనియె. 17

—: శివుండు పార్వతికిఁ దపస్స్వరూపంబు చెప్పుట :—

సీ భోగార్థులై తపంబునకు జొత్తురు తపం
బనఁగ వానప్రస్థు లాచరించు
ధర్మంబు లింద్రియకర్మనిగ్రముతో
నుభయకాలములను యోగసేవ

ఫలకాంక్షఁ జేఁత తపస్స్వరూపంబుగా
నడపి కాలంబైన నాకమునకు
నరిగి తద్భోగంబు లనుభవింతురు పుణ్య
మవసిత మగుడు మర్త్యత్వ మొంద

తే. వత్తు రధికనియతి నుపవాసములను
జపముఁ బంచాగ్ని మధ్యవాసంబు గలుగు
తపముఁగల దప్సరః ప్రియత్వం బొనర్చుఁ
గర్త కది వాఁడుఁ దుది వచ్చుఁ గాని మరలి. 18

వ. అని చెప్పి మఱియు. 19

ఉ. ధారయుతంబుగా నడచుతాపసముఖ్యు లహింసపేర్మికై
కారుణికత్వ మగ్గలము గల్గి తలంతురు సర్వజీవులుం
దారును నొక్కరూపుగఁ బదంపడి పుత్త్రకళత్రయుక్తిఁ బెం
పారుదు రూర్ధ్వలోకమున నజ్జనమున్ మఱి వచ్చుఁ గ్రమ్మఱన్. 20

వ. అనిన భవాని వనవాసవ్రతవిశేషంబులుం దదీయఫలప్రకారంబులు నేర్పడ
నాన తీయవే యనుటయు నభవుండు భరితాదరుండై. 21

సీ. ఉపవాసములు మౌన మూర్వీశయత్వ మా
సన మూర్ధ్వబాహుకస్థాపనంబు
నియమితాహారత్వనిష్ఠక్రమంబున
శశిమరుద్వృక్షవాసముల నిలుపు
గంధర్వదేవనాగస్థానముల నునికి
యును బహుసౌఖ్యసంయుతము గాఁగ
నానాసహస్రాబ్దమాననీయంబుగఁ
గావించు సంక్షేపగణనఁ గొన్ని

తే. మహితనియతులు సెప్పితి మఱియు నేమి
వ్రతము సలిపినఁ బాపనిర్హరణ మగుటఁ

ణ్యాగతికల్మి దప్ప దరణ్యవాసి
కడుగు మించను వలసినయట్టి వనుడు. 22

క. యాయావరుల నమరవం
ద్యా! యేర్పడఁ జెప్పుమనియె నంబిక దేవుం
డాయమ కిట్లనుఁ దీర్థప
రాయణు లుపవాసవిధి సమధికులు వారల్. 23

వ. అది యెట్లంటేని 24

క. నానాతీర్థసతతస
స్నానంబులఁ బల్లలైనజడలును భిక్షా
నూనోపవాసకృశమగు
మేనులునై వారితపము మిక్కిలిమెఱయున్. 25

క. మాసోపవాసవిధులం
జేసి తృణజధాన్యభుక్తి సెల్లింతురు వా
రే సురలకు లేనిసుఖా
వాసమ్ములఁ జరితములను వఱలుదురు తుదన్. 26

వ. అనిన విని యవ్వనితారత్నంబు వైఖానసులవిధంబు వివరింపు మనుటయు
నవ్విరూపాక్షుండు. 27

సీ. వైఖానసులు ఘరవ్రతు లెట్టు లంటేని
శిలఁ దృణధాన్యముల్ చిదుకనడచి
కొందఱు పండులఁ గొటికి కొందఱుగన్న
గుఱుముల గుప్పల తెఱఁగు దోఁప
నప్పటి కప్పటి కానసంబున వైచి
కొసకొందఱాకు లెండినవి యేఱి
కొని కొంద ఱంబువుల్ గొని కొంద ఱనిలంబు
గొంద ఱాహారంబు గొందరట్లు

తే గాక యాహారపరులును గలరు వార
లింద్రునకుఁ బూజనీయు లై యెక్కుడైన
పదవిఁ జిరకాల బహుసౌఖ్యభాగు లగుదు
రని మహేశ్వరుఁ డుమకు నిట్లనియె మఱియు. 28

వ. ఇవి యెల్లను వానప్రస్థనియమనిష్ఠాభేదంబులు తపంబు తపం బని మును లాచరింతురు దానితెఱం గెఱింగింపు మని నీవుతొల్తనడిగిన విధంబునం దొడంగి నాచెప్పినవిధంబు లిన్నియుం దపం బను శబ్దంబున కర్థంబు లై యుండునని చెప్పి యంగుష్ఠప్రమాణదేహులు మృగాజినవసనులు నిర్ద్వంద్వులు నై వాలఖిల్యు లను పేరం బ్రసిద్ధులగు మునులు దినకరదీప్తులతోడం గూడి వర్తించుచుండుదురు వారలతపోవైభవంబునంగాదె జగంబులు సుస్థిరంబులై యున్నయవి యొండుమెయి దుర్లభంబు లైనట్టివి తపంబున సులభంబులగుం దపంబు గడచి ధర్మంబుఁ గలదే యని పలికి యాదరాతిశయంబున శివుండు శైలేంద్రతనయతో ధర్మంబులు మఱియు నెఱింగించెద నవహితవై యాకర్ణింపు మని యిట్లనియె. 29

ఉ. అంబుజసూతి యేర్పడ గృహస్థసమర్థముగాఁ బ్రవృత్తిధ
ర్మంబు నొనర్చె నార్యజనమాన్యము దానితెఱంగు చాల సూ
క్ష్మం బతికాంక్ష లేక తగుకాలమునన్ సముచితవృత్తి ని
త్యంబును ధర్మముఖ్యముగ నర్థముఁ గామముఁ జల్పు టొప్పగున్ 30

చ. అతఁడు నివృత్తిధర్మము ప్రయత్నమునన్ వివరించె మోక్షనో
ద్యత మది తత్ప్రకారములు దాంతియు భూతచయంబుపై దయా
రతియును సత్యదృష్టియు విరాగత యింద్రియకోటికిన్ దృఢ
స్థితముగఁ జేసి యోగనిరతిం బరిశాంతి యొనర్చికొంటయున్ 31

32

వ. అని మఱియును

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి
యతిథివచ్చినఁ బ్రియమున నతనిదప్పి
వోవు నట్లుగ సముచితభోజనంబు
వెట్టు టెల్లపుణ్యములకుఁ బెద్ద తలఁప. 33

క. దీనికి నఖిలాశ్రమసువి
ధానంబులకును గృహస్థతయ నెల వగుటన్
దానిపదాఱవపాలిస
మానముగా గా దరయ నాశ్రమం బెయ్యదియున్. 34

క. అనవిని గృహస్థునకు నే
పని ముఖ్యం బనియె గిరిజ పశుపతి జననీ!
జనకారాధన మతనికి
ననుత్తమం బైన ధర్మ మని రూపించెన్. 35

వ అద్దేవుండు వెండియు. 36

క. పతిభక్తి ముఖ్యధర్మము
సతి కనవుడు దేవి నరుఁడు జననీజనకుల్
మృతులైనను నాతి విగత
పతిత్వమొందినను జేయుపను లెయ్యవియో. 37

వ. అనుటయు నభవుండు వారివర్తనంబు లెఱింగించెద వినుమని యిట్లనియె 38

క. దేవాతిథిపితృపూజలు
గావించుట భావశుద్ధికలిమి నరునకున్
దేవీ! వలయును వారికి
నేవిధమున బ్రహ్మచర్య మేమఱమి తగున్. 39

వ. అని నిర్దేశించి మఱియును. 40

ఆ. పంచపర్వ సురత పరిహృతితో నిజ
దారతృప్తుఁడగుచు ధాన్యకోటి
పక్షి యెలుక దినిన బ్రతుకుఁగాఁ గను గృహ
పతికి నశ్వమేధఫలము గలుగు. 41

వ. అని చెప్పి. 42

ఆ. ఎచట మెలఁగె నేమి యెట్టుండె నేమి దా
నేమిసేసెనేమి యెల్లసంగ
ములను విడిచి కుడుపువలన నియతిగల్గు
యతికి మోక్షవీథి యాటపట్టు. 43

వ. అనిన విని సంప్రీత యై శైలరాజపుత్రి పురహరునితో రా జనువానికి భూజనంబులయట్ల శరీరంబును భోజనాదులును నట్లయుండియు నతం డెల్ల వారలచే మ్రొక్కఁ గొనుటకు నిగ్రహానుగ్రహంబులకుంజాలి సర్వాధిక త్వంబున శోభిల్లు దానికిం గారణంబేమి యెఱింగింపవే యనుటయు నీశా నుం డిట్లనియె. 44

—: శివుఁడు పార్వతికి రాజత్వమహిమాతిశయంబు చెప్పుట :—

సీ. అధికపుఁ దపమునఁనైనది రాజత్వ
మట్లు గావునఁ బేర్మి నతిశయిల్లు
జనములచేఁ మ్రొక్కఁ గొనుటకు నిగ్రహం
బునకు ననుగ్రహంబునకు శక్తుఁ
డై యుండు నతఁడు తదీయసునీతియ
విను ముదమున రాజు వినయపరునిఁ
జేసి యెల్ల జనంబు శిక్షించు నింద్రియ
జయమును నరివర్గజయముఁబడయు

తే. నెఱిఁగి యుపధావిశుద్ధుల నిడునమాత్య
పదవి కనురక్త సారవద్బలముఁ బ్రోచు
హితపరుల మిత్త్రులుగఁ గొను నిలకు మేలొ
నర్చు దుర్గంబు రక్షించుఁ గూర్చు ధనము. 45

వ. ఇవ్విధంబున సప్తాంగసంపన్నత్వంబు నొంది. 46

క. చేయఁ దపాత్రవ్యయములు
సేయుం బాత్రవ్యయంబు సేయున్ నిజర

షాయత్న మెల్లతెఱఁగులఁ
బాయక ధర్మంబుసేయుఁ బాపముదొఱఁగున్. 47

ఆ. ఆచరించు దండ మక్రోధకాముఁడై
చారదృష్టిఁజూచు శత్రుకృత్య
ములను నాత్మదేశపురపరివారవి
ధముల సత్యభాషణముల నెగడు. 48

క. ఉద్యోగము ప్రియవాదిత
విద్యాపరినిష్ఠ సంధివిగ్రహ విహితా
పద్యత దీనానాథవి
పద్యాపన మాజ్ఞ వెరపు వాటించుఁ దగన్. 49

ఆ. కయ్యమునకు నెపుడుఁ గాలు ద్రవ్వఁడు తగ
వైన రణము షూఁడై యొనర్చు
యజ్ఞదానవిధిపరాయణుఁ డై యుండు
నిత్తెఱంగువృత్త ముత్తమంబు. 50

క. ఈనీతులకు విరుద్ధము
లైనపనులు నరకములకు నరుగున్నృపతి పా
పానీతదుఃఖ మొకతఱి
మాను నొరుల కతని కెపుడు మానకయుండున్. 51

ఆ. భావశుద్ధి గలిగి యీవినీతులఁ బూని
ప్రజల కెప్పుఁ డతులరక్షణంబు
సేయు నట్టిపెభుఁడు సిరియును గీర్తియుఁ
గాంచుఁ బుణ్యలోకగతియుఁ బడయు. 52

క. అనుటయు ధర్మరహస్యము
వినఁ గోరెద ననిన శాంభవికి శంభుం డి
ట్లనియె నహింస రహస్యం
బనఁ బరగును ధర్మజాత మఖిలమునందున్. 53

వ. అనిన విని యాగన్మాత యవ్విశ్వధాతతో హింసావర్జనం బేజనులకుం జెల్లదని చూచెద నహింసతెఱం గెఱింగింపవే యని న ద్దేవుం డదినీతలంచి నట్ల నేలం బిపీలికాప్రముఖంబుల నాకసంబున మశకాదుల మఱియుం బేను నల్లి సీరపేనులోనైన జంతువులం జంపక యెవ్వరికి మానరాదట్లు గావున 54

క. ఫలము దళంబునుం దొడిమఁ బాయుట రాలినవానిఁగొంచు నాఁ
కలి కెరసేసి గోరసము కార్యము నట్టుల నిర్వహించి బు
ద్ధులు వెలి లేక నిశ్చలతఁ దోయజపత్రనిభాక్షి! చిత్రరూ
పులొకొ యనంగ నుండు శమపుణ్యులుసూవె యహింసనాత్మకుల్. 55

తే. అదియ శ్రుతిచేత ధర్మరహస్యమనఁగఁ
బడియె ననిచెప్పి మఱియును భవుఁడు దేవి
కిట్టులను నట్లుఁగాక యహింసతెఱఁగు
గలదు వినుము విశేషించి కమలనయన! 56

తే. విధివశంబున మృతిఁబొందు వివిధజంతు
నిచయమం దనహంకారనిష్ఠుఁడైనఁ
బురుషుఁ గల్మష మేమియుఁ బొందనేర
దెట్టు లంటేని విను మది యేర్పరింతు. 57

సీ. దివియలోఁ బడు బ్రుబ్వ్వు దివియయెత్తినవారిఁ
బాపంబుపొందునే యోపిమన్న
నాఁగేటిమొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుఁ బొందునే యఘము వారు
తమపనుల్ సేయ విధాతృవశమున నా
యువు దెగినట్టిజంతువులు సచ్చు
నేమసంపితి మని యించుకేనియుం నహం
కారంబు వారికిఁ గలుగు దట్లు

ఆ. గానఁజూవె వారిఁగల్మషమొందరు
పుణ్యపాపములకు బుద్ధి మూల

మని శివుండు మఱియు నను హింసవోలెనై
యధికధర్మమైన విధము వినుము. 58

దైవగతిఁజేసి తమకుం
జావవలసి గోవు లొండుచా వొల్లక స
ద్భావమున రంతిదేవుని
కావించు మఖమునఁ బశుతఁ గైకొని నెమ్మిన్. 59

వ అనేకసహస్రంబు లరుదెంచి. 60

క. తమ విశసించుట కాఘా
రమణుని వేఁడంగ నతఁడు రాజీవాక్షి!
క్రమమున విశసింపఁగఁ జ
ర్మములు దరులు గాఁగఁ బాఱెరక్తము నదియై. 61

క. ఆచర్మణ్వతి యనునది
గోచరమే వర్ణనమునకుం బ్రియ మగుకం
పైచవి చేయం బొలిచి య
నీచమహితసలిలమయ్యె నెత్తురు సుదతీ! 62

క. స్నానమునఁ బానమున నా
కానందము సేయు నమ్మహానది గోస-
తానము దివికి నరిగె న
మ్మానవపతిఁ జెప్పనేల మధురాలాపా! 63

క. పరబలము పై నడరి నె
త్తురు వట్టులు వాఱఁ జంపుదురు దురమున న
ప్పురుసఁదనంబును బుణ్యో
త్తర మని వేదములు సెప్పుఁ దనుతరమధ్యా! 64

క. పోరులయందలి మరణము
మారణముం బుణ్యలోక మహితమహిమకుం

గారణ మెఱుఁగు మహింసా
కారం బిట్టిదని నీవ కమలదళాక్షీ! ౬౫

సీ. అనిచెప్పి వెండియు హరుఁడు పార్వతితోడ
నిట్లను వేఁటకునెలయు టఘము
గాదు సస్యములు మృగములచేతనశించు
జగమెల్ల నిర్మనుష్యంబు గాఁగఁ
గోరు మృగము లది కారణంబు మృగ
హతిరాజులకు ధర్మమయ్యెనటు
గాక మృగములకుఁ గలుగు సద్గతి రాజు
చేమృతిఁ బొందినఁ జెలువః వినుము

తే. దండ్యు దఁడింప నుండు టదండ్యు దండ
నంబు గూర్చుట విప్రుమనంబు నొచ్చ
నట్టిపని సేఁతయును విను మనపరాధి
తనువునొంచుట సూ హింస ధరణిపతికి. ౬౬

వ అని బోధించి. ౬7

క. భూసురుల కలుక పుట్టం
జేసి నహుషముఖ్యనృపులు చెడుట ప్రసిద్ధం
బాసురపతి విప్రునలుకఁ
గాసిఁ బడఁడెతెలచి పడసెఁ గాదె నయనముల్. ౬8

క. కావున విప్రాపరాధకుఁ
డై వెలయు విభుండు రాష్ట్ర మతనిధనము సై
న్యావలి బంధులవిప్రుల
దీవనలం బొదలు నింత తెల్లము దేవీ! ౬9

వ. అని నిర్దేశించి కపర్ది గౌరితో వెండియు. 70

ఆ. పరమమంత్రవిధులఁ బశువులు యూపంబు
లందుఁ గట్టఁబడి మహాశుచిత్వ
విభవ మొందు విహితవిశసనక్రియ మేను
విడిచి దివ్యసుఖము వడయుఁ బొలఁతి! 71

క. హోమవిధులఁ దన్మాంసము
లామిషములు గాఁగ నొసఁగి యమరుల నగ్ని
ష్టోమాదులఁ బ్రోవఁగఁ బర
మామితసౌఖ్యములు గల్గు యజమానులకున్. 72

క. శ్రుతివిహితహింస హింసగ
మతిఁ దలఁపఁగ రాదు మునిసమాజంబిది దు
ష్కృతతతిఁ బాపెడు పరమసు
కృతమని కొనియాడుఁ గాన గీర్వాణనుతా! 73

ఆ. అని యహింసతెఱఁగు లన్నియు నెఱిఁగించి
యింకనేమి వినఁగ నిచ్చ సేసె
దనిన రుద్రు నడిగె నద్రిజ జనుల జీ
వనము తెఱఁగు లెల్ల వనజనాభ! 74

సీ. అడిగిన నద్దేవి కద్దేవుఁ డిట్లనుఁ
గాంత మానుష్యంబు కర్మభూమి
సుఖదుఃఖమూలముల్ సురతిర్యగాత్మక
త్వంబు లట్లగుట చిత్తంబువలయు
మనుజుల కెట్లన్న విను ధర్మకామముల్
విత్తసాధ్యంబులు విద్య వార్త
సేవ కార్షత యర్థసిద్ధికి మూలముల్
విద్యవానికి ననవద్యతయును

ఆ. గర్షకునకు నేల కాల మెఱుంగుట
జట్టికాని కేది సంభవించె

నందు విలువ మొదలు నగులాభమునునెడ
వ్యయము గలుటయు శివప్రదములు. 75

క పసులం బాలించునతఁడు
విసువక యేమఱక వానివిధము లెఱిఁగి ప్రో
చిసమర్థుం డగు వెరవునఁ
బసిఁ గను సేవకుఁడు ధనముఁ బడయుఁ బొగడన్. 76

క వంచనయును జాడ్యంబును
నించుకయునులేక ప్రభువునిష్టమెఱిఁగి తాఁ
బంచినిపని వెరవునఁ గా
వించిన కర్మకరుఁ డొందు విపులధనంబుల్. 77

వ అని వెండియు. 78

క పరధనపరదారల నప
హరింపమియు దేవపితృసమారాధనముం
గరుణయు నతిథిసపర్యయు
గిరితనయా! యెల్లవారికిం గృత్యంబుల్. 79

—: శివుఁడు పార్వతికి వర్ణకర్మ పరిపాలకంబుల తెఱఁగెఱింగించుట :—

వ అనిన విని యపర్ణాదేవి వర్ణంబులకర్మంబులు పాకంబుఁ బొందు ప్రకా
రంబు చెప్పుమని యప్పరమేశ్వరు నడిగిన నతం డిట్లనియె. 80

చ తమతమకర్మముల్ తెరువుదప్పక చేసినవారు దేవలో
కమునసుఖంబు నొందుదురు క్రమ్మఱ వచ్చియుఁ బూర్వజాతి జ
న్మమున మహార్థిఁ బొందుదురు మానిని! యిమ్మెయిఁ దప్పి యెట్టికృ
త్యములఁ జరించి రజ్జనుల కట్టికులంబునఁ బుట్టు వాటిలున్. 81

క. ఎంతెంత మేలుచేసిన
వంతంతియ కులమునెక్కుడై సమాకూరుం

గాంతా! విప్రుఁడయిన న
త్యంతానంద మగులోక మతనికిఁ గలుగున్ 82

వ. అనిచెప్పి మఱియును. 83

ఉ. ఆపదఁ దూలపోక సిరినంది మదింపక శౌర్యవృత్తిమైఁ
బాపుల గెల్చి యార్జవము బంధుజనాలికి నార్యకోటికిం
జూపుచు దీనులఁ గరుణఁ జూచి తగం గలమాత్రఁ బ్రోచుచుం
గోపములేక మన్కిగలుగున్ దివిజాంశమునన్ జనించినన్. 84

క. అనిన విని గౌరి కొందఱు
మనుజులు సంపదసుఖించి మనఁ గొందఱు లే
మి నలంగి దుఃఖపడుదురు
విన నెలతుం దారణంబు వినిపింపు శివా! 85

చ. అనుటయు శంభుఁ డిట్లను దయన్ బలిబిక్షమువెట్ట రేమిఁ గుం
దినచెలిఁ జుట్టముం బిలిచి దీనత వాపి యపాపవృత్తిఁ జె
ల్లిన తొలుబాము గల్గునరు లెస్సగమంచు విధాత నిష్కృపా
త్ముని నతిలోభదూషితుని దుర్గతిదుఃఖితుఁ జేయుఁ బార్వతీ! 86

క. విను మలుకయుఁ గూర్మియు లే
పనవద్యా! యెజ్జనంబులందును సిధికిన్
మును సేసిన కర్మముఫల
మనుభవగోచరముసేయు నంతియ తఱితోన్. 87

వ. అని యెఱింగించి వెండియు. 88

ఆ ధనము గలిగి యుండి ధవళాక్షి! కుడువక
కట్టకుండు పరమకష్టజనము
లొరువులొత్తి చెప్ప నుపకారులై తొలు
పుట్టు నందు మనినయట్టివారు. 89

ఆ. తమకు ధనము లేక తగుభోగముల కెప్వ
రైననడప మను సుఖాఢ్యజనులు

తొల్లి పేదవార లుల్ల మర్థుల కెపుఁ
బెట్టఁ గోరు చుఁడి నట్టివారు. 90

సీ. ఆయాసపడ కుండ నర్థంబు చేరెడు
వారు పాత్రజనంబుఁ దార పిలిచి
తొలుమేనఁ బెట్టిన యలఘుదయాఢ్యులు
ధనసిద్ధి బహులయత్నమునఁ గలుగు
మనుజులు పూర్వజన్మమున నర్థులు దమ్ము
నడుగ దాఁపక యిచ్చినట్టివార
లాయాసమునను విత్తాగమం బడలెడు
జనులు ముందరిపుట్టువునఁ గృపావి

తే. హీనులై యాచకుల నలయించి పిదప
నిడనిలోభులు ముదిసి ధనేశుఁడగు న
రుండు ప్రాయంబునాఁ డీక గం డడంగి
తొంటిభవమున నీగికి దొడఁగి నతఁడు. 91

తే. కలిగియుండియుఁ దెవుళులకతన భోగ
ములు భుజింపఁగలేనిమర్త్యులు గిరీంద్రః
తనయ! తొలుమేనరోగముల్ దనకిచచ్చు
నపుడు దానంబు సేసినయట్టివారు. 92

తే. అధికసౌందర్యములు గలయట్టిజనులు
తొల్లి మాంసభోజనములఁ దొఱఁగియున్న
వారు రూపవిహీనులు దారు రూపు
గలిగి తొలుమేనఁ గొనటులఁపలికినారు. 93

క. విను సౌభాగ్యసమేతుఁడు
మును నిజదారైకపరుఁడు ముందటిజన్మం
బున భార్యకుఁ బ్రీతియొన.
ర్చని మనుజుఁడు సుభగతావిరహితతఁ బొందున్. 94

క. అమితజ్ఞానము విజ్ఞా
నముఁ గలిగియుఁ బేదయైననరుఁడు చనినజ
న్మమున వినికి గలిగియు దా
నము తెరువునఁ బోనివాఁడు నలినదళాక్షీ! 95

క. తగుబుద్ధిలేక సంపద
మిగులఁ గలుగు నరుఁడు తొంటిమేనఁ గరుణమై
విగతప్రజ్ఞుం డయ్యును
దగ నీనులఁ బ్రోచినతఁడు దళితాబ్జముఖీ 96

సీ. మేధావియై విన్కి మిగిలివిద్యలఁబొల్చు
నరుఁడు దొల్బామున గురునకధిక
భక్తుఁడై తన దైనపాండిత్య మొరులకుఁ
గావించువేడుక గలుగునుజనుఁ
డభ్యసింపఁగ విద్యాయుక్తి లేకుండు
నాతఁడు దొల్లి విద్యాధికత్వ
మున గర్వియై శిష్టజనులకు సభ భంగ
మొనరించి కుందఁ జేసిన యతండు

తే. భార్యయును బిడ్డలును దాను బహుధనముల
భోగులై రోగములులేక పొల్చువార
లమలినాచారపాత్రదానములు సత్య
కరుణలును దొంటిభవమునఁ గలిగినారు. 97

ఆ. ఆలుబిడ్డ లొఱటులై లేమిఁ గుందుచుఁ
దెవులుచేతఁ బడుచు నవయుజనులు
మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర
పీడనంబుసేసి పేర్చినారు. 98

సీ. కాంత జాత్యంధుఁడు గన్నులు చెడువాఁడు
తనయొప్పు మెఱయునుఁ దగిలి యొరుని

వనితఁ దొల్మేనఁ జూచినవాఁడు దుర్ణరో
గార్తుండు కటుకవాక్యములఁ దొల్లి
శిష్టు నొప్పించిన కష్టుండు కడుపునఁ
దెవులై నతఁడు పూర్వభవమునందు
గరదుండు గోశ మశ్మరిని శర్కరను బా
ధితుఁ డగునరుఁ డన్యసతిని గన్య

ఆ. మహిపి గోవుఁ దురగి మదనాతురత మున్ను
గవిసినాఁడు శోషి దివిరి యొరువు
లనుభవింపఁ దెచ్చుకొనినమాంసము దొంటి
పుట్టువున హరించినట్టి నీచు. 99

ఆ. ఉలుము గొన్నవాఁడు తోలుమేన నాఘాత
బంధనముల నొరుల ప్రన్నఁదనము
చెఱచినాఁడు పంగు వొఱవగఁ గాలుసే
విఱికి సాధుజనులఁ బఱచి వాఁడు. 100

క. పిలకాదుల గంతులచే
నలమటఁ బడువారు బడియ నడిచియు ముష్టిం
జలమున బొడిచియు సాధులఁ
బొలుబామున నొంచినట్టి దుష్టచరిత్రుల్ 101

ఆ పాదరోగు లశుచిపదముల దేవాల
యములు మెట్టుటయును నసదువారిఁ
దప్పులేక క్రొవ్వితన్నుటయును దొలు
పుట్టునందుఁ గలిగినట్టివారు. 102

చ. జ్వరముడ గుల్మపీడ నతిసారములఁ బలుపుండులున్ మహో
దరమున వాతపిత్తకఫదారుణరోగములన్ నిరంతరా
తురులగువారు నిర్దయతఁ దొల్లి వినోదముగాఁగ జీవులం
దగిమిడి చంపినారు గురుఁ దల్లడపెట్టినవారు పార్వతీ! 103

తే. గూనివాఁడును బిచ్చుకకుంటుగుజ్జు
గొలుచు లమ్ముచోఁగచ్చులుగలిపి సరకు
దూఁచిపెట్టెడుచోటులఁ దూన్కిఁదరిపి
పూర్వభవనమున లాభంబుఁ బొందినారు 104

సీ. వెట్టులుతొలుమేన వెడ్డున సాధుజ
నము మోసపుచ్చి ధనంబు గొన్న
జను లనపత్యులు వినుతొల్లి పితృకార్య
దూరులు బాలఘాతులును జువ్వె
పొలఁతి నపుంసకుల్ పూర్వభవంబున
నెద్దుఁ బట్టినవారు నేమితప్పఁ
బొరయకుండఁగఁ గోపమునఁ ద్రికచ్ఛేదంబు
గావించినారును గామసుఖము

తే. విప్రుపఠించిన తులువలు విధవ తొంటి
జన్మమునయందు భర్తృవంచన మొనర్చి
ధనము గూర్చిన యదియు మదంబు పేర్మి
నోర్తుమగని హరించిన యుగ్మలియును. 105

తే. ప్రయతులై పుట్టి యేవంవుఁబనులఁ గడుపుఁ
బ్రోచికొనువా రహంకారముననుగర్వ
మానమదదంభములఁ దొల్లి మాన్యజనులఁ
బరిభవించినతుచ్ఛులు పద్మనయన! 106

సీ. దాసత్వమొంది యదల్పులఁ దిట్టుల
నాటులఁ బడుచుండు నట్టి నీచు
లప్పాటఁ దొలుమేన నతిగర్వులై ప్రల్ల
దమ్మునఁ బెక్కండ్రఁ దప్పులేక
తిట్టియు నడిచియుఁ దిరిగినవార లా
పొలువలపైఁ గృప గలిమిమేలు

ధనిక గృహద్వారమునఁ బ్రతిహారి ద
మ్మాఁగఁగ నుండి దైన్యమునదుఃఖ

తే పడుజనంబులు భోగైకపరతఁ దొల్లి
మాననీయుల కవసర మీనివారు
రాజదండితుఁ డకృతాపరాధుఁ గ్రూర
దండదూషితుఁ జేసినతండు సూవె. 107

క. విను నష్టసకలధను లగు
జనములు నిక్షేపమిడిన సరకులు దొలుబా
మున మగుడ నీక నెపమిడి
కొనినట్టి యసత్యలోభకుత్సితు లతివా! 108

క. తమబంధులుఁ దారునునొ
క్కమరియ తెగటాఱువారు కరుణారహిత
త్వమున దొలుమేన వెడపఁగ
నమేయ నరవధముసేసినట్టి దురాత్మ్కల్. 109

వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో ని ట్లనియె. 110

సీ. ఇంతి నాచెప్పిన యిప్పాపకర్మలం
దఱకును నరకంబు దప్ప దందుఁ
బడుపాటు లెల్లను బడిపచ్చి నరులైన
యప్పుడు వాటిల్లునట్టి తెఱఁగు
లివి యట్లుగాకయు నెక్కుడు గాని పా
పంబుల మానుషభవము గలుగు
నిట్లైన నమ్మేన నేకర్మమున ఫల
మైనను మానవు లనుభవింప

ఆ రోపి మునులు దేవయోనులు నత్తను
వునన తపము ఫలము లనుభవింతు

రనిన దేవి యెఱుఁగ నయ్యె మీదయఁ బెక్కు
లర్థములు గృతార్థనై తిననియె. 111

వ. అని వెండియు నద్దేవునితో మనుజులపరజన్మంబునం గాని కర్మఫలంబు లనుభవింప రంటిరి తప్పుచేసిననరుల నరపతు లిట్టితప్పున కిట్టిదండం బనునిరూపణంబున దండించెద రని యక్కర్మఫలం బప్పుట్టువునన యనుభవించుటదదె యనిన గౌరికి గంగాధరుం డిట్లనియె. 112

సీ. జనపతుల్ దమరాజసంబున దండించి
నారు గా నొల్లక నరులతప్పు
లకుఁ దగుదండనబు లన వారిఁ బఱచురు
తక్కొరు లెవ్వరుఁ దప్పుసేయ
వెఱచుటకై యట్టి విధి మూఁడటది పూర్వ
కర్మంబువలనన కాని యపుడు
గలిగిన తప్పునఁ గా దన్న నాదేవి
యవనీశదండితుఁ డైననరున

తే. కఘము వాయునొ పాయదో యనిన నీశ్వ
రుండు నృపదండితుఁడు యమదండముననఁ
బడఁడు లేనితప్పున నరుఁ బఱిచినతనిఁ
బఱుపకున్నాతనిని యమబాధ వొందు. 113

వ. అని నిర్దేశించి వెండియు. 114

క. విను తమచేసినకర్మం
బునఫలమెవ్వరికిఁ ద్రోచి పుచ్చఁగ రాదె
ట్లును గుడువకపోదది యన
విని పార్వతి యిట్టులనియె విభునకుఁ గృష్ణా! 115

తే. కర్మఫలములు గుడిచినఁగాని పోవ
వంటి వానిఁ బ్రాయశ్చిత్తమపహరించు

నందు రశ్వమేధంబున నఖిలపాప
ములును జెడుసనఁగా విందు భూతనాథ! 116

వ అనిపలికి యిది యెట్లొకో యనుటయు భవుండు. 117

ఆ. అతివ కామకృతంబులైన కర్మంబుల
ఫలము లనుభవింపవలయు వినుమ!
కామకృతముచెడుటగలుగుఁ బ్రాయశ్చిత్త
మాచరింప సంశయంబు వలదు. 118

క కావునఁ గుడువక పొలియదు
దేవాసురమునుల కైన దేవీ! కర్మో
ద్భావితఫల మీయర్థము
నీ వలవఱపుము భవన్మనీషఁ దిరముగన్. 119

వ. అనిచెప్పి యప్పరమేశ్వరుండు వెండియు. 120

క. సుకృతముల నరుఁడు నాకము
నకుఁ జను నవి గొంచెమైన నరుఁడ యగును వా
నికి దివి కేఁగి డిగిన యత
నికి మానుషవైభవములు నెఱయం గల్గున్. 121

వ. అని నిర్దేశించె యుద్దేశరూపంబునం గర్మంబులతెఱం గెఱింగించి యింక నేవియడుగ వలతడుగు మనిన నంబిక కర్మకరణంబు జంతువశంబు గ్రహవశంబునా రెండు తెఱంగులం జెప్పుదు రందెయ్యది దృఢంబని యడుగుటయు మృడుం డిట్లనియె. 122

తే నాతి! విను గ్రహచారంబు హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ డాచరించు
గ్రహము చేయించునే తాన కాక చేఁత
కొడయుఁ డటుగాన ఫలములు గుడువవలయు. 123

వ. అనినఁ జావనునది యేమి యని యుమ యడుగ నీశానుం డిట్లనియె. 124

తే. నిత్యుఁడాత్ముండు దేహ మనిత్య మతఁడు
ముదిమిఁ దెవులున వికృతమై యది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగి తాఁ బోవునట్టి
దశకు మరణ మన్పేరయ్యెఁ దనులతాంగి! 125

క. జీవుఁడు జీర్ణశరీరముఁ
బోవిడిచి నవంబుఁ బొందఁ బుట్టునుపేరం
దా వెలయుం దద్దశ జీ
వావలివర్తించునిటు గతాగత పరయై. 126

వ. అనిన విని పార్వతి శర్వునితో బాలురు చచ్చుటకును వృద్ధులుబెద్దకా
లంబు బ్రదుకుటకును గారణంబేమి యనుడు నతండు. 127

తే. మేను జీర్ణముగాఁ జేయుఁ గాని మరణ
మొందఁ జేయదు విను కాల మెందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ బొదలఁ జేయ
సన్నముగఁ జేయ బ్రదుకును జావుఁ గలుగు. 128

వ. అనిచెప్పిన నాయు వేమిటం బెరుగు నెద్దానందఱుఁగు ననినవిని యుమకు
నుమాపతి యిట్లనియె. 129

—: శివుఁడు పార్వతికి నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబులు చెప్పుట :—

తే క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలనిభక్తియు నాయువు పొలుపు నిచ్చు
నలుకు బొంకు క్రూరత శుచితాపగమము
గురువిరోధమాయువుఁ గడుఁ గుందఁజేయు. 130

తే. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
బెరుగు నాయు వాక్రియలపై నరుఁడుప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము. 131

క. తనలావున కధికమయిన
పనిసేయుట యుక్తమును నపథ్యము నగు భో
జనములు హరించు నాయువు
వనితః యవియుఁ బూర్వకర్మవశతనకలుగున్. 132

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద. 133

తే. సుకృతు లమరలోక సుచిరవాసులు నిట
డిగి చిరాయువులును నగుదు రితరు
లతిచిరముగ నరకగతు లయి తుది నాయు
వల్ప మగుమనుష్యు లగుట గలుగు. 134

క. నా విని భవాని పురుష
స్త్రీవిధములు రెండుగలవు త్రినయనః వానన్
జీవుఁడు వర్తించు తెఱఁగు
నీవేర్పడఁ జెప్పవే యనియెఁ గంసారీః 135

వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కిట్లనియె. 136

క. తాత్వికము లైనపురుష
స్త్రీత్వంబులు లేవు పార్వతీః జీవున కా
తత్త్వమున కహంకృతిఁ గ
ర్మిత్వ మొలసి భావ్యవిధమ మెయికొనుచుండున్. 137

వ. అని మఱియును. 138

ఆ. కర్మములకుఁ గర్తగాఁ డాత్మఁ దతని స
త్త్వము రజస్సుఁదమము వాతపిత్త
కఫము లెట్లు మర్త్యకాయగతము లగు
నట్ల పొందుఁ గర్త లవియ చూవె. 139

తే. సత్యశౌచదయాదులు సాత్త్వికములు
రమణిః లోభసంగాదులు రాజసంబు

లన్నృతహింసాపరప్వభయాలనత్వ
ధైర్యహానినిద్రాదులు తామసములు. 140

క. ఇవి నానాముఖములఁ బురు
షువికారముఁ బొందఁ జేయుచుంబరఁగును హై
మవతీ! కావున సర్వం
బు వినుము గుణకృత్య మిట్టిబోధం బొప్పన్. 141

తే. తన్వి! సాత్త్విక రాజస తామసాత్ము
లైనవారలఁ బుణ్యలోకానుభవము
మనుజభావంబు నిరయపీడనముఁ బొందు
మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ మసరు. 142

వ అని వెండియు. 143

సీ. ఎట్టివి కర్మంబు లట్టివ నరుల శు
భాశుభసంప్రాప్తు లట్లుగాక
పరవిప్రియమున మేల్ వడయుటయును గల్గుఁ
బతిభృత్యతతిఁ బటుభర్త్సనముల
నొజ్జశిష్యులఁ దర్జనోక్తుల వెజ్జు రో
గార్తుల నానావిధౌషధముల
నలమటఁ బొందింతు రవ్విధంబులఁచేఁత
లన్నియు సుకృతంబులై ఫలించు

ఆ. అని మఱియును జెప్ప నఖిలేంద్రియోపేత
మగుజరాయుజంబు నండజంబు
నువిద! చోఁకు నెఱుఁగు నుద్భిజ్జములు స్వేద
జముల కదియుఁ జూపు సంభవించు. 144

క. నరుఁడు జరాయుజములలోఁ
దరుణీ! విను ముత్తముఁడు శ్రుతము లే కున్నన్

సరి నతఁడు పశువుఁ గావున
పరిష్టమగునట్టివినికి వలయు నరునకున్. 145

క. ఇరుదెఱఁగు విను తమము శా
ర్వరమును దేహజము శార్వరము దేజస్సం
స్ఫురణమునఁ బాయు శ్రుతమునఁ
బరిహృతమగు దేహజంబు పర్వతపుత్రీ! 146

ఆ. బ్రహ్మ యాతమంబుఁ బాపుటకై తపో
వ్యాప్తిఁ బడసె శ్రుతులు నంగములును
గానఁ గార్యములు నకార్యంబులును వానఁ
దెలిసికొనఁగ బుద్ధి కలఁక దీఱు. 147

తే క్రోధకామాదులైన దుర్గుణము లెల్ల
వాయుహతి మేఘపటలంబు వాయుపగిది
శ్రుతముచేఁ బాయు నరులలో సురలకరణి
శ్రుతయుతులు దేజరిల్లుదు రతిశయిల్లి. 148

తే శ్రుతము నరునిఁ బరిజ్ఞానయుతునిఁ జేయు
వానిసుకృత మల్పమును ననూనఫలము
నిచ్చు నజ్ఞాని సత్కర్మ మెంత యైన
నఫల మగు, గాన శ్రుతవంతుఁ డగుట వలయు. 149

వ. అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డిట్లనియె. 150

సీ మృతిఁ బొంది వేగ జన్మించినఁ బూర్వదై
హికములన్నియు బుద్ధి నెలయువాఁడు
జాతిస్మరుం డనఁ జను నయ్యెుబుక పెద్ద
వాఁడు గాఁగాఁ జెడు వనిత! వినుము
పుట్టెబుంగుటకల్మి బోధించుటకు నాస్తి
కులమును జన్మంబు గలుగుతెఱఁగుఁ

జచ్చిపోయినవారు వచ్చి యుత్తను వొ౦ది
మెలఁగు టొక్కొకచోట గలిగి యుండు

తే. నట్టితెఱఁగు వెంగలులైన యమునిదూత
లొరులఁ జని కొనిపోయినఁ గరుణతోడ
నమ్మహాత్ముండు మగడి పొమ్మన్న నరుగు
దెంచు టని నీ వెఱుంగు సందియము లేదు. 151

—: శివుఁడు పార్వతికి స్వప్నాదుల తెఱం గెఱింగించుట —

వ. అని తెలిపిన గౌరి కలయనునది యేమి యెఱింగింపవే యనుటయ
నతండు. 152

ఆ. స్వప్నమనఁగ సుప్తజనము మనశ్చేష్ట
యదియుఁ గాంచు నొగి ననాగతములఁ
గానఁ గలలు సూచకము లగు భావిశు
భాశుభోదయముల కనుచుఁ జెప్పె. 153

వ చెప్పిన విని భవాని భవుని తోడ. 154

సీ. దైవంబొ కర్మవర్తనము జనంబు ను
త్సాహంబొ యనిన నతండు దైవ
మోపి కర్మంబు సేయుట లేదు దైవసం
కలన ఫలంబిచ్చుఁ గాని వినుము
దేవి పూర్వకృతంబు దైవనామకమునఁ
బరగు నప్పటిచేఁత పౌరుషంబు
కృషివోలె నుండుఁ బౌరుషగతి వర్షస
ద్వాయువు లట్ల దైవప్రకార

తే మెఱుఁగు ఖననమథనముల నెట్లు జలముఁ
జిచ్చుఁ బుట్టు నమ్మెయి నరుచేష్ట దైవ
యోగమున సిద్ధిఁ బొందు నుద్యోగరహితుఁ
డెత్తెఱంగున దైవసమృద్ధిఁ బడయు. 155

క కావున నుద్యోగంబును
దైవంబును గారణములు దామరసాక్షీ!
యేవిధమునఁ గర్మముల ఫ
లావాప్తికి దీన సంశయము వలదు సుమీ! 156

తే అనిన నంబిక గర్భంబు నాత్మఁ డెట్లు
చొచ్చు ననవుఁడు నభవుఁడు సురతబీజ
రక్తదైవముల్ సూవె కారణము లాత్మ
గర్భసంవేశనమునకుఁ గమలనయన! 157

క. మాయారహితుఁ డహంకా
రాయత్తతఁ జూవె పుట్టు వనుచెఱఁ బడి నా
నాయాసంబులఁ బడు నా
జ్ఞాయుతుఁడై యాత్మఁ డింత చర్చింపు మదిన్. 158

సీ. అని చెప్పి దైవరహస్యంబు వినిపింతు
వినుమని పలికి యి ట్లనియె శివుఁడు
తొల్లి మనుష్యులు తొలుమేని కర్మంబు
లెఱుఁగఁగాఁ జాలుట నెల్లవారు
మేలు సేయగ ననిమిషలోకమున నధి
కం బగు సందడి గాఁగ మనుజు
లమరులై పేర్చిన నజుఁడు వేల్పుల సంక
టము వాయుటకు నుపాయము దలంచి

తే. మానవుల కయ్యెడుకకల్మి మాన్చి కామ
రోషముల నొలయించిన దోషకృతుల
వారు నరకాదిసమ్మర్దకారులగుదు
నదియుఁ గా దని చింతించి యనువు గాంచి. 159

క. సరిగా నారెండెడలకు
నరులు సనుట గోరి మనమునం గానమియుం
బరలోకవిధము శాస్త్రము
వెరవునఁ గనుటయు నొనర్చె విధి వారలకున్. 160

వ. అనినం బార్వతి పునర్జన్మంబు గలదు లే దనుసంశయంబుతోన పొట్టుపొర
లగుదురు నరులు దాని తెఱంగు నిశ్చయింపవే యనుటయు నంధకారాతి
యిట్లనియె. 161

క. కలదో లేదో యనియెడు
తలపోఁతయ కాని నిశ్చితము గాదు సురా
దులకుఁ బునర్జన్మంబుల
కలిమియు లేమియును నరులు గానమి దప్పే! 162

క. కల దది యూరక కానఁగ
నలవియె శ్రుతివాక్యసమితి యర్థంబులపై
నిలిచినశ్రద్ధం గ్రమమునఁ
దెలివొందినఁ గాక యెట్టి ధీమంతులకున్. 163

వ. అనిన విని గౌరి గంగాధరున కిట్లనియె. 164

క. మృతు లైన వారలు నిరా
కృతులై యుండుదురు వారిఁ గీనాశభట
ప్రతతి కొని చనుట యాపితృ
పతి శాసించు టవి యెట్టిభంగులు దేవా! 1 5

వ. అని యడిగిన నద్దేవుం డిట్లనియె 166

సీ. తఱియైన మనుజులఁ దనువులు విడిపించి
మాయాశరీరసమన్వితులుగ
నొనరించి దూతలు గొనిపోదు రందును
ధర్మవర్తుల సుగంధంబు మృదువు

నైన మార్గమున మధ్యపువారి నిర్బాధ
సరణిఁ బాపాత్ములఁ బరుసఁ దనము
ముఱికియుఁ గల పథంబున నడిపింతురి
ప్పురుసునఁ జని పితృపతికిఁ జూప

ఆ. నతఁడు పుణ్యలోకగతియును మానవ
త్వంబు ఘోరనరకవాసమును వి
ధించి పుచ్చు వారిఁ దెలచి మన్నించి భ
ర్జించి వరుసతోడఁ జిగురుఁబోఁడి. 167

వ. అని చెప్పిన నగేంద్రతనయ చంద్రశేఖరునితోడ. 168

క. నరకం బెట్టిది కల్మష
కరులఁ జముఁ డెట్టిభంగిఁ గాఱియఁ బెట్టున్
వరదా! చెప్పు మనుడు న
ప్పురహరుఁ డి ట్లనియె వృష్ణిపుంగవ ప్రీతిన్. 169

సీ. రౌరవం బనఁగ ధరాస్థలి క్రింద మ
హారౌరవంబన నవుల దాని
కావల విను కంటకావనం బన నుండుఁ
గ్రమవృత్తిఁ బేర్చు దుఃఖములు గలిగి
యగ్నికుండంబు నానటఁ బంచకష్టంబు
నాఁ గల వి ట్లున్న నరకతలము
లై దందుఁ బాపక్రియాతారతమ్యంబు
లూహించి యంతకుం డునుపఁ బనుచుఁ

తే. దగినయెడలఁ బాపాత్ములఁ దద్భటాలి
దహనకర్తన బంధన తాడనములఁ
బఱుప వారలఁ గుక్కలు గఱచుఁ గ్రిములు
దొలుచు గ్రద్దలు నొప్పించుఁ దుండవిహతి. 170

వ. మఱియును యమదూతవ్రాతంబు నానావిధవేదనలఁ బెట్టి దండిచు
చుండు. 171

ఉ. అమ్మెయిఁ బాపముల్ వొలయునంతకు దుఃఖము లంది కీటజ
న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ బొంది మృగత్వమానుష
త్వమ్ముల నోలిఁ బొందుదురు వా రినుమెంతయుఁ గ్రాఁగి కల్మష
త్వమ్ము దొఱంగుమాడ్కి నవతామరసవ్రతిమానలోచనా! 172

వ. అనిన విని పార్వతి పాపంబు లనునవి యెట్టివి యెఱింగింపవే యనుటయు
నీశానుం డిట్లనియె. 173

–:శివుడు పార్వతికి మానస వాచిక కాయికము లను త్రివిధపాపములఁ దెల్పుట:–

సీ. మానిని త్రివిధముల్ మానసవాచిక
కాయికంబులఁ బాతకంబు లందుఁ
బరధనాపేక్షణ పాపానుమోద ధ
ర్మ ద్వేషముఖములు మానసంబు
లనృతదారుణభాషణాదులు వాచిక
ములు వధంబును బంధమును నభక్ష్య
భక్షణంబును నన్యభామారతము మద్య
పానంబు మొదలైన పాపకృతులు

తే. కాయికంబులు విను మధికం బపేయ
పాన మది దుష్కృతంబులలోన నెల్లఁ
బానమున నిందతో వచ్చుఁ బ్రాణగొడ్డ
ములును జేటులు నరకాబ్ధి మునుఁగుటలును. 174

క. లోకము నిర్మర్యాద
త్వాకుల మై చెడదె సజ్జనావలి మధుపా
నాకాంక్ష దొఱఁగ కున్న గు
ణాకల్పా! యేమి సేయ దక్కిడు నరున్. 175

క. కావున నేవిధమున సుర
సేవింపక యుడుగు టొప్పుఁ జెలువ! సకలవ
ర్ణావలికి దానఁ గీర్తి
శ్రీవైభవ పుణ్యగతులు సేర్చికొన నగున్. 176

క. అని విని యంబిక సుకృతము
లనునవి యెట్టి వని యడుగు నద్దేవికి ని
ట్లనియెం జంద్రార్ధధరుం
డనుమోదోల్లాసి యగుచు నంబుజనాభా! 177

తే. ఔపరమికాభిదానంబు నంబుజాక్షి!
నిరుపకరణాఖ్యమును సోపకరణనామ
కంబు నయి లోకమున సుకృతంబు వరఁగుఁ
ద్రివిధముల వానిఁ దగ వివరింతు వినుము. 178

సీ. ఔపరమిక మనునది పాపవర్జన
మకట! కానఁగ నేర రజ్ఞజనులు
యత్నంబు వలదు వ్యయం బేమియును లేదు
పరలోకభీతిఁ బాపములఁదొఱఁగి
నంతిన సుగతిసౌఖ్యం బొడఁగూడెడు
నదియు నాత్మాధీన! మట్టిదాని
సుకరత్వ మెఱుఁగక చొత్తురు నరకంబు
వెరవరుల్ శ్రుతమున వృద్ధయోగ

తే. మునను ధృతికల్మి నింద్రియ వినియమమున
నది దమకుఁ గలిగింతురు యను మనంగఁ
బరగు నది దాన నాకంబుఁ బడయ వచ్చు
ననిసఁ జెప్పంగ నేల ధర్మాభియుక్తి. 179

ఆ. నిరుపకరణ మనఁగఁ బరఁగు శౌచంబు స
త్యంబు శాంతి దాంతి యార్జవంబు

వ్రతనిరూఢి సముపవాసంబు బ్రహ్మచ
ర్యంబుకల్మి నియమమండ్రు దాని. 180

సీ. అభ్యంతరంబు బాహ్యము ననఁగా శౌచ
మిరుదెఱఁగై యుండు హృదయ సుకృత
మాభ్యంతజము విను మాహారశుద్ధియు
నంగసౌధనము బాహ్యంబు సత్య
మన్నది గన్నది విన్నది యున్న రూ
పున నుక్త మగుట యంభోజవదన!
శాంతి బుద్ధీంద్రియసన్నివారణ దాంత
కర్మేంద్రియముల యోగ్యప్రవృత్తి

తే. యార్జవము గుటిలుఁడు గామి యగువ్రతంబు
మంచిపని పూని నడపుట యంచితోప
వాస మశననిగ్రహ మనవద్యమైన
బ్రహ్మచర్యంబుఁ గామునిబారిఁ బడమి. 181

ఆ. నాతి! తీర్థసేవనంబును నియమవి
శేష మగుట దానిఁ జెప్ప వలయు
సకలనదులఁ దీర్థసంజ్ఞలు గల వబ్ధి
కరుగునట్టి నిచ్చు నధికఫలము. 182

తే. వానియందును మునిపదమాననీయ!
దేశములు నబ్ధిసంయోగదేశములును
దెలియు మన్యోన్యసంగమదేశములును
బరమతీర్థంబులగుఁ బద్మపత్త్రనయన! 183

క. వనధి మహాతీర్థం బం
దును సంయమపరులచేతఁ దొల్లి ప్రియమునం
గొనియాడఁ బడినచోటులు
విను ముత్తమతీర్థములు వివేకాభరణా! 184

క. వెలి శుచియై మఱి తీర్థం
బులు సొచ్చుట మేలు నియమములు దీర్చి తగన్
వెలిలినయెడ దేవార్చన
ములు విప్రార్చన లవశ్యమును కృత్యంబుల్. 185

క. చేరువ దీర్థము కంటెను
దూరపు దీర్థంబు మేలు తోయజవదనా!
శారీరాయాసము ద
త్కారణమై వేదవాక్యగతి యిట్లుండున్. 186

క. విను సోపకరణ మనునది
ధనధాన్యాదిసమగ్రతను గృహమేధుల్
గొనియాడు తెఱఁగు దానం
బున వైదిక పైతృకాది పుణ్యక్రియలన్. 187

సీ. న్యాయార్జితంబైనయర్థంబు వేదవి
త్త్వము శాంతి మొదలగు వరగుణములు
గలవిప్రునకుఁ బుణ్యకాలపవన దేశ
కవితంబుగా భక్తిగలిగి యీగి
మేలిదానము శక్తి మిగులుట శక్తికిఁ
దగుట దానికిఁ గడుఁ దగమి యుత్త
మము మధ్యమము నధమము నగుదానవి
ధానంబు వినుమిట్లు దైవికంబుఁ

తే. బైతృకంబును లోనైనపనులఁ దాను
వేడ్క సేయువస్తువుఁ గొను విప్రుకోర్కి
కనుగుణం బగునదియును నర్థి నిచ్చు
టధికతర మైనఫల మిచ్చు నంబుజాక్షి! 188

తే. చేయు టెంతయు మేలైనఁ జేసి పిదప
వగచినట్టిదానము దను, బొగడికొన్న

దానవిధి నిష్ఫలంబులు గాన రెండు
నుడుగుదాత మహిఫల మెందఁ గాంచు. 189

వ. అనుటయు దాక్షాయణి దాతవ్యంబు లెయ్యవి చెప్పు మనిన భవుం
డిట్లనియె 190

—;శివుఁడు పార్వతికి దానఫలవిశేషంబుల నెఱిఁగించుట;—

సీ. అన్నంబుఁ దోయంబు నఖిలజంతువులకుఁ
ప్రాణముల్ గాన యప్పరమవస్తు
వులు మేలు దాతవ్యములలోన నెల్లను
నతిథుల కవి యిచ్చుఁ టమరలోక
చిరమహాసౌఖ్యంబుఁ జేయుఁ గాంచన మగ్ని
యగుటఁ దద్దానమత్యంతపావ
నము సర్వకామప్రదము గోవు సద్విప్రు
నకు నీగి తద్రోమనికరసంఖ్య

ఆ. వరుసనాకలోకవాస ంబు గావించు
నందుఁ గపిల నిచ్చునాతఁ డిరువ
దొక్కతరమువారి నూర్ధ్వలోకమునకు
ననుపఁ జాలు వికచవనజవదన! 191

క. విను భూమిదానకర్తకు
ననిమిషలోకమున నిలువ నగు సౌఖ్యంబుల్
దనరుచు నుండఁగ నెఱపెం
పున భూమి గలంతకాలమును గిరితనయా! 192

ఆ భూమి నఖిలమగువిభూతి విశేషజా
తంబు గలుగుఁ గానఁ దత్ప్రదాన
మెల్లవస్తువులును నిచ్చినయ ట్లగు
దానఁ బోని పాపతమము లేదు. 193

క. ఆతివా! కన్నియ నిచ్చినఁ
బితృపతి ముద మందు సురులుఁ బ్రీతు లగుదు రం
చితిగతి కర్తకు దొరకును
నతితేజ శ్రీయశః మగు నభ్యవముల్. 94

తే. విద్య యిచ్చుట సత్పాత్ర విషయమైన
నవ్యయానందపదముఁ జేయంగఁ జాలుఁ
దగఁగదక్షిణ యిచ్చి పేదలకు విద్య
యీ నియోగించుటయుఁ దత్సమానకృతియ. 195

సీ తిలరాశి యిచ్చినఁ గలుగు నగ్నిష్టోమ
ఫలము వాసోదానఫలము చిరత
రాయువు గోడు గేగి యఖిలపీడలఁ బాపు
దాసదాసీజన దానమహిమ
కర్మవిమోక్షంబుఁ గలిగించు దీపదా
నముఫల మాత్మాతివిమలభావ
మంబు ప్రవాహంబు నధిగమింపఁగఁ జేఁత
నిఖిలవ్యసనముల నిస్తరింపఁ

ఆ. జేయుఁ దెరువు లెప్ప సేయుట సంతాన
మిచ్చు నౌషధంబు నిచ్చు టెల్ల
తెవులు బాపు సాదు దెరువరి కునికిప
ట్టొసఁగుఁ టొసఁగుఁ దనుసుఖోదయములు. 196

వ అనిన విని యజ్ఞంబు తెఱం గెఱిఁగింపవే యని పార్వతి ప్రార్థించినం
బరమేశ్వరుండి ట్లనియె.

సీ. విను మింతి వైదికంబును లౌకికంబును
నన రెండు దెఱఁగులు యజ్ఞవిధులు
వర్ణయోగ్యార్జన వర్ధనాంచితధన
ధాన్యముల్ గొనిదేవతలకుఁ దృప్తి

యగునట్లుగా ఋత్విగర్చన మొప్పఁగాఁ
గావించునది వైదికంబు దేవ
తలకు మహోత్సవంబులు సేయుటయు గీత
వాద్యనృత్యము లనవద్యములుగ

ఆ. సంఘటించుటయు సద్గంధమాల్యధూ
పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయు లౌకి
కంబు రెండు నమరగణహితములు. 198

తే. ధర్మములు దానములును సద్వ్రతచయంబు
సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ
యజ్ఞకర్తలోకోత్తరుం డతని కిచ్చు
టతనిచేఁ గొను టధికపుణ్యములు చెలువ. 199

ఉ. మానసకృత్యముల్ సురసమాక మెఱుంగఁగఁ జాలుఁ గావునన్
మానస మెక్కడేనిఁ జన మంచిగఁ జేసిర యేని యజ్ఞమున్
దానము నాదియైన సుకృతంబులు లగ్గ ఫలింప నీదు త
ద్ధ్యానపరత్వ పూతసుకృతంబులకున్ ఫలమిచ్చు మెచ్చుచున్. 200

క. అని చెప్పిన హిమవద్గిరి
తనయ త్రిపురవైరితోడ దైవికవిధులే
వినఁ గని సంతోషించితి
వినిపింపుము పైతృకంబువిధము వృషాంకా. 201

సీ. అనిన నాసర్వజ్ఞుఁ డద్దేవి కిట్లను
గయ కురుక్షేత్రంబు గంగ యాది
యగుపుణ్యదేశంబు లతిఫలదంబులు
మాఘభాద్రపదాఖ్యమాసములు బ
హుళపక్ష మపరాహ్ణముగ్మలి! యమవస
ద్వాదశిననములు వరఁగు దుష్టిఁ

పితృదేవతల కిచ్చుఁ గుతపదౌహిత్ర తి
లలు నితాంతపవిత్రములు పితృక్రి

తే. యలకు శౌచ మక్రోధ మవ్యగ్రభావ
మర్థ్యములు శుక్లపక్ష పూర్వాహ్ణయుగ్మ
దివస జన్మదినములు నిందితము లాజ్య
ముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి. 202

క. శ్రోత్రియు ఁ రోగు లవికల
గాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా
రిత్రత్వము ముఖ్యంబు స
గోత్రు మృతకళత్రు నన్యకులుఁ గొన రతివా! 203

ఆ. గంధపుష్పమాలికా ధూపదీపవ
స్త్రముల నర్చ లిచ్చి తగఁగఁ భోజ
నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర
దానవిధి యొనర్చు టేను మెత్తు. 204

వ అని యెఱింగించిన మేనకాత్మజ మృడునియె నిట్లనియే. 205

క. మృతిఁ బొంది పునర్జన్మము
నతగర్హ్యగుణజంతుకోటి యప్పుడ పొందుం
బితృపూజన మని యెవ్వరి
కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శివా! 206

ఆ. అనుడు నచట నున్న మునిజనులెల్లను
నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ
డిచ్చునుత్తరంబు నేర్పడ వినువేడ్క
గదుర నుండి రపుడు కంసదమన! 207

సీ. అంబిక కిట్లను హరుఁడు సందేహింపఁ
దగునది యిది గుహ్యతమము వినుము

దివిజు లట్టుల పితృదేవతలను దేవ
బృంద ము త్తరదిశఁ బితృచయంబు
దక్షిణదిశ నుండుఁ దత్పూజనంబులు
వరుసన హవ్యకవ్యంబు లండ్రు
చచ్చినవారికి శ్రాద్ధంబు సేయఁగా
నాపితృసంఘంబు హర్ష మొంది

తే. యాయువును శ్రీయుఁ గీర్తియు నాది యైన
యైహికంబులు సుగతియు నాదరమునఁ
గర్తనొసంగు సురాసుర గరుడయక్ష
తతులకును బూజనీయంబు పితృగణంబు. 208

వ. అని నిర్దేశించి వెండియు. 209

క. తమతమసారములకుఁ దగఁ
గమలాక్షి! చేయుదానకల్పనలవిశే
షము లొక్కరూప యగుఁ ద
త్ప్రమాణరూపణము చేసి పలికెదఁ దెలియన్. 210

క. విను మొకకుంచెఁడుధాన్యము
తన కాయతి గల్గునతఁడు దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁ డ
ద్ధన మొసగిన నొక్కరూప తత్తత్ఫలముల్. 211

క పరుషత్వము లేకంతః
కరణంబున శుద్ధి చాలఁ గలిగి ప్రియము పొం
పిరవోవఁ జేత దానము
పరమోత్కృష్టంబు పద్మపత్త్రనిభాక్షి. 212

క. అని చెప్పి కొన్నిదర్వము
లనఘా యెఱింగింతు నీకు నపదానముతో

వినుమని పలికి శివుం డి
ట్లను విశదము గాఁగఁ గూర్చి యంబుజనాభా! 213

చ తెవుళులు గొన్నవారి కవి దీఱుట కౌషధ మీగి దుర్గతుల్
దవులుజనాలిఁ బ్రోవు సుపథంబుగఁ దైర్థకకోటిఁ దన్పు బాం
ధవరహితత్వ దీన శవదాహము దుఃఖితు లైనవారిఁ దే
ర్చ వెరపు నోర్పుఁ గల్మియును బ్రస్తుతి కెక్కినమేటిధర్మముల్ 214

వ. అని పలికినఁ బార్వతీదేవి పరమప్రియంబు నొంది 215

—: శివుఁడు పార్వతికి ధర్మవిశేషంబులు అంతె గెఱింగించుట :—

సీ. ధర్మంబు నానావిధంబులఁ బరగు నం
దవి యెఱిఁగింపవే యనుడు హరుఁడు
వితతంబు లగు శ్రుతిస్మృతులచేఁ జెప్పఁగాఁ
బడినతెఱంగులు పడఁతి వినుము
జాతిధర్మములు దేశజధర్మములుఁ గుల
ధర్మంబులును గణధర్మములును
గాయంబు వికృతులఁ గాలపర్యయముల
వచ్చునాపద్ధర్మవర్తనములుఁ

ఆ. గాఁగ నిట్లు ధర్మగతు లైదు గలవని
చెప్పుటయును గౌరి శివునితోడఁ
బుణ్యలోకకలితభోగంబు లెట్లుండు
ననిన నిట్టు లనియె హరుఁడు గృష్ణ! 216

సీ ఎల్లపుష్పంబులు నెక్కాలమును దద్ధ
విలసిల్లుఁ గల్పకవృక్షజనిత
మనులేప మాహార మమృత మంబరములు
నిత్యామలివములు నిరుపమాన
భంగి దీప్తంబు లాభరణముల్ వాన ర
మించుచు నన్యోన్యమిత్త్రభావ

మొప్పంగ మేనులయొప్పును మనముల
మార్దవంబును గుణమాన్యతలును

తే. గలిగి పురుషులుఁ గాంతనాఁ గామహర్ష
లీల లెసఁగఁ గ్రోధాదులు లేక రుజయు
జరయు నెఱుఁగక నలిఁ జరింతురు దివంబు
నందు సంతతనిర్భ రానంద మొంద. 217

వ. అనిన విని హైమంతి సుగతి దుర్గతులకుం జనంగల వారిం జూచి యీ రిట్టి వారని నిశ్చయింప వచ్చుట రామి యెఱింగింపు మనవుడు మృడుండు విను మని యిట్లనియె. 219

చ. జనులకుఁ గీడు రోయం యజ్ఞనము ధర్మరతిం ఒరించి స
జ్జనగురు పూజనంబులును సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును భూరిదయార్ద్రితయుం గలట్టివా
రనిమిషలోకగాములని యాత్మ నెఱుంగుము మేనకాత్మజా! 219

చ. పరుసని పల్కు బొంకు లగుపల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోలతయు బాంధవసజ్జనవిప్రియంబు దు
శ్చరితులతోడిమైత్రియును సంతత ధర్మరతాభ్యసూయయుం
గరినిభయానః ఘోరనరకంబున కేఁగెడి వారి చిహ్నముల్. 220

క. అని చెప్పిన విని హిమగిరి
తనయ! వృషధ్వజునితోడ ధర్మంబులు పె
క్కనుపమమూర్తీః పరమం
బనఁ జాలెడు ధర్మ మెద్ది యక్కెటిలోనన్. 221

వ. చెప్పు మనిన నప్పరమేశ్వరుం డిట్లనియె 222

క. రమణీః వర్గత్రయధ
ర్మము లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరముల్
గమనాగమకరములు ని
త్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్. 223

సీ. కావున విను త్రివర్గంబుకంటెను మేలు
దలపోయ మోక్షంబు దానిఁ బడయు
తెఱఁ గెఱింగించెదఁ దెఱవ గృహస్థ ధ
ర్మంబున నిల్చి ఋణంబు లెల్లఁ
బాచి వనమునకుఁ బరమశాంతత నేఁగి
సద్గురుముఖమున సాంఖ్యయోగ
విదుఁ డగునది పంచవింశతిజ్ఞానంబు
సాడఖ్యంబు ధర్మనిశ్చలత యోగ

తే. మాసమాచారయుగళ మేకాధికరతి
మస్ఖలితముగ మది నది యలవరించి
ధ్యానపరుఁ డయి శీతోష్ణహర్షశోక
ముఖము లగు వివిధద్వంద్వములఁ దొఱంగి. 224

ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు లఘ్వశనంబు నై యిశం
జూచుచు నంతరాత్మ నెడ సొచ్చిన విఘ్నవిశేషమున్ ధృతిం
ద్రోచుచు భక్తియుక్తికి గురుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు చొప్పడున్. 225

తే. అది సదాభ్యాసకలన నత్యంతనిర్మ
లంబు నవ్యయమును నచలంబు ఘనంబు
నై జరావ్యాధిమరణజన్మాదిదుఃఖ
బహుళసంసారచక్రంబుఁ బాప నేర్చు. 226

వ. అని యుపదేశించి వెండియు. 227

క. విను సంసారమునకు విసు
వనిమర్త్యుఁడు శోకమోహవశగతుఁ డై మో
క్షనిరూఢిఁ బడయ నేరఁడు
మనము విరక్తముగ విసివి మఱి ముక్తిఁ గనున్. 228

వ. అట్టిదశ చింతావివర్జనంబునను భూతాస్థిరత్వజ్ఞానంబునను దృష్టారాహి
త్యంబునను గాని కలుగదు గావున వానిభంగులు ప్రకటించెద. 229

సీ. ధనములు చెడిన బాంధవులు సచ్చినఁ దదీ
యము లగు గుణములయందు మనసు
పెట్టకయున్నది యెట్టన్న వగచినఁ
దాపంబు వొందుటఁ దక్క నొండు
గలుగునే సుఖము దుఃఖంబును దోడివ
యవి మార్చి వచ్చుచు నరుగుచుండుఁ
గేవలసుఖములే దావాసవునకైనఁ
జేటు దృశ్యములకుఁ సిద్ధ మగుట

తే. మున్న కని యున్నవగ చిత్తమున జనింప
దరయఁ గీడు పరిగ్రహ మది సమగ్ర
మైనతఁడు పౌత్తినూలి ప్రువ్వట్ల తాన
తనకు బంధంబు గావించుకొను లతాంగి! 230

ఆ. విను ధనార్జనంబు ధనరక్షణంబు ధ
నవ్యయంబు ధనవినాశముఁ బ్ర
గాఢదుఃఖదములు గావున దుఃఖభా
జనము ధనము గాల్పు మనఁగ వలయు. 231

క. రమణీ! తృష్ణాసమదుః
పమును బరిత్యాగసమసుఖముఁ గలవేః కా
యము ముదిసిన ముగియదు ప్రా
ణముగొని పోఁ జాలు తెవులనం జనుఁ దృష్ణన్. 232

క. కామములు భోగములఁ దెగు
నే మెలఁతుక నేత నాఱునే చిచ్చు ధృతిం
గామములఁ దొఱఁగు సౌఖ్యము
నేమెయి సౌఖ్యములుఁ బోలునే యరయంగన్. 233

క. విచ్చలవిడి నింద్రియముల
నెచ్చటికైనను జనంగ నిచ్చిన నరకం

బచ్చుపఱచుఁ గుదియించినఁ
దెచ్చు సుగతి నరున కది సతీమౌళిమణీ! 234

తే. కామరసమున నతితృష్ణుఁడై మనుష్యుఁ
డర్థతృష్ణాపరీతాంతరంగుఁ డైన
గొఱియ నడవిలో నెత్తెడుకోలుపులియుఁ
బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి! 235

వ. అని పలికి జరామృత్యువులఁ ద్రోవం జాలుమే లెయ్యది యం టేనిఁ
జెప్పెద నాకర్ణింపు మనుపలుకు పలికి యిట్లనియె. 236

తే. ధనములును దానములుఁ దపోధనము వాజి
పేయరాజసూయంబులు పేయు నోపి
చేయుటలు గావు మోక్షదర్శిత్వ మొకఁడ
మందు జరకు మృత్యువునకు నిందువదన! 237

తే జాములును దివసములు మాసములు నేండ్లు
నై నకాల మాయువుఁ గొని యరుగుచుండు
నెల్లి చేయుపనులు నేఁడ యింతి! మాపొ
నర్చుపని రేప చేయుట నామతంబు. 238

తే. మేలు గడువేగ చేయరు కాలపాశ
బద్ధులై యేమఱుటఁ జేసి పడఁతి! మనుజు
లింత యెఱుఁగుట సంసార మెడలఁద్రోచు
నట్టివిసువుటఁ బుట్టించునది హితంబు. 239

వ ఇవ్విధంబున. 240

క. ఈతెరువు లాదరింపఁగఁ
జేతోగతికిని విమర్శసిద్ధి యొదవుఁ ద

జ్ఞాతవిరక్తియు ముక్తికి
నాతెరువ సమీపవర్తి యచలేంద్రసుతా! 241

క. వైరాగ్యంబు ప్రశాంతికిఁ
గారణము ప్రశాంతిముక్తిఁ గను మోక్షానం
దారాము జరామృత్యువు
లేరూపునఁ జేరనేర విద్ధచరిత్రా! 242

క. అని చెప్పి మఱియు శివుఁడి
ట్లను హిమగిరిసుతకు సాంఖ్య మమలినహృదయా!
విను వివరించెద సంసృతి
యనురోగంబునకు వైద్య మది యరయంగన్. 243

—: శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట :—

ఆ. జ్ఞానమున విముక్తి సాంఖ్యులు వడయుదు
రరసి చూడఁగా నిరర్థకంబు
ఘోరతరము సంద్రడు శారీర మైనత
పంబుఁ బంచవింశభజన మూఁది. 244

సీ. ప్రకృతి కవ్యక్తనామకమును గలదందు
మహదంకారతన్మాత్రలును మ
నము నింద్రియములు భూతములు జన్యములుగో
నోలన యిరువదినాలు గయ్యెఁ
బంచవింశకతత్వభావితక్షేత్ర మా
తత్వసంతానంబు సత్వమును ర
జస్సుఁ దమస్సునాఁ జనునిజగుణములఁ
బ్రకృతిదాఁ గరణరూపములు గాఁగ

ఆ గొని సృజించులోకకోటి నయ్యవ్యక్త
మణువు నిత్య మేక మక్రియం బ

హైతుకంబు చక్షురాదుల కగ్రాహ్య
మది ప్రధాన మనఁగ నతిశయిల్లు. 245

తే. సౌఖ్యతుష్టి ప్రకాశముల్ సాత్త్వికములు
మోదఖేదాదిక ద్వంద్వములు లతాంగి!
రాజసము లప్రకాశసంత్రాసమోహ
ములును దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు. 247

క. ధృతి విజ్ఞానశ్రద్ధలు
నతివ! యసమ్మోహమును దయయు హర్షమునం
చేతసత్త్వవృద్ధిఁ బరివ
ర్ధితంబు లగు సత్త్వమరుగఁ దెరలుం దారున్. 248

తే. క్రోధలోభకామానృత ద్రోహచింత
తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ
జేయు వానికి నెల్ల సంక్షీణభావ
మావహిల్లు రజః క్షయమావహిల్ల. 248

తే. సంశయంబు విషాదంబు జడత నిద్ర
వినుః తమస్సు వర్ధింపఁగాఁ బెనుపు నొందు
నది విహీనతఁ బొందిన నవియు హీన
భావ మొందు వికస్వరపద్మనయనః 249

సీ ఒక్కఁ డొక్కనిచేత నెక్కుచుఁ దఱుగుచుఁ
త్రిగుణంబులును బ్రవర్తించు వీన
జనితంబులగు ప్రీతిసంతాప మోహాదు
లొదవినఁ దత్తద్గుణోదయములఁ
గని యుపేక్షించుచు మనము నూనఁగ నీమి
కార్యంబు ధర్మార్థకామములకు
నమరః మనుష్యతిర్యగ్జననములకు
మూలముల్ సత్త్వాదు లోలి నెఱుఁగు

తే. బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ
మది వివేక విజ్ఞానచిహ్నంబు భూత
జని యహంకారమునకు లక్షణ మహంక
రణము దొలఁగుట మోక్షకారణము దేవి! 250

ఆ. అన్ని యింద్రియముల నడరింప మగుడఁ జే
యఁగ మనసు చాలు నదియు నదియు
భూతతద్వికారములును దేహము తద
న్యుండు దానఁ బొగగి యుండు దేహి: 251

క. విను దేహియు దేహము వే
ఱను నిశ్చయదృష్టి గలుగునాతఁడు చాలుఁ
మనసు మగిడింప నది ని
ర్మనస్కతఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్. 252

వ. అప్పుడు ప్రకృతిం దొలంగి పంచవింశకుండు వెలుంగు నాతత్త్వంబు పరమహంసుం డనం బరఁగుఁ దద్విజ్ఞానంబు శాంతిసాధ్యంబును బరమ శాంతిపదంబునై యుండు. 253

మ. రసగంధాదిగుణాలి లేమి నవికారత్వంబునన్ సర్వసం
వసనవ్యాప్తి నణుత్వభంగిని మహత్త్వస్ఫూర్తిఁ జక్షుఃప్రభృ
త్యసమాలంబితఁ దేజరిల్లు పరమాత్మాఖ్యంబు షడ్వింశకం
బు సమత్వంబున జూచుశాంతుఁ డతివా! పొందున్ విమోక్షస్థితిన్. 254

వ. ఇది కపిలాది పరమర్షి సేవితం బైనసాంఖ్యదర్శనంబు యోగప్రకారంబు వివరించెద. 255

సీ. విను మింద్రియంబులు మనసును బుద్ధియు
నాత్మయందు నొక్కటి యగుటఁ గాన్పు
యోగపరిజ్ఞాన ముగ్మలి! యగ్ని స
మారాధనంబును నధికవాగ్వి

వర్జనంబును సత్త్వవత్త్వంబు దానాధ్య
యనములు శౌచసత్యములుఁ బాప
ములఁ బాపుఁ బాపనిర్ముక్తుఁడై మఱియోగ
మాచరింపఁగ యోగ్యుఁ డగునరుండు

తే. మనసు పట్టుట ముఖ్యపుటనువు దాని
కామిషము గాలగాని కెట్లట్ల శుచియు
నజనమును నగుచోట మృద్వాసనమునఁ
గాయమున కార్జవముభంగి గలుగ నుండి. 256

క. మనమున నైదింద్రియములు
నునిచి మనం బాత్మ నల్ల నొదిఁగింపఁగ నె
క్కొని ప్రాణంబు నపానం
బును వశ్యత నిలుచు యోగమున సిద్ధికినై. 257

తే. అనహితుం డయి తద్దశ యనుభవింపఁ
గా నపానమిశ్రప్రాణగతికి మూర్ధ
మతివః యమ్మెయి నెల వగునతఁడ చూవె
జీవుఁ డనఁ బరమాత్ముండు నా వెలుంగు. 258

వ. అని వెండియు. 259

ఉ. ప్రాణు నపానునందును నపానునిఁ బ్రాణునియందు నిల్పి ని
ర్వాణముఁ గోరి చిత్తము తిరంబుగఁ బట్టఁగఁ బ్రాణసంయమా
క్షీణత దేహమధ్య శిఖిఁ జిమ్మగఁ దత్త్రియ మొందు మూర్తపా
రీణతఁ గోర్కె నల్పు నపరిచ్యుతిఁ దగ్గతుఁ డైనయోగికిన్. 260

వ. అని చెప్పి వెండియు. 261

చ. అరసతయున్ విచిత్రతయు నత్యశనాదరణంబు రోగముం
గలయును లోభమున్ భయముఁ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో
ధులు విను యోగసేవకు నదుష్టవఁ బేర్చిన యోగ మిచ్చు సి
ద్ధు లెనిమిదింట నప్రతిహతుం డయి యోగి చరించు నెల్లెడన్. 262

